Dr DayanandaSwamy ebooks

# శుద్ధ నిర్గుణతత్వ కందార్థములు

( తాత్పర్య విశేషార్థ సహితము )




గ్రంథకర్త :

శ్రీ భాగవతుల కృష్ణదేశికులవారు

Dr DayanandaSwamy ebooks

# శుద్ధ నిర్గుణతత్వ కందార్థములు

( తాత్పర్య విశేషార్థ సహితము )




గ్రంథకర్త :

శ్రీ భాగవతుల కృష్ణదేశికులవారు

Dr DayanandaSwamy ebooks

ఓం

శ్రీగురవేనమః

# శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థ దరువులు

గ్రంథకర్త:

అచల పరిపూర్ణులగు

## శ్రీభాగవతుల కృష్ణదేశికులవారు

———:o:———

శ్రీయుత వైశ్యరత్న, చిదానంద

చెర్విరాల భాగయ్యగారిచే

తాత్పర్య విశేషార్థము వ్రాయబడినది.

ప్రకాశకులు :

**కొండా శంకరయ్య,**

**పుస్తకములవ్యాపారము,**

**సికింద్రాబాదు**

బ్రాంచీలు:- హైదరాబాదు & వరంగల్.

1956

కాపీరైటు రిజిష్టర్డు

వెల 1-0-0

Dr DayanandaSwamy ebooks

# పీ ఠి క.

ఆర్యులారా !

ఈ గ్రంథమును వ్రాసినవారు శ్రీభాగవతుల కృష్ణదేశికుల వారు. వీరు శ్రీ శివరామదీక్షితాచల గురుపరంపర పీఠాధిష్ఠ అచలపరిపూర్ణమే నిక్కమని నొక్కి వక్కాణించిరి. ఎఱు... పూర్తిగా విడువుమని బోధించి యుండిరి. ఈ శుద్ధనిర్గుణ తత్త్వ కందార్థములకు బలువురు పలువిధంబుల అర్థములు వ్రాసిరి. అయినప్పటికిన్ని ఇందు మిక్కిలి గూఢార్థము నిమిడియుండుటచే పామరులకు దెలియుట దుష్కరమయ్యెను. అందువల్ల కొందరి నామిత్రుల ప్రోత్సాహంబున ఈకందార్థములలోని యదార్థమును ఎల్లరకు దెలియునటుల వ్రాసి సుప్రసిద్ధ పుస్తక వ్యాపారులగు మ॥ రా॥ శ్రీ కొండా శంకరయ్య సికింద్రాబాదు గారికి సర్వాధి కారములతో సమర్పించితిని. ఇందలి నాపొరపాట్లను ప్రాజ్ఞులెరిం గింతురేని పునర్ముద్రణమున సవరింతునని వినయ పూర్వకముగా ప్రార్థించుచున్నాడను.

ఇట్లు

5-10-56.
మషీరాబాదు

వైశ్యరత్న, చిదానంద
చెర్విరాల భాగయ్య కవి.

Dr DayanandaSwamy ebooks

ఓం

శ్రీగురవేనమః

# శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థ దరువులు

తా త్ప ర్య వి శే షా ర్థ స హి త ము.

క॥ జనులార ! జననమరణము । లనుదొలగం ద్రోయు జాలు లక్షణయుతమై । వినువారికి గనువారికి । దన లావెఱిగించుదీ(ని ॥ దప్పకవింటే । అప్పుడె వార లెప్పుడు గంటే ॥ గనుక వినబుద్ధయితే । వినుడు చదివెద మీకె । కను(గొన మనసైతె । కను(డి పుస్తకమంత । తప్పకవింటే ॥ అప్పుడె వార లెప్పుడు గంటే ॥ 1

తా॥ ఓ జనులారా ! జననమరణాదులు లేకుండ జేయునట్టి లక్షణ యుక్తమైన, యీ గ్రంథరాజమును (కందార్థములను) వినుపించువాడను. దీనిని మీరు విన్నంతమాత్రమున, లేక జదివినంతమాత్రమున తన మహత్త్యమును గనబరచును కావున మీకు వినవలయునని కోరికయున్నచో వినుడు, నీపుస్తకము నంతయు నెల్లప్పుడు పఠింపుడు.

క॥ వినవలె గనవలె నంచును । మనమందున( గోర్కెగల్గు మనుజులె వినుడీ । విన(జేసెద గనజేసెద । ఘనమగు నీబోధ విన(గ(॥ గననొల్లనట్టి । వాడుచను(డు । తోచినత్రొవ(బట్టి। తినుమంటె పులి "వల్లదని" లోకులనవింటి( । గనుక నిది వినవలెనని । నోరాడదు విన(గ ॥ గననొల్లనట్టి । వారు చను(డు తో(చిన త్రొవబట్టి ॥ 2

Dr DayanandaSwamy ebooks



తా॥ ఈ గ్రంథమును చదువవలె నను వాంఛ గలవారే చదువుడు. వినగోరినవారే వినుడు. అట్టివారిని చదువునట్లు వినునట్లు జేసెదను. దీనిని జదువుటకు వినుటకు నిష్టములేనివారు దమకు యిష్టమువచ్చిన మార్గమును బట్టిపోవచ్చును. "తినుమన్న పులివల్లద"ను లోకోక్తిగను, విన నిష్టములేని వారిని వినుడనియు, చదువ నిష్టములేని వారిని జదువుడనియు దెల్పుటకు నాకు నోరాడదు.

క॥ నను మిము నేఁగని పుస్తక। మును జేసితి, దీనిమీరు ముదమున వినుఁడీ। యనుటయు, మిమునను మీరలు గనుఁ గొని వినుపించుమనుట ॥ కలయట్టిమాట। బోధను మేలుగనలేదె చ్చోట ॥ ఘనులార యిటువంటి కలనుముచ్చటలాడి। గనుగొని మీరు మేల్కని మేల్కొల్పుడు నన్ను। గలయట్టిమాట ॥ 3

తా॥ ఓ ఘనులారా! నన్నును మిమ్ములను జూచియే యీ పుస్తకమును రచించినాడను. "మీరు దీనిని సంతోషముతో వినుడు" అని నేను మిమ్ముల బ్రతిమాలుటగాని, లేక మీరే "ఈ గ్రంథమును జదివి వినిపించు" మనుటయు గాని కలలోని మాటసుమా! ఈ ప్రపంచము స్వప్నమువంటిది. మనమెల్లరము స్వప్నములోనే మాటలాడి యీ బోధనెరుంగవలయును. మీరు యీ స్వప్నమునుండి దెలివొంది నన్నును దెలివొందజేయుడు. కలయని యూరకున్నచో ప్రయోజనము లేదు.

క॥ ఒరులొరులు నేను నేనని। యొరులను దనుఁ నెన్న డెఱుఁగకుండు, బయలులో। నరుదెంచి, తన్నుదాఁగని పరులను గని, తెన్నయేను ॥ బరులని యనుచూ। నెఱిగెడి ఎఱుక బయలుండఁ గనుచు ॥ నిరతము తానెందు నిలువ కుండుటకునై। విరచించితిని దీని వినిన నిల్వదునేను ॥ బరు॥ 4

తా॥ ఒరులొరులు నేను నేనను భావముచే, తనకును పరులకును

Dr DayanandaSwamy ebooks



భేదము పాటించునదే యెరుక, తనకును యొరులకును యేమాత్రము భేదము పాటించనిదే పరిపూర్ణము. తనకుగల వివేకముచేత "నేను, పరులు" అని యూహించు యెరుకను యేమాత్రము నిలువకుండ పారదోలుటకే ఈ గ్రంథమును వ్రాసితిని. దీని నెల్లప్పుడు వినువారికి, జదువువారికి "నేను" అను అహంభావము యుండదు.

క॥ శ్రీమించు నచల బోధను । నే మహనీయుండు చేసి
యెగఁజల్లెను నీ । భూమిన్ సుజనుల కొఱకా । రాముండగు
గురునిశివ ॥ రామదీక్షితులన్ । దలఁచి యప్పా రావు గుణత
తులన్ । ప్రేమతో బొగడనౌ భూమినిర్జర పరశు । రామ సీతా
రామస్వామికి మ్రొక్కి ॥ శివరామ ॥ 5

తా॥ పూర్వమే శుభకరమైన యచలబోధను, ఈభూమియందలి సుజనులకొరకై యేమహాత్ముడు వ్యాపింపజేసెనో, అట్టి శివరామ దీక్షితులను స్తుతించి వారి శిష్యుడైన అప్పారావుగారి గుణగణంబును గొనియాడి, భూసురుండైన పరశురామ సీతారామ స్వాములకు నమస్కరించి ( ఈ గ్రంథమును రచించెదను.)

క॥ ఎఱుకనుఁ గలలోపల, నే । నరుదెంచితి, మీర లట్టు
లరుదెంచితి, రీ । ఎఱుకనన, నేను మీరలు । నెఱుకతోఁ జను,
వార మనుచు ॥ నెఱిగెడికొఱకు । గ్రంథముఁజేసితి, నెఱిగి యీ
వరకు । గురుబోధంచును మీరు నరులార చేకొంటె । ఎఱుకను
కలజోలి నెఱిగిన నిల్వదం ॥ చెఱిగెడి కొఱకు ॥ 6

తా॥ ఓ మానవులారా ! ఎడుకయనెడి స్వప్నమందు నేనరుదెంచితిని. నావలెనే మీరుగూడా నరుదెంచితిరి. యీ యెరుకయనగా, నేనును మీరలును. ఈయెరుక యెప్పుడుపోవునో, మనముగూడ నప్పుడే పోవువారము. ఇది మీకు దెలియుటకై ఈగ్రంథమును రచియించితిని. ఈపరిపూర్ణబోధ

Dr DayanandaSwamy ebooks



వలన యెరుకయను స్వప్నము నశించును. దీనిని మీరు గురుబోధగా నమ్ముడు. అట్లు నమ్మినచో యెరుక యను స్వప్నమునుండి మెలకువ జెందుదురు.

విశే:— ఎఱుక యనగా ఒకప్పుడుండునటుల దోచి యింకొకప్పుడు లేకుండ బోవునది. పరిపూర్ణ మనగా ఎల్లకాలము ఒకేతీరుగా నుండునది యని తెలియవలెను.

క॥ శ్రీమత్సీతారామ । స్వామికృపం జెప్పెనయ్య సదస ద్రహితం । బేమిపదార్థము దానిని । నీమహిఁ గందార్థములుగ॥ నిదివినరయ్యా । ఓజనులార యిటుగానరయ్య ॥ వేమారు నే మిమ్ము వేడుటింతియసుమ్ము । నామీదఁ గృపఁజేసి ననుజదువు మనిమీర ॥ లిదివినరయ్యా॥ 7

తా॥ శ్రీమత్సీతారామ స్వాములవారి కృపవలన దేనిని సదసద్రహితం బని జెప్పబడెనో, దానినే ఈ కందార్థములుగా వ్రాసితిని. ఓజనులారా! నా యందు దయగలవారలై దీనినిం జదువుడు. లేక నన్ను జదువుమని ప్రోత్స హించుడు. నేను జదివినపుడు శ్రద్ధతో నాలకించుడు. అని ప్రార్థించు వాడను.

విశే:— సదసద్రహిత మనగా = సత్తు అసత్తును గాని పరిపూర్ణ బోధయని తెలియవలెను. సత్త నగా = ఈశ్వరుడనియు, అసత్త నగా = జీవు డనియు, ఈ జీవేశ్వరులకు వేరుగా నున్నది పరిపూర్ణ మనియు దెలియ వలెను.

క॥ శివరామ దీక్షితుల శి । ష్యవరుం డప్పయ్యమంత్రి యతని శిషుఁడీ । భువిఁ బరశురామ వంశో । ద్భవు సీతా రాములతని ॥ భక్తుఁడ సుమ్మీ । తద్బోధ ప్రియుక్తుఁడసుమ్మీ ॥ స్తవనీయులగు మీ రుత్సాహముతో నీకథ । వినుఁడు । నే గందా ర్థములచే వినిపింతు ॥ భక్తుడసుమ్మీ ॥ 8

Dr DayanandaSwamy ebooks



తా॥ శివరామ దీక్షితుల వారికి బ్రియశిష్యుడు, అప్పయమంత్రి (ఈ తనినే కంబాలూరి అప్పారావందురు) అతని శిష్యుడు పరశురామ వంశోద్భవు లగు సీతారామస్వామి, వీరిశిష్యుడను నేను. వారి అచల బోధను యుక్త మని నమ్మి ప్రవర్తించువాడను. అందువల్ల నీకందార్థములను వ్రాసితిని పూజ్యులగు మీరెల్లరు నుత్సాహముతో వినుడు. నేవినుపించువాడను.

క॥ మనసిచ్చి వినుఁడి, యిఁకనొక । మనవిది నాపాలి గురుని మదిలోపల, నే । నునుచుకొని పెద్దలాజ్ఞను । పనిఁబూనుక చేసితిట్టి ॥ పద్యములు విన్న । దప్పొప్పు లేర్పఁడ దిద్దు డన్న । ఘనమతి మంతులు గనుకఁ బ్రార్థించితి । నను మీకటాక్షేక్షణముల వీక్షింపుచు ॥ పద్యములువిన్న ॥ 9

తా॥ మీరెల్లరు నిశ్చల మనస్కులై వినుడు. నా గురువర్యులను నా మనస్సునందిడుకొని పెద్దలగువారి యాజ్ఞానుసారముగా రచించిన ఈకందార్థములను విని, ఇందలి తప్పులను యొప్పులుగా దిద్దుడని బుద్ధి విశాలురగు మిమ్ములను బ్రార్థించు చున్నాడను. కావున నన్ను మీకృపాదృష్టిచే వీక్షించుడు.

కం॥ వినిమీరిది దిద్దుండని । పని వడి ప్రార్థింపనేల పరుసము నిను మే । నను స్వర్ణముఁజేయు మనునె । తనకైతానౌను సన్ని ॥ ధానమందుంటే । తెల్పుడి యను మాన మిందుంటే ॥ మనవిజేయునె పాలిమ్మనివేగఁ దల్లిని। దనకై తానిచ్చుచు దయఁ జేసి తా ॥ సన్నిధానమందుంటే ॥ 10

తా॥ ఎటులైతే, ఇనుము తనను బంగారముగా జేయుమని పరుసవే దిని ప్రార్థించదో, ఎటులైతె, నోరెరుంగని చంటిబిడ్డ తన తల్లిని పాలిమ్మని బ్రతిమాలదో, (అనగా పరుసవేది సన్నిధానమందున్న యినుము దాని స్పర్శ మాత్రంబున బంగార మగును. మరియు బిడ్డ కోరక మునుపే తల్లి ప్రేమ

Dr DayanandaSwamy ebooks



తో బాలిచ్చుచుండును) అటులే ఈగ్రంథమందలి తప్పులను దిద్దుడని నేను పనిబూని మిమ్ము ప్రార్థింపనేల ? మీకు తప్పులుగా దోచినచో మీయంతట మీరే సవరించుడు.

క॥ అప్పకవీ యాద్యాంధ్రము । లొప్పగు మాఘాదికృతుల
నొగిజదివి, కృతిఁ । దప్పని కవులకు సమముగఁ తప్పులులే
కుండఁజెప్పఁ ॥ దరమౌనె కృతినీ । ఊహనుజేసితిని నేనీకృతినీ॥
గొప్పపక్షులతోటి, గొదువపక్షులుసాటె । యుప్పర వీధిని, నూటాడె
టందుకు ॥ తరమౌనెకృతినీ ॥ 11

తా॥ గండ భేరుండాది గొప్ప పక్షులతో సమానముగ చిన్నజిన్నపక్షులు నెగురనేరనటుల, నప్పకవీయాది ఆంధ్రగ్రంథములును అటులే మాఘాది సంస్కృత కావ్యములు; జదివిన పండిత కవులతో సమానముగ, నేను తప్పులు లేకుండ కవిత్వము జేయలేను. (కావున నన్ను మన్నింపుండని గ్రంథకర్త మనవి జేయుచున్నాడు )

క॥ చందము తెలియఁగక పద్యము । లెందుకుఁ జేసెదవ
టంచు నిలజనులన, నే । సందేహింపకఁ జేసితి । నిందున తప్పు
న్నమీర ॥ లివిదిద్దెరనుచు । నేఁజదివినఁ, చెవియొగ్గి వినుచు ॥
నందముగాఁజిత్త, మందిట్లు దలపోసి । కందార్థములను మీ,
ముందరఁబెట్టితి ॥ నివిదిద్దెరనుచు ॥ 12

తా॥ నన్ను మొట్టమొదటనే కొందరు, నీవు చందస్సు(లక్షణశాస్త్రము)ను జదువక ఈ గ్రంథమేల జేసెదవని ప్రశ్నించిరి. నేనా మాటలకు సందేహింపక నిందలి తప్పులను మీరు దిద్దెదరని, నేజదివిన చెవినొగ్గి వినెదరని సంతోషముతో నాచిత్తమందు నమ్మి ఈకందార్థములను మీయెదుట బెట్టితిని నన్ను మన్నించి తప్పులుండినయెడల దిద్దుడు.

క॥ పునరుక్తి గలిగియుండిన । వినికోపము సేయవలదు

Dr DayanandaSwamy ebooks



వేడుకొనియెదఁ । వినువారలు దూరార్థముఁ । గనవలె దగ్గఱ
నటంచుఁ ॥ గల్పించినాను । తెలియకగా, దీగ్రంథమ్ము లోను ॥
జననిజనకులు తామె, తనయుల పునరుక్తి । వినగోరుదురు త,
ప్పెంచక నేనది తెలిసి ॥ కల్పించినాను ॥ 13

తా॥ తల్లి దండ్రులగువారు తమ చిన్నిబిడ్డలు వచ్చిరానిమాటలతో పలికినదే పలుమారు బలికిన నెటులైతె సంతోషింతురో, అటులే నేనీ గ్రంథమునందు చెప్పిన విషయమే మరల మరల జెప్పితిని. అది పునరుక్తి దోషమని మీరు నామీద కోపపడవలదు. ఎందుచేతననగా! వినువారికి నీగ్రంథములోని దూరార్థము బోధపడుటకైనట్లు జెప్పితిని. ఇంతియేకాని పునరుక్తి దోషమును నేను తెలియకపోలేదు. కావున నాపై తప్పెంచక దయజూడుడని వేడుకొనువాడను.

విశే:- పునరుక్తియనగా చెప్పిన పదమునే మఱల మఱల చెప్పుట, ఇది లక్షణ శాస్త్రవేత్తలు తప్పుగా భావింతురు.

క॥ ఇదియాంధ్ర కవిత్వంబని । మదిరోయగ దగదుదిని ।
మర్మమరయుడీ । పదియారు వన్నెపసిఁడిని । ముదమునఁ దో
ల్పెట్టెనుంచ॥ ముట్టకుండుదురా।లోకులు చేత బట్టకుండుదురా!
యిదిగాక కులహీను డిచ్చిన ద్రవ్యము । విదితముగానెంత వేత్త
లైనను దాని ॥ ముట్టకుండుదురా ॥ 14

తా॥ ఎటులైతె పదియారు వన్నెగల బంగారమును చర్మముతో జేసిన పెట్టియ నుంచిన లోకులు దానిని ముట్టకుందురా? కులహీను డిచ్చిన ద్రవ్యమును సత్కుల జాతుండగువాడు ముట్టకుండునా? అటులే యిద యాంధ్ర కవిత్వమని మదిలో రోయక నిందలి మర్మమును గాంచి నన్నాదరించుడు.

Dr DayanandaSwamy ebooks



క॥ ఆసాంతం బీగ్రంథము । ప్రాసయతుల్ శబ్దగణము భావముయుక్తుల్ । వాసిగ కుదరని చోటుల । నీసభలో పెద్ద లెల్ల ॥ నివిదిద్దవలెను । దిద్దినది నామది కద్దవలెను ॥ మీసాటి వారికి వేసట లిందుంటె । నాసాటి వాని బ్రతు । కేసాటిగాకుండ ॥ నివిదిద్దవలెను ॥ 15

తా॥ ఈగ్రంథములో మొదటినుండి తుదివరకు ప్రాసలు, యతులు గణములు, భావములు, పదములు సరిగా కుదరనిచో, ఈసభలో నుం డెడు పెద్దలెల్ల దిద్దవలెను. అట్లు తప్పులు గలచోట మీరు దిద్దిన దెల్లను నామనస్సుకు సరిపోవలెను. మీవంటి గొప్పవారలకే యిందు వేసట గల్గి నచో, నావంటి అల్పుని బ్రతుకేమాత్రమగును. కావున శ్రమయనక సవరింపుడు.

క॥ తప్పొప్పులు రెండెఱుఁగని । తప్పున దానుండ దీనిఁ దప్పని కూసే । తప్పుడు నరునకుఁ జెప్పెదఁ । జప్పుడు జాలించు మనుచు ॥ సభవారు వినఁగా । సరెసరెయని సభవారిట్లనగ । చెప్పిన వినకున్నతప్పు వానిదెసుమ్మి । తప్పుగల్గినవెన్క గొప్పవాడె ట్లౌను ॥ సభవారు వినగా ॥ 16

తా॥ ఇదితప్పు, ఇదియొప్పు అని గుర్తెరుంగ నటువంటి మూఢుడు దీనిని తప్పని వాదించు వానిని మాట్లాడవలదని చెప్పెదను. సభయందుం డెడు బెద్దలెల్లరు "సరిసరి" యని చెప్పిన దానిని యొప్పుకొనక తప్పని వాదించిన వాడు గొప్పవాడుకాడు. చెప్పినను వినకుండినచో వానిదే తప్పు సుమా !

క॥ ఇలు సొచ్చి గ్రామసింహము । కల దొంతులఁ గూల్చు నింటి గతిత, లొఱుగుదొం । తులసక్కఁ జేతురటులనె । యిల సుకవిజనోక్తిఁ దప్పు ॥ లెంచు, దర్జనుడు । తప్పొప్పులు గాంచు

Dr DayanandaSwamy ebooks



సజ్జనుఁడు । తులలేని బుద్ధిమంతులు । సర్వజ్ఞులు మీకు । దెలియు నాతలఁపునేఁ । దెలిపెద నిఁక తప్పు ॥ లెంచుదుర్జ నుడు ॥ 17

తా॥ గృహములో (గ్రామసింహము) కుక్క జొరబడి దొంతులుగా బేర్చబడిన కుండలు బడగొట్టగా, అది జూచి ఆయింటి ఆడువారు యెటులైతే ఆపడిపోయిన కుండలను సరిజేయుదురో, అటులే, దుర్మార్గుడగు వాడు సుకవీశ్వరు లొనర్చిన కావ్యములను తప్పులుగా నెంచును. సన్మార్గు లాతప్పులను సవరింతురు. కావున మీరు సర్వజ్ఞులగుటచే నాభావమును గ్రహింతురనీ దెల్పుచుంటిని.

క॥ తనగొప్ప నెంచరేమో । జనులని తలపోసి సాధు జన కృత కవితల్ । వినరితరులు, వినగోరిన । వినదన రాదనుచు మనసు ॥ విరచు దుర్జనుడూ । విని వినిపించు వేడ్క సజ్జ నుడూ । కనవచ్చు ముంజేతి, కంకణాలకు వేరె । ఘననిల్వు టద్దము గావలెనా ॥ మనసు విరచు దుర్జనుడూ ॥ 18

తా॥ ముంజేతి కంకణమునకు అద్దంబెందుకనునటుల, గుణములను బట్టి దుర్జనులను సజ్జనులను దెలియ వచ్చును. ఎటులన దుర్జనులు లోకులు తన్ను గొప్పవానిగా నెంచవలయునని సుకవీశ్వరు లొనర్చిన కవిత్వమును తాను వినక పోవుటయే గాక, ఇతరులను వినకుండగా జేయును. సజ్జనుడు తాను వినుచు, ఇతరులను వినుమని ప్రేరేపించు చుండును.

క॥ అగామి కథను నిట్లని । బాగుగ వినిపింతుఁ జెవుల పండువుగాగ । న్నాగమ నిగమోపనిష । త్సాగర మథితార్థమెల్ల ॥ సాంగోపాంగముగఁ । దయతోడ వినుఁడీ । సాంగోపాంగముగఁ॥

Dr DayanandaSwamy ebooks



ప్రాగర్థ చరమార్థ, యోగములకు । సంయోగము గావించి ।
నేగుర్తెరిగినంత । సాంగోపాంగముగ౯ ॥ 19

తా॥ ఇక ముందు చెప్పబోవు సంగతులన్నియు మీ వీనులకు విందగునటుల వినుపింతును. ఎటులైతే దేవతలు సముద్రమును దరచి అమృతమును పైకి దీసి యుండిరో, అటులే వేద వేదాంతములయొక్క సారమంతయు నే జదివియున్న నా యనుభవమున్నదంతయు వినిపించెదను. ముందు వెనుకటి విషయములకు గల సంబంధమును జీవాత్మ పరమాత్మ వివరమును నే గుర్తెరిగినంత మట్టుకు సాంగోపాంగముగా వచించెదను మీరు దయతో వినుడు.

క॥ మోదమునఁ బ్రొద్దు పోకకు । వాది ప్రతివాదులగుచు
పరగురు శిష్యుల్ । వాదించి రనుచు నొకసం । వాదముఁ బన్ని
తిని గాన ॥ వదలక వినుఁడీ । మొదటినుండి । తుదవెళ్ళఁ
గనుడీ ॥ వేదాంతార్థాతీత వేత్తలు మీరిందు । నేదేది సవరించుఁ
డిదె నావిజ్ఞాపన ॥ వదలక వినుఁడీ ॥ 20

తా॥ సంతోషముగా కాలము గడుపుటకై, గురుశిష్యులు వాది ప్రతి వాదుల విధముగా వాదించి రన్నట్లుగా, దీని నొక సంవాద రూపముగ రచించితిని. దీని మొదటి నుండి తుదివరకు నెడతెగకుండ వినుడు. మీరు వేదాంతార్థములను దెలిసినవారు గనుకనే, నేజెప్పుదానియందున్న పొరపాటులను సవరించ గలరని వేడుచున్నాడను.

క॥ కొంచెములో సరిపుచ్చక । పెంచితి నీగ్రంథమనుచు
బెద్దలలుగక౯ । మించిన వేడ్కను వినుఁడీ । పెంచిన యర్థ
మ్మునేఁ ॥ జెప్పెద లోకులెల్ల । నర్థము తెలిసి మదినుల్లసిల్ల ।
పెంచితి పెంచితి కొంచెము వెడలుపు । గానుండు నదిలోతు
నెంచి నామదిని ॥ జెప్పెదలోకులెల్ల ॥ 21

Dr DayanandaSwamy ebooks



తా॥ ఈ గ్రంథమును కొంచములో సరిపుచ్చక పెంచి పెద్దదిగా వ్రాసితినని పెద్దలగువారు కోపింపకుడు. యెటులన నది వెడల్పుగా నున్నను లోతుగూడ దానికి దగినట్లుగానే యుండును. అటులే ఈ గ్రంథ మును యించుక విస్తరించి వ్రాయుట వలన నా మనోభావము లోకు లందరికి చక్కగా దెలిసిన సంతోషింతురనియే పెంచియున్నాడను.

క॥ సాధన సంపత్తియుగల । సాధకుఁ డొకనరుఁడు ఘోర సంసారములో । బాధపడలేక దనపు । ణ్యోదయమున గురునిఁ గాంచి ॥ యురుతరభక్తిన్ । శరణనిమ్రొక్కి మఱిమఱియు క్తిన్॥ బోధసేయు పుణ్యపురుష, మాబోంట్లకు । సాధించఁదగు ముఖ్య సాధన మేదనె ॥ యురుతరభక్తిన్ ॥ 22

తా॥ సాధన చతుష్టయమే సంపత్తిగా గలిగిన యొక మానవుడు ఈ దుష్పార సంసారమను సాగరమును నీదలేక దన పూర్వ పుణ్య విశే షంబున, అచల గురుని దరి కేతెంచి సాష్టాంగపడి మ్రొక్కి యోమహాత్మా! నావంటి యజ్ఞానుడు యీసంసార బంధమునుండి విడుదల యగుటకు తగినదియు, నాచే సాధింప దగినదియు నెద్దియో అది నాకు బోధింపుము అని కోరెను.

విశే:— సాధన చతుష్టయ మనగా “1 నిత్యా నిత్య వస్తువివేకము. 2 ఇహ మూత్రార్థ ఫల భోగ విరాగము. 3 శమాది షట్సంపత్తి. 4 ముము క్షత్వము”

నిత్యానిత్య వస్తు వివేకమన, నిత్యము పరబ్రహ్మమనియు అనిత్యము ప్రపంచమని యెరుంగుట. ఇహ మూత్రార్థ ఫలభోగ విరాగమన, ఇహపర భోగములు దుఃఖదాయకములని గ్రహించి వాటిని విడచి పెట్టుట. షమాది షట్కమన. ౧ శమము, ౨ దమము, 3 శ్రద్ధ, ౪ సమాధానము, ౫ ఉప రతి, ౬ తితీక్ష. శమము = మనస్సాది అంతఃకరణమును విషయముల నుండి నిగ్రహించుట. దమము = పంచ కర్మేంద్రియములను విపరీత

Dr DayanandaSwamy ebooks

కర్మల జేయకుండునటుల నాకర్షించుట. శ్రద్ధ = వేదవాక్కులయందు గురువాక్కులయందు భేదమెంచక భక్తిగలిగియుండుట. సమాధానము = మనస్సును ఏకాగ్రముగా నిల్పుట. ఉపరతి = ఒకసారి విడచి పెట్టిన వస్తువు మఱల నగుపడినచో ఛీ యని తిరస్కరించుట. తితీక్ష = శీతోష్ణాదులను, లేక ఆకలి దప్పులను సహించుట. ముముక్షత్వము = మోక్షేచ్ఛ. ఈ నాలుగు సాధనములు గలవాడే బోధకు సధికారి. ఇతడే ఈ గ్రంథమును పఠించిన మేలు గలుగును.

క॥ శరణాగతుఁడగు శిష్యునిఁ। గరుణామృత దృష్టిచేత గని, మోదము ము। ప్పిరిగొన మృదువాక్యములను। పరమ దయాళుండు గురుఁడు॥ "భక్తివినుమనెను। సంశయ మింక బాధింప" దనెను। పరిపూర్ణ మొకటి లేనెఱుకనే దొకటుండుఁ। బరిపూర్ణ మెఱుకల। నెరిగియెరుకనుమాను॥ భక్తివిను మనెను॥ 23

తా॥ శరణని సాష్టాంగ పడి నమస్కరించిన శిష్యుని కరుణారస భరితుండగు గురుండు వాని లేవనెత్తి యాదరించి, యింపైన మాటలతో నాయనా! నేజెప్పు వాక్యములను భక్తితో వినుము. అట్లు వింటివేని సంసార తాపత్రయములు నిన్ను బాధింపవు. 1 పరిపూర్ణమనియు, 2 లేనియెరుక యనియు రెండుగలవు. ఈరెంటిని బాగుగా నీవెరిఁగి రెండవదియగు లేని యెరుకను విడువుము.

విశే:— తాపత్రయము. 1 అధ్యాత్మికము = స్థూలసూక్ష్మ దేహములవలన గలిగెడు దుఃఖము (జ్వరము, ఆకలి, దప్పి మొదలగునవి) 2 అది భౌతికము = ఇతర భూతములవల్ల గలిగెడుదుఃఖము. (దొంగలు పాము తేలు ఇతరులు నిష్కారణముగాబాధించుట మొదలగునవి) 3 అది దైవికము = దేవుని వల్ల గలుగు దుఃఖము, (వర్షములు గురియక కరువు సంభవించుట. అథవా, యెక్కువ వర్షములుపడి పంటలు చెడి పోవుట గాలి యెండ వీటిచే కలుగు తాపము.

Dr DayanandaSwamy ebooks



( గురూర్వాచ )

క॥ ఏసాధన నీకెందుకు । ఏసానికిఁ బనికిరాదు విను
మాయయ్యా । నే సాధులచే విన్నది । యేసాధన లేనిబోధ ॥
యెఱిఁగింతుఁబోకు । సాధనలందు మఱిగితేరాకు । ఏసాధనల
జోలి యెన్నొల్లనని నీవు । బాసఁ జేసితివేని, పరిపూర్ణ బోధనే ॥
యెఱిగింతుబోకు ॥ 24

తా॥ నాయనా ! నీకు యమాది అష్టాంగ యోగములతో బనిలేదు. అవి యేమాత్రము కొరగానివి. వాటియందు నీచిత్తముంచకుము. నేను సాధులవల్ల వినినదియు యేయొక్క శ్రమ లేకుండునదియు ఈ యచల బోధ నీకెరిగించెదను. ఒక వేళ నీకు సాధనములే సాధింప వలెనని యిష్ట ముండినచో, నావద్దకు రాకుము. పైనజెప్పబడిన సాధనల జోలికి నేను పోనని ప్రమాణము జేసితివేని ఈ పరిపూర్ణబోధను నీకెరిగింతు.

విశే:— అష్టాంగ యోగములనగా,

1 యమము = బాహ్యేంద్రియ నిగ్రహము
2 నియమము = అంతరేంద్రియ నిగ్రహము
3 ఆసనములు = పద్మాసనాది 84 ఆసనములను వేయుట.
4 ప్రాణాయామము = శ్వాసోచ్ఛ్వాసల నిరోధించుట
5 ప్రత్యాహారము = విషయములనుండి యింద్రియముల మర లించుట
6 ధ్యానము = ఏకాగ్రచిత్తుడై యుండుట
7 ధారణము - భగవంతుని దప్ప యితర మెరుగకుండుట.
8 సమాధి = మనస్సును లయింప జేయుట.

( శిష్య ఉవాచ )

క॥ గురువర పరిపూర్ణంబన । నెఱుకన నివిరెండునెట్లు
యెఱుకోద్భవ, మం । దెఱుక చనుచోటు నెయ్యది । యెఱుకను
నేనెట్లు విడుతు ॥ నెఱిఁగింపుమనెను । అంతనెగురుఁ డెఱిగింతు

Dr DayanandaSwamy ebooks



ననెను ॥ చరణధూళిని రెండు కరములఁగొని తన । శిరమున ధరియించి శరణని యాశిష్యు ॥ డెఱిఁగింపుమనెను ॥ 25

తా॥ ఓ సద్గురు స్వామీ! పరిపూర్ణమనియు, లేని యెరుకయనియు రెండు విధంబుల గలవని చెప్పి యుంటిరి. అందు పరిపూర్ణమనగా నెయ్యది ? యెరుకనగా నెయ్యది ? ఆలేని యెరుక యెందు జన్మించినది? ఎట్లుపోవును ? ఇది యంతయు నాకు దెల్పుమని యా సద్గురు మూర్తి యొక్క చరణ ధూళిని తన శిరంబున దాల్చి యాశిష్యుడు వేడుకొనగా సద్గురు స్వామి యెరిగింతు వినుమని పలికెను.

( గురూర్వాచ )

క॥ మొద లచలము నెఱిఁగించెద । విదితముగా లేని యెఱుక వివరింతుఁబయిఁ । దుదినెఱుకనువిడిపించెద । మదిలో నామాటనమ్మి ॥ మఱివింటివేని । సంశయబుద్ధి । మానితివేని ॥ పదుగురు నినుజూచి 'భళిసెభాసీతో(త్రో)వ, కెదురులేదనునట్టు లిదిగో నేఁజేసెద ॥ మఱివింటివేని ॥ 26

తా॥ శిష్యా! మొదట నీకు అచలమననెద్దియో యెరిగించెదను. అటు పిమ్మట అసత్యమగు యెఱుక వివరించెదను. తుదకు నెఱుకను విడిపింప జేసెదను. నామాటను నీమదిలో నమ్మి, సంశయము లేనివాడ వైతివేని; పదుగురు నిన్నుజూచి భళీసెభాసు, ఈ త్రోవకు యెదురు లేదనునట్లుగా నిన్ను జేయుదును.

( శిష్య ఉవాచ )

క॥ మీరంతవారు గనుకనె । జేరితి మీపాదసేవ సిద్ధించుటకై । లేరింతవారు జగమున । లేరని నామదికిఁ దోచె ॥ లెస్సగ వినుఁడీ । అజ్ఞుఁడమీఱ । లేదుగనుగొనుఁడీఁ ॥ యేరీతి వినుమంటె । నారీతి వినియెద । మీరానతీయుండి । తోరాము యాబోధ ॥ లెస్సగ వినుఁడీ ॥ 27

Dr DayanandaSwamy ebooks



తా॥ స్వామీ! మీరటువంటి ప్రజ్ఞావంతులనే మిమ్ము జేరితిని, మీ పాద సేవకుండనైతిని లోకములో మీవంటి వారు లేరని నాకు దృఢనిశ్చయ మయ్యెను. మీ యాజ్ఞానుసారము మెదలువాడను. మీరెటుల వినుమన్న నటులే వినియెదను. దేవరవారు నాకుచక్కగా బోధింపవలయును మరియు

క॥ మొద్దులనైనను దొల్తురు । బద్ధుల బద్ధత్వమడవి పాల్సేతురు, మీ । వద్దికి వచ్చిన గని, పరి । శుద్ధపుబోధోక్తమైన సూక్తులుచెప్పి । అందుకుదగిన । యుక్తులుగుప్పి ॥ పెద్దలచే మీప్ర, సిద్ధివనివచ్చితి । దిద్దుఁడినేవట్టి । బుద్ధిహీనుఁడ నన్ను ॥ సూక్తులు చెప్పి ॥ 28

తా॥ ఓ స్వామీ! దేవరవారు తమ చరణ సన్నిధానమున కఱు దెంచిన యెంతటి మందబుద్ధి గలవారినైనను కడతేర్తురు. బద్ధులగువారి నైనను గడతేర్తురు. బద్ధులగువారి సోమరితనమును పోగొట్టజాలుదురు. పెద్దలవల్ల మీకీర్తిని విని మీవద్ద కరుదెంచితిని. నాకు పరిశుద్ధమైనటువంటి యచల బోధను అందుకు తగిన దృష్టాంతములను జెప్పి, బుద్ధిహీనుడనగు నన్ను సవరించుడు.

( గురూర్వాచ )

క॥ సూటిగను బోధనామది । నాటిన దిఁక చాలు చాలు నని నీవై నీ । నోటను బలికెడు దాకను । సాటువలను జెప్పు చుందు ॥ సరెరానామాట । రాగోరుదు । మఱి నేనీమాట ॥ నూటి కొక్కటి చెల్లు । మాటని తెలియుము । మాటిమాటికి వట్టి । పాట లేటికినిఁక ॥ సరెరానామాట ॥ 29

తా॥ శిష్యా! నేనొనరించునట్టి బోధను నీమదికినాటినది యిక జాలు చాలునని నీవై నీనోటను బలుకునంతవరకు నేను అనేక దృష్టాంతరములతో బోధింపు చుందును. నీవు జాగ్రత్తతో వినుచుండుము. ఇదే నాప్రతిజ్ఞ;

Dr DayanandaSwamy ebooks



ఈమాట నూటికి సరియని దెలియుము. ఊరక పనికిరాని పాటలు బాడు కుంటు కూర్చుండుటవలన ప్రయోజనములేదు.

క॥ తానే ననకను నుండిన । దానికిఁబేరేమి బయలుదానే ననుచుఀ । నేననెవవు నేనెవ్వరు । లేనెరుకను నమ్మియుండి ॥ లేనేలేననుమీ । అట్లానంటే । లేనేలేవుసుమీ । లేనేలేనని నేను । లేకపోయిన వెనుక । దానుండు; గదయుంటె । దా నెఱ్ఱెఱిఁగెద వీవు ॥ లేనేలేననుమీ ॥ 30

తా॥ శిష్యా! తాను నేను యనక నుండునదే పరిపూర్ణము. దాను నేనని బలుకుచుండిన నీవెవ్వరు? లేని యెఱుకను నమ్మియుండి నీవట్లు బలుకుచుంటివి. ఆలేని యెఱుక లేకపోయినయెడల, నీవు లేనేలేవు. అట్లు నీవు లేకపోయినను, దానుండుగదాయనిన, దాని నెఱిగిన వారెవ్వరున్నారు? లేరు. కావున దానుండుటయు, నెఱుంగుటయు కల్ల.

( శిష్య ఉవాచ )

క॥ మీరాజ్ఞ యిచ్చియుంటిరి । నేరుపుతో బయలు నెఱుక నెఱిగించి పయిఀ । పేరణతు నెఱుకననియె । ట్లారీతిని యెఱుక పరుచు ॥ మయ్యా ప్రొమొక్కెదను । అనుమానము । చెయ్యి కెయ్యెడను ॥ సారెకు మీపాద జలజయుగ్మము నాహృ । త్సారస మునసిల్పి సల్పుచు పూజనో ॥ యయ్యా ప్రొమొక్కెదను ॥ 31

తా॥ గురువర్యా! మొదట పరిపూర్ణమును, పిదప యెఱుకను వివరించి, తరువాత యెఱుకను విడిపింప జేసెదనని సెలవిచ్చితిరి. అటువలెనే నాకు బోధింపుడు నేను అనుమానములేనివాడనై మీపాదపద్మములను నామనస్సులో నిడుకొని యెల్లప్పుడు మీసేవ జేయుచుందును.

( గురూర్వాచ )

క॥ పుట్టుట గిట్టుట లేకయు । పుట్టెడు గిట్టెడు నెఱుకను

Dr DayanandaSwamy ebooks



పోడి మెఱుఁగకఁ । జట్టువలె కదలకుండును । బట్ట బయల్ । యిట్టిదెఱిఁగి ॥ భావింపఁదగును । నెఱుకచేత సేవింపదగును ॥ వట్టియాశలచేతఁ బట్టుబడకను । యీగుట్టు దేశికునోట గట్టిగ దెలుసుక ॥ భావింపదగునూ ॥ 32

తా॥ శిష్యా ! జనన మరణములు లేనిది బయలు. జనన మరణ ములు గలది యెఱుక, బయలు యెఱుకను యెఱుగక (చట్టు) పర్వతము వలె కదలక మెదలక నున్నది. ఈకదిలే మెదిలే యెఱుక వలన పరిపూర్ణ మెఱిగి సేవింపవలెను. వృథా యాశలను జెందక, ఈరహస్యమును దేశిక స్వాముల వారి నోట జక్కగా దెలిసికొనుము.

విశే:— బయలు, బట్టబయలు, అచలము ఇవన్నియు నొక పరి పూర్ణమునకే పేరులని తెలియవలెను.

క॥ ఎరుకైన రీతినుండును । నెరుక నవశ్యంబటంచు నెన్నిన యెఱుకఁ । యెరుఁగుదుననినను నెరుకే । యెరుగుట దుర్లభముసుమ్మి ॥ యీయుత్త బయలు । ఎరుఁగునె యెరుక నెరుగని బయలు । పెరుగదు విరుగదు యెరుగదు తరుగదు । అరుగదు కరుగదు । తిరుగదు మొరుగదు ॥ యీయుత్తబయలు॥

తా॥ ఎఱుక యెఱుకైనరీతి నుండును అట్టియెఱుకను ముఖ్యముగా దెలిసికొన వలెనన్న, ఎఱుకను దెలిసి కొనునది యెఱుకే. పరిపూర్ణము యెఱుకను గుర్తించదు. పరిపూర్ణమునకు పెరుగుట, విరుగుట, తరుగుట, యెరుగుట, అరుగుట, కరుగుట, తిరుగుట, మొరుగుట మొదలగు వికార ములు లేక సర్వథా నొకే విధముగా నుండును.

---

(32 వ. కందార్థములో) "ఎఱుకచేత సేవింపదగునూ" = అను దానికి కొందఱు "ఎఱుకలేక సేవింపదగునూ" అని చదువుట గలదు. అనగా ! అహంభావము లేక పరిపూర్ణమును సేవింప వలయునని తెలిసి కొనేది.

Dr DayanandaSwamy ebooks



క॥ పలుకునఁ బలుకఁగ రాకను । దలపోసెద మనిన
మదికి దగులక యెపుడుఁ । ములుగుగ్రుచ్చ సందులేకను । గలి
గున్నది బట్టబయలు ॥ గదరమాయన్నా । యిదిగోచూడు । కలదో
యన్న । పలుకన్న పలుకక । తలపన్న దెలియఁగక । చలియెండ
వానల । కలయక నిలుచుండు ॥ గదరా మాయన్నా ॥ 34

తా॥ శిష్యా! పరిపూర్ణము ఇట్టిదని వాక్కులచే వర్ణించుటకు వశము కాదు. మనస్సుచే దలపోయుదుమన్న సాధ్యముగాదు. ముల్లు గ్రుచ్చుటకైన సందులేక యెల్లెడల వ్యాపించియున్నది. అది కదలదు. మాట్లాడదు. ఆలోచింపదు. ఎండకు నెండక, వానకు తడువక సర్వకాల మొకేవిధముగా నున్నది. గురుదృష్టిచేతం జూడుము.

క॥ సామర్థ్య మేమి చూపదు । కామక్రోధాదికముల
గలయ దనిశమే । బాము తెలియఁగ దితరుల ద । న్నేమని నను
మారుబల్క ॥ దీబట్టబయలు । దీనికి మ్రొక్కే । రితర జేజేలు॥
నామరూపక్రియ । నటనలన్నియు మీఱి । యేమని యనరాక ।
యేకమైయున్నది ॥ ఈబట్టబయలు ॥ 35

తా॥ శిష్యా! పరిపూర్ణము తనశక్తి సామర్థ్యములను జూపదు. ఎన్నటికిని కామ క్రోధాది యరి షడ్వర్గమునకు లోబడదు. ఏదుఃఖము నెఱుగదు. ఇతరు లాడుమాటకు బదులుసెప్పదు. కావున అట్టి పరిపూర్ణమే పరమ పదమని బ్రహ్మాది దేవతలు నమస్కరింపు చుందురు. పరిపూర్ణము నామము, రూపము, క్రియ, నటనాది వృత్తుల నన్నింటినిమీరి అవాఙ్మానస గోచరమై యేకమై యున్నది.

విశే:— అరిషడ్వర్గమనగా = 1 కామము = కోరిక. 2 క్రోధము = కోపము. 3 లోభము = అత్యాశ. 4 మోహము = చిత్తవైకల్యము

Dr DayanandaSwamy ebooks



5 మదము = గర్వము. 6 మాత్సర్యము = పగ. ఇవి మానవునకు పగవానితో సమానము.

క॥ దానము ధర్మము సగుణ । ధ్యానము ప్రతిమార్చ
నంబు తపజపతీర్థ । స్నానములు ముక్తిదములని । మానవు
డొనరించుబయలు ॥ మాటాడదేమి । యెఱుకేలేదు । మాటాడ
దేమి । ఔను కాదనక నీవనక నేననకొక్క । మేరైనతాగాక ।
మితిమీఱియున్నది ॥ మాటాడదేమి ॥ 36

తా॥ శిష్యా ! దానము, ధర్మము, సగుణధ్యానము, మూర్తిపూజనము, జపము, తపము, తీర్థస్నానము లను నీయేడును ముక్తి సాధనములని మానవు లాచరింపుచుందురు. ఇవన్నియు పరిపూర్ణమునకు లేవు గావున మాటాడదు. ఔననిగాని, కాదనిగాని, నీవు నేననియనక, స్థూలసూక్ష్మ, కారణ మహాకారణ, కైవల్య శరీరములలో నేదియు గాక మితి మేరలులేక నెల్లకాల మొకేరీతిగా సర్వత్ర నిండియున్నది.

క॥ ఇంతింతని యనరానిది । వింతలు సేయునిది నెన్ని
విధములఁ గనినఁ । చింతలెఱుఁగనిదీ బయ । లెంతని నేవిన్న
వింతు ॥ నిఁకమీఁదవృథగా । తెలుపుట వినుట । కిదిపెద్ద
కథగా । సంతతమొకరీతి । సకలదేశములయం । దంతటనిం
డున్న । దదిగో పరిపూర్ణము ॥ ఇకమీఁద వృథగా ॥ 37

తా॥ శిష్యా! పరిపూర్ణము ఇట్టి దట్టిదని చెప్పుటకు వీలుకానిది ఏలాటి వింతలును జేయనిది ఏచింతల నెఱుంగనిది. అట్టి పరిపూర్ణమును నేనెట్లు కథగా వినిపింతును. నీవెటుల వినెదవు ? కావున ఆ పరిపూర్ణము ఎల్ల వేళలందు నెల్ల చోటులందు నొకే విధముగా నిండి నిబిడీకృతముగానున్నది అదోచూడుము.

Dr DayanandaSwamy ebooks



క॥ ఆకాశాదిక భూతా। నీకాత్మక మగుచు నెరుక యీజగ
మయ్యెఁ। రాకడ పోకడ గలదై। ప్రాకటముగ దీనిలోను॥
బట్టబయలిదిరా। కాదనియుంటె వట్టిపల్కదిరా। లోకత్రయము
తనలోపల దిఱుఁగగ। జోకతోడుతదాని జోలెఱుఁగ దిదియే మొ॥
బట్టబయలిదిరా॥ 38

తా॥ శిష్యా! ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి అను నీపంచభూతముల స్వరూపమైనది యెఱుక, ఈయెఱుకయే జగత్తయ్యెను. ఈయెఱుక జననమరణములు గలిగియున్నది. ఈయెఱుక వల్లనే పరిపూర్ణమును జూడుము. కాదని యనుట వ్యర్థము. స్వర్గ మర్త్య పాతాళ లోకములు మూడును పరిపూర్ణమందు దిరుగు చుండినను, ఆ పరిపూర్ణమునకు యెఱుక సమాచార మేమియు దెలియకుండును. కాబట్టి యెఱుకే యబద్ధమని దెలియుము.

విశే:— ఆత్మయందున ఆకాశము, ఆకాశమున వాయువు, వాయువు నందగ్ని, అగ్నియందుజలము, జలమందు పృథివి పుట్టెను. భూమియందోషధులును, ఓషధులయందన్నము, అన్నమునందు సకల జంతు జాలములు గల్గెను. దీనినే ప్రపంచమనబడును.

పంచమహా భూతములలో ఒక్కొక్క భూతము మిగత నాలుగు భూతములలో చేరుటచే యిరువై అయిదు తత్వములయ్యెను. అందుస్థూల దేహ పంచీకరణమనియు, సూక్ష్మ దేహ పంచీకరణమనియు రెండు విధంబులు. వాటి వివరణము యీక్రింద చెప్పబడుచున్నది.

Dr DayanandaSwamy ebooks



## స్థూలదేహ పంచీకరణము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆకాశము | కామ | క్రోధ | లోభ | మోహ | మదమత్సరములు |
| వాయువు | చలనం | గమనం | తీవ్రం | లజ్జ | భయము |
| అగ్ని | క్షుత్తు | పిపాస | నిద్ర | ఆలస్యము | సంగమం |
| జలము | రక్తము | మూత్రము | శుక్లము | శ్లేష్మము | మెదడు |
| పృథివి | అస్తులు | చర్మము | మాంసము | నరములు | రోమములు |

ఆకాశమువల్ల కామ, క్రోధ, లోభ, మోహ, మద మత్సరములు. వాయువువల్ల చలనం, గమనం, తీవ్రం, లజ్జ భయము. అగ్నివల్ల క్షుత్తు, పిపాస, నిద్ర, ఆలస్యం, సంగమం. జలమువల్ల రక్తము, మూత్రము, శుక్లము, శ్లేష్మము మెదడు. పృథివివల్ల అస్తులు, చర్మము, మాంసము, నరములు, రోమములు కలిగెను.

Dr DayanandaSwamy ebooks



## సూక్ష్మదేహ పంచీకరణము.

| పంచమహా భూతములు | ఆకాశముచే అంతఃకరణ పంచకము | వాయువుచే ప్రాణపంచకము | అగ్నిచే జ్ఞానేంద్రియ పంచకము | జలముచే కర్మేంద్రియ పంచకము | పృథివిచే విషయ పంచకము |
|---|---|---|---|---|---|
| ఆకాశము | జ్ఞానము | వ్యాన | శ్రోత్ర | వాక్కు | శబ్దము |
| వాయువు | మనస్సు | సమాన | త్వక్కు | పాణి | స్పర్శము |
| అగ్ని | బుద్ధి | ఉదాన | చక్షు | పాద | రూపము |
| జలము | చిత్తము | ప్రాణ | జిహ్వ | గుహ్యము | రసము |
| పృథివి | అహంకారము | అపాన | ఘ్రాణ | గుదము | గంధము |

క॥ తండోప తండములుగా । దండిఝషాదికములన్ని తన లోపల ను । ద్దండత నుండినఁ బోయిన । నిండు సముద్రంబు యెఱుఁగ ॥ కుండు నెప్పటికి । పరిపూర్ణ మిట్లుండు నెప్పటికి ॥ యెండమావులరీతి నుండెడు బ్రహ్మాండ । ముండినఁ బోయిన రెండు గుఱుతెరుగక ॥ నుండు నెప్పటికి ॥ 39

తా॥ శిష్యా! మహా సముద్రమునందు అనేకములగు జలచరంబులు చచ్చుచు పుట్టుచున్నను ఎటులైతె ఆ సముద్రముదెలియకుండునో, అటులే పరిపూర్ణమునందు ఎండ మావులవంటి అండ పిండ బ్రహ్మాండము లుండి

Dr DayanandaSwamy ebooks



పోయినను పరిపూర్ణము దెలిసికొన జాలదు. ఎల్లకాల మొకేరీతిగా నుండు నని దెలియుము.

క॥ ఎఱుకతొ వచ్చిన విశ్వం। బెఱుకతోఁ జనుగాని నిల్వ దీబయలైతే। యెఱుకతొ రాదెఱుకతోఁబో। దెఱుకతొ నందేమి లేదు ॥ యిది నిశ్చయమురా। ఉండుండి యీ యెఱుకతానౌరా। యెఱుక నెఱిగినవస్తు వెఱుకని తెలియుము। యెఱుక నెరుగదు బయ లిట్టిదట్టిదియన ॥ దిదినిశ్చయమురా ॥ 40

తా॥ నాయనా! ఈ ప్రపంచము యెరుకతోడనే వచ్చినది కావున యెరుకతోడనే బోవును. పరిపూర్ణమట్లు యెఱుకవలన రాలేదు. యెఱుక వలన బోలేదు. పరిపూర్ణమునకు యెరుకతో నేమాత్రము సంబంధము లేక సర్వకాల మొకేవిధముగా నుండును. తన్నుదా నెరుగునదియు, పరిపూర్ణము నెరుగునదియు యెరుకగానే దెలియుము. పరిపూర్ణము యెరుకను దెలియ నేరదు. ఎటులన.

క॥ రవి తమస మున్న దెరుఁగునె। ప్రవిమల దావాగ్ని చెదలు బట్టు టెరుఁగునే। దివమును రాతిరి, రాత్రిని। దివ మెరుగుఁనె లేమి లక్ష్మి ॥ దేవియెరుగునా। అన్నమును భూదేవి యెరుగునా। భవనాశస్థితులరాపాడేడియెరుకను భవనాశ స్థితి లేనిబయలెఱ్లెఁరుఁగును ॥ లక్ష్మిదేవియెరుఁగునా ॥ 41

తా॥ శిష్యా! ఎటులైతె, సూర్యుడు చీకటియుండుట నెరుగడో, కార్చిచ్చు చెదలు నెరుగదో, లక్ష్మీదేవి దరిద్రము నెరుగదో, రాత్రియు పగలును, పగలు రాత్రిని యెరుగవో, అటులే జనన మరణములతో గూడిన యెఱుకను, జనన మరణాదులు లేని పరిపూర్ణ మెఱుగదని తెలియుము.

Dr DayanandaSwamy ebooks



క॥ ఎఱుకైన భూతపంచక । మెఱుకకుఁ జరణములు
కటియు హృదయముగళముల్ । శిరమును నయ్యైను గ్రామ
మున । ధరణిమొదల్ జేసియిట్లు ॥ తనయా గుఱ్తెఱుఁగు । గగ
నముబయలం । చనరానిదెఱుఁగు । యెఱుఁగ కాకాశమె పరిపూర్ణ
మనుచు । కొందరు బల్కిరిది దీని గుఱిదప్పి యుండేవు ॥
తనయాగుఱ్తెఱుఁగు ॥

తా॥ శిష్యా! ఎఱుకన పంచభూతములు, అపంచ భూతములవల్లనే దేహమాయెను. ఎట్లన = పృథివివల్ల కాళ్లు, జలమువల్ల నడుము, అగ్నివల్ల హృదయము, వాయువువల్ల కంఠము, ఆకాశమువల్ల దలయునాయెను. కావున కుమారా! ఈ రహస్యము నీవెరుంగుము. బయలు అను శబ్దమునకు ఆకాశ మని నిఘంటువులయందు వ్రాసి యుండుటచే, కొందఱు భూతాకాశమునే బయలని వాదింతురు. వారికి దెలియదు. నీవామాటలను గుఱిదప్పి వినకుము. ఆకాశమే పరిపూర్ణమని యెన్నటికి దలపోయకుము.

క॥ విత్తే చెట్టయి పుట్టును । విత్తే విత్తనమురీతి వెల
యునుధరపై । విత్తుకు చెట్టుకువేరే । విత్తన మొకటున్న దనిన॥
వినఁగూడదోయీ । తనకుఁదాఁబు । ట్టును వినవోయీ । విత్తు
చెట్టులరెంటి । విధమీ భూమెఱుగ ద । ట్టుత్త బయొలెఱుగదు ।
సత్తుచిత్తులరెంటి ॥ విన గూడదోయీ ॥ 43

తా॥ శిష్యా! విత్తనమే చెట్టయిబుట్టుచున్నది. మరల ఆ చెట్టునందా విత్తనమే కాయుచున్నది. విత్తనమును చెట్టును యొకదాని కొకటి పరస్పర కారణములే గాని వాటికి వేరే కారణము లేదు. విత్తనమునకును చెట్టునకును గల సంబంధమును ఈ భూమి యెరుంగదు. అటులే సత్తువల్ల చిత్తు, చిత్తువల్ల సత్తు పుట్టును. యీరెంటికి పరస్పర కారణమేకాని,

Dr DayanandaSwamy ebooks



ఇతర కారణములేదు. ఈ సత్తుచిత్తులకు గల సంబంధము పరిపూర్ణము యెరుగదు.

విశే:— సత్తు = సత్యము. చిత్తు = జ్ఞానము. ఈ రెండును యొకటయేనని దెలియదగినది.

క॥ చెట్టే మూలము విత్తును । బెట్టుకు మూలంబు విత్తు క్షితిపై రెండును । బుట్టినఁ జచ్చిన రెంటిని । గట్టిగఁ దానెరుఁగ కుండు ॥ గదరా ! యీనేల । నీపరీతిఁ, గనుగొన వేల । పుట్టుచు గిట్టుచు । పొలుపొందు తనువెరుక । నిట్టి విచిత్రము లెన్నఁ డెరుఁగదు బయలు ॥ గదరా, యీనేల ॥ 44

తా॥ శిష్యా ! విత్తనమునకు మూలముచెట్టు, చెట్టుకు మూలము విత్తనము. ఈ రెండు నుండినను లేకున్నను భూమికి తెలియదు. అటులే జనన మరణ రూపమగు యొకటనుగాని, యీ జగత్తును గాని పరిపూర్ణము దెలియనేరదు.

క॥ కనుమూసినఁ గనుదెఱచిన । కనుమరుగింతైనలేక కానంబడుచుండు । గనుగొన శక్యముగాకను । యనిశము నొకరీతి నుండు ॥ నతఁడేనిర్గుణుఁడూ । వినికనివెతల నతఁడొందఁ డెపుడూ ॥ వెన్నెలలోపల । వెలగ కాయలరీతి । నున్న విశ్వము నెరుక । నెన్నడు యెరుఁగని ॥ యతఁడెనిర్గుణుడూ ॥ 45

తా॥ శిష్యా ! నేత్రములు మూసికొన్నను తెరచినను కొంచమైన మరుగులేక స్పష్టముగా పరిపూర్ణము కనుబడుచుండును. అది యిట్టి దట్టిదని చెప్పుటకు సాధ్యముకాదు. అట్టి పరిపూర్ణమును కనుగొని, యే సంశయము లేనివాడే నిర్గుణుడనబడును. అతనికి యే వెతలు నుండ నేరవు. వెన్నెలలో వెలగకాయలు గనిపించునటుల, పరిపూర్ణమందీజగత్తు గనిపించుచుండును. యీవిశ్వమును యొకటను నెఱుగనివాడే నిర్గుణుడు.

Dr DayanandaSwamy ebooks



కll ఎరుకే దేహేంద్రియములు। నెరుకే వర్ణాశ్రమములు,
నెరుకే శ్రుతులుః। ఎరుకే నీవును నేనును। యెరుకే సతిసోద
రాదు ॥ తెరుగుమువత్సా। నేc దీర్చెద నిదుగో నీయిచ్ఛా ॥ హరి
హర బ్రహ్మాది సురనరగిరి సరిత్తరు మృగచరా। చరము లెరుక
యని ॥ యెరుcగుమువత్సా ॥ 46

తాll శిష్యా! ఎఱుకే దేహేంద్రియములు, ఎఱుకే బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రాదికములు, ఎఱుకే బ్రహ్మచర్యాది యాశ్రమములు. ఎఱుకే శృతి స్మృతులు, ఎఱుకే సతిసుత సోదరాదులు, మరియు బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతలును, నదులు పర్వతములు మృగములు మొదలగు చరాచర మంతయు నెఱుకయని తెలియుము. వత్సా నేను నీకోరిక దీర్చెదను.

కll ఎరుకే విద్యావిద్యలు। నెరుకే ప్రణవంబునాద
మెరుకే కళయు। న్నెరుకే బిందువు చిత్స। త్తెరుకే యానంద
మని నీ ॥ వెరుగు సద్బుద్ధి। నీ నామాట లెరుకె నీబద్ది ॥ ఎరుకే
నిర్గుణ సగుణ। మెరుకే యెరుcగును యిట్టు లెరుకను యిది
యెంత। యెరుcగజేసితి నీవి ॥ ల్లెరుగు సద్బుద్ధి ॥ 47

తాll నాయనా! ఎఱుకే విద్యయు, అవిద్యయు, ఎఱుకే సోహము. ఎఱుకే నాదము. ఎఱుకే బిందువు. ఎఱుకే కళ. ఎఱుకే సత్తుచిత్తులు. ఎఱుకే ఆనందము. నీ నా మాటలన్నియు గూడ నిజముగా నెఱుకే. ఎఱుకే సగుణ నిర్గుణములు. ఇన్నిటిని నిట్టు లెఱుకే యెఱుగుచున్నది. ఇవి యన్నియు నీకు నెఱుక జెప్పితిని. నీవు సద్బుద్ధిచే నెఱుంగుము.

విశే:— విద్యా విద్యలు = జీవేశ్వరులు.

కll ఎఱుకే యిహపర సౌఖ్యము। లెరుకే జ్ఞానంబు, జ్ఞేయ
మెరుకే మోక్షం। బెరుకే భక్తి విరక్తులు। నెరుకే సంకల్ప

Dr DayanandaSwamy ebooks



మనియు ॥ నెరుగు, సత్కీర్తి । యెక్కడికౌర యెరుకసంపూర్తి । యెరుకే జీవుఁడీశు డెరుకే తదేకాంత । మెరుకే సర్వము నేగురై ఱిఁగి, చెప్పితి ॥ నీకిలెరుగు సత్కీర్తి ॥ 48

తా॥ శిష్యా! ఇహపర సుఖంబులు గూడ నెఱుకే, ఎఱుకే జ్ఞాన జ్ఞేయములు, ఎఱుకే మోక్షము. ఎఱుకే భక్తి, ఎఱుకే విరక్తి, ఎఱుకే సంకల్పము, కావున పరిపూర్ణమును దర్శింపక యెఱుకకు సంపూర్తి గలుగ నేరదు. ఎఱుకే జీవుడు. ఎఱుకే ఈశ్వరుడు. ఈ జీవేశ్వరుల యైక్యత గూడ యెఱుకే. ఇదియంతయు యెఱుకే కావున నేనీ సర్వము దెలిసికొని నీకు జెప్పితిని. నీవీ కీలు దెలిసికొని సత్కీర్తి వహించుము.

క॥ చింతలతోటన నెరుకే । వింతల పుట్టిల్లనంగ వెలసిన దెరుకే । తంతుల పేటన నెరుకే । పంతములకు జూడ మూల ॥ బలమన్నదెరుకే । జగజ్జాలస్థలమన్న దెరుకే ॥ భ్రాంతులకెల్లను పట్టణమనజెల్లి । కాంతలపురుషుల । గలిగించుటకు మూల ॥ బలమన్నదెరుకే ॥ 49

తా॥ శిష్యా! ఎఱుకే సమస్త చింతలకు తోటవంటిది. ఎఱుకే వింతలకు బుట్టినిల్లు. వివిధ తంత్రముల కునికిపట్టు. పంతముల కన్నిటికి మూలాధారము. సర్వ ప్రపంచ జన్మ కారణమునకు ఎఱుకే మూలము. ఈ యెఱుక సమస్త కోరికలకు వాసస్థానము. ఈ యెఱుక స్త్రీలను పురుషులను బుట్టించుటకు మూలకారణమైనది. మఱియును

క॥ అన్నియుదానై, తనకవి । పన్నుగ వేరనుచు నోటఁ బలుకుచు, మఱితా । నన్నిటి నెఱిగెడి యెరుకై । యున్నానని యెరుక కెరుకె ॥ యూహింపుచుండు । తనఁలో దానె । మోహింపుచుండు । ఎన్నోవిచిత్రాలీ । యెరుక సేతలువింటె । యున్నది లేదు లేకున్నదికలదని ॥ యూహింపుచుండు॥ 50

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! ఈ యెఱుక "జగత్తంతయు నేనే, అయినను నాకవి వేరగును" అని తాను వితర్కింపుచు దానన్నిటి నెరుగు శక్తిగల దాన ననుచు తనలో దానూహింపుచు, దనలో దాను మోహింపుచు, ఉన్నదానిని లేదనియు లేని దున్నదనియు యోచించుచుండును. ఈ యెఱుక చర్యల విచారించగా చాలా విచిత్రముగా నున్నది.

విశే:— ఉన్నది = పరిపూర్ణము. లేనిది = ఎఱుక.

క॥ వినుమూర్ణ నాభితాబు। ట్టిన మీదంట సృజనసేయు దినము హరించుఁ। ఘనమగు పట్టుఙకోట్లను। తనలోపలి దారమునకు ॥ తానట్టెచనునూ। అట్లనె యెరుక తాఁబుట్టి కనును। పనిబూని బ్రహ్మాండ। భాండానంతములను। క్షణము లోపలదుృంచి కనరాకవేవేగ ॥ తానట్టెచనును ॥ 51

తా॥ శిష్యా! సాలె పురుగనునది పుట్టి, తనయందు గల్గిన దారముచే చిత్రవిచిత్రములుగా గూడులను గట్టి, మరల వాటిని తానే పాడు గావించి మరణించును. అటులే, యెఱుక తనంతట తానే పుట్టి అండ పిండ బ్రహ్మాండములను గల్పించి, నిమిషములో వాటినిధ్వంసముజేసి మాయమై పోవును.

క॥ తలిదండ్రులు జీవేశులు। నిలవ్యోమము లేను మేను నెరుకమరపులుఁ। కలమేల్కలు శుక్లాస్రం। బులు నీరన్నములు ప్రకృతి ॥ పురుషుఁడాల్ మగడు। గానైయెరుక। కెరుక గానఁబడు। తెలిసి బయలున్నదని। తెలిసి యీ తెలిసిన। తెలివిచేతనె దీని। దీసి వేయుము ప్రకృతి ॥ పురుషుడాల్ మగడు ॥ 52

తా॥ శిష్యా! తలిదండ్రులు జీవేశ్వరులు, భూమ్యాకాశంబులు కలిమిలేములు, నెరుక మరపులు కల మెలకువలు, శుక్లశోణితములు

Dr DayanandaSwamy ebooks



నీరన్నములును, ప్రకృతి పురుషులును, భార్యా భర్తలును ఇన్ని విధము లుగా పరిణమించిన యెఱుకను సరియనరాదు. ఇన్నిటిని మించిన పరి పూర్ణమొకటున్నదని యెఱుకవల్ల తెలిసి యా తెలిసిన యెరుకను తీసి వేయుము.

క॥ ఒక దేహధారి తనువున । సకలావస్థలు జనించి చనిన విధమున । న్నకలంకమైన బయలునఁ । బ్రకటితమై లేని యెరుక ॥ బయలుండజూచి । తన ముచ్చట । పరికించి లేచి । యొక కొంత సేపైన । యుండుటకునులేక । సకలము తనవెంటఁ జనుదేరఁ జనుబట్ట ॥ బయలుండఁజూచి ॥ 53

తా॥ ఎటులైతే మనుష్యుని దేహమందు అనేక రోగములు జనించి వాటివల్లమనుజునికి బాధ గల్గుచుండును. యెప్పుడైతే ఆరోగములు నివా రణ మగునో, ఆ వెంటనే బాధలుగూడా నివారణ మగును. అటులే బట్ట బయలునందు యెరుక జన్మించి, యా బట్టబయలు చూచి తన చేష్టల బరి కించి కొంతసేపైన నుండక తన పరివారముతో మాయమైపోవును.

క॥ మెలకువ సుషుప్తి లోపల । నేలాగునఁ తనకుదానె యేతెంచునొ గు । ర్తాలీల బయలులోపల । వాలాయము తనకు దానె ॥ వచ్చునోయన్నా । వచ్చి హెచ్చి । చచ్చునోయన్నా । ఈ లోపలనె బట్ట, బయలున్న దెఱిఁగితే । నేలోకమున నిల్వ జాలదెఱుగ కుంటే ॥ చచ్చునోయన్నా ॥ 54

తా॥ శిష్యా! సమస్త ప్రాణులకు నిద్రనుండి మెలకువ తనకు తానే యెటుల వచ్చునో, అటులే పరిపూర్ణమందు యెఱుక దనకు తానే వచ్చు చుండును. ఇటులవచ్చి తనకు తానే పెరిగి చచ్చుచుండును. ఈయెఱుక తాను జచ్చుటకు ముందే పరిపూర్ణ ముండుట నెరిగినచో, మరల జన్మ ముకు రాదు. లేకుండిన మరల మరల జనన మరణములను బొందు చుండును.

Dr DayanandaSwamy ebooks



క॥ ఆటాడి యాడకుండును । యాటాడిన మేనిబొమ్మ యాటాడకనే । యాటాడు యెరుక యనియెడి । యాటాడించేటి వాఁడు ॥ యతఁడేర కర్తా । అంతటికినీ, యచలమకర్తా ॥ చేటు పాటుల రెంటి । చేవచ్చు ఫలములు । మాటి కనుభవించి । మరణ జననములొంద ॥ నతఁడేరకర్తా ॥ 55

తా॥ శిష్యా! శరీరము లనెడు బొమ్మలు కొంత సేపాడి కొంతసేపాడకుండును. ఈ బొమ్మల నాడించుటకు యెరుకయేకర్త. పరిపూర్ణము కర్త గాదు. సుఖ దుఃఖములు, జనన మరణంబులతో గూడినది యెఱుక గావున, యెఱుకే కర్త భోక్తయని దెలియుము.

క॥ దేహమును జూచు కన్నులు । దేహమునకు వేరులేని తీరున యెరుకే । కోహం కస్త్వం తవదా । సోహం సోహం బటంచుఁ ॥ జూచుచుండుసుమీ । తనకుఁదానె । దోచుచుండు సుమీ । దేహి దేహమిలనే । తెఱగున బ్రసరించి । దేహముగాని వి । దేహముగ తన్నుతా ॥ చూచుచుండుసుమీ ॥ 56

తా॥ శిష్యా! దేహమును జూచెడు కన్నులు దేహమునకు వేరుగాని విధంబున యెఱుకయే "నే నెవడను, నీవెవడవు, నీకు నేను దాసుడను, నీవేనేను" అని తనంతట తానే జూచుచుండును. యెఱుకే దేహముగాను, దేహిగాను బ్రఖ్యాతినొంది, దేహము తాను గానని, విదేహియగు ఆత్మయే నేనని దలంచుచుండును.

విశే:— కోహం = నేనెవడను, కస్త్వం = నీవెవడవు. ఈరెండు పదములు గలసి, "కోహం కస్త్వం" అని చెప్పుట ద్వైత సిద్ధాంతము. తవ దాసోహం = నీకు నే దాసుండను. అని చెప్పుట, విశిష్టాద్వైత సిద్ధాంతము. సోహం = నీవేనేను, అని చెప్పుట అద్వైత సిద్ధాంతము. దేహి = దేహమును ధరించిన జీవుడు, ఇవి యెల్లయు యెఱుకయని భావము.

Dr DayanandaSwamy ebooks



క॥ పిండ బ్రహ్మాండంబులు । రెండును నీరెంటిలోని రెండహములు, నీ । ఖండములు నాల్గుగూడి, య । ఖండంబగు నెరుకరూపు ॥ గనరా నాతండ్రి । యిదిదెల్పిన । ఘనుఁడే తలి దండ్రి । ఖండా ఖండములుగ । గనుపించు నెరుకను । దండి దామేటియు । ద్దండుల కలనయిన ॥ గనరా నాతండ్రి ॥

తా॥ శిష్యా! 1 పిండము అనగా పంచభూత పంచీకృతమైన ప్రకృతి 2 బ్రహ్మాండము అనగా పంచభూత స్వరూపమగు మహాప్రకృతి. ఈరెంటి, లోని అహంకారములు అనగా, పిండమందుండెడి అహంకారము జీవాత్మ. బ్రహ్మాండమందుండెడు అహంకారము పరమాత్మ ఈ నాలుగు ఖండములు (తునకలు) గూడి యెఱుక యాయెను. ఈ అఖండమగు యెఱుకను నీవు జూడుము. ఈ రహస్యము నీకెఱిగించినవాడే తలిదండ్రి సుమా! ఖండాఖండములుగా గన్పట్టుచుండెడు యెఱుకను, తాము తాము (తాను తాను) అనెడు అహంభావము నొందెడు వారిని స్వప్నమందు జూడుము.

విశే:— "గనరా" అను శబ్దమునకు = చూడుము. అనియు, చూడ లేదనియు అర్థములగుచుండును.

క॥ పరిపూర్ణమొకటి దక్కని । తరమైన ప్రపంచమెల్ల దగఁదెలియుము; నీ । యెరుకేయని మదిలోపల । యెరుకే పరిపూర్ణమెఱిఁగే ॥ దెరుక నెఱిఁగేది । యింకొకటితే దీరెంటి నెఱిగేది । యెరుక పుట్టువుమూల । మెరుఁగని, దీయెరుకే । యెరుకే దాఁబుట్టిన, దెరుఁగబోతే లేదం ॥ చెరుక నెఱిగేది ॥ 58

తా॥ శిష్యా! పరిపూర్ణ మొకటి దప్ప మిగిలిన ప్రపంచమంతయు నెరుకని నీమదిలో దెలియుము. ఈ యెరుకే పరిపూర్ణము నెఱుగుచున్నది. తన్ను తాదెలియునది యెఱుకే. ఈరెంటిని యెఱుగునది వేరొకటి లేదు ఎఱుక తన జన్మస్థానము నెరుగదు. ఎఱిగినచో, తానే లేకుండపోవును.

Dr DayanandaSwamy ebooks



క॥ పాపములు పుణ్యములు భువి । బ్రాపించును ఎరుక
చేత భ్రమసినవారికిన్ । బ్రాపింప వెరుక నిడచినఁ । తాపసులను
జిత్తమందు ॥ దగఁదెలిసికొనుమీ । ఆగామిబోధను తెస్పవినుమీ
పాపలలోశుద్ధ, స్ఫటిక సన్నిభమైన । ఆపోజ్యోతిని ప్రత్య, గాత్మని
మదిలోన ॥ తగఁదెలసికొనుమీ ॥ 59

తా॥ శిష్యా! ఎరుకవల్ల భ్రమజెందిన మానవులకు పాప పుణ్యములు బ్రాప్తించుచుండును. యెఱుకను విడనాడిన తపోధనులకు పాపపుణ్యములు గలుగకుండును. ఇక ముందుకు నేజెప్పబోవు బోధను సావధాన చిత్తుండవై వినుము. నీకంటి పాపలలోనున్న శుద్ధ స్ఫటిక వర్ణముగల ఆపోజ్యోతియే ప్రత్యగాత్మ (జీవాత్మ) గా దెలిసి కొనుము.

క॥ ఎరుకన్నను, మరుపన్నను । యెరుకకు, నెరుకన్న,
దేహియన, మాయయనన్ । గురుతనగను సాక్షియనన్ । స్ఫురణ
యనం, ద్రష్టయనినఁ ॥ జూడుమొక్కటిగా । యిది లేకుంటె ।
జూడ మొక్కటిగా ॥ మఱి చలాచలముల । మర్మమెఱిఁగెటి
దన్న యెరిగి తానేనని । యెగిరి పోయెడిదన్న ॥ చూడు
మొక్కటిగా ॥ 60

తా॥ శిష్యా! యెఱుక యనియు, మరుపనియు, దేహియనియు, మాయయనియు, గుఱుతనియు, సాక్షియనియు, జ్ఞప్తియనియు, ద్రష్ట యనియు జెప్పబడునది యీ యెఱుకయని దెలియుము. యెఱుక లేకుండిన దేనినిం జూడవు. మఱియు, మాయా పూర్ణము లను యీరెంటి మర్మములను యెరుక దెలసికొనగలదు. అటుల దెలసికొనినంతనె మిథ్య యని గ్రహించి తానే లేకుండ పోవును.

Dr DayanandaSwamy ebooks



క॥ అనుమానము మదినుంచక । విను మింకను యెరుక
పేరు వివరించెద బు । ద్ధ్యన, చిత్తంబన, మానస । మనిన,
నహంకారమనిన ॥ నంతఃకరణమనఁ । సంకల్పమంచన యిచ్ఛ
యనినఁ । తాను నితరులని, తాగు ర్తెరిఁగెడిదన్న । తనుగని
యితరుల । దాను దెలిసెడిదన్న ॥ నంతఃకరణమనఁ ॥ 61

తా॥ శిష్యా ! నీమదిలో అనుమాన ముంచుకొనక వినుము. బుద్ధి చిత్తము, మనస్సు, అహంకారము, అంతఃకరణము, సంకల్పము, యిచ్ఛ తాను యితరుల గుర్తెరుంగునది, తన్ను దెలసికొని యితరుల దెలసికొను నది అను నివన్నియు యెరుక పేర్లేనుమా!

క॥ విను మితరులు యెరుకను, సా । క్షని పలికిరి, నేను
సాక్షి నహమని, నీతో । విను నట్లు జెప్పితిని । వేరనఁగూడదు
రెండునొక్క ॥ టని ,తెలుసుకోరా । మాటలభేదమని కనుకో్క్కరా
అనరాని, వినరాని । కనరాని బయలందు । తనకై తానరుదెంచి।
తనకై తాజనునొకటే ॥ యని తెలుసుకోరా ॥ 62

తా॥ శిష్యా! వినుము. కొందఱు యెఱుకను సాక్షియని పలికిరి। నేను సాక్షిని యహమని నీకుం జెప్పితి, యీరెండు మార్గములు నొక్కటే. యని దెలసికొనుము. మాటలభేదమే కాని వేరుగాదు. అనుటకు, వినుటకు, చూచుటకు సాధ్యముగానటువంటి బయలులోపల, యెఱుక తానే యరుదెంచి తనంతట దానే బోవును.

క॥ వన్నియ లైదొకచోటను । బన్నుగ కలసినది హృదయ
పద్మంబనుచు । న్నె న్నెదరు, ప్రజలెరుకయం । దున్నదనుచు,
శ్రుతులు ॥ పలుకుచున్నవి సుమ్మీ । తెలియుబె మోక్ష

Dr DayanandaSwamy ebooks



మన్నవి, సుమ్మీ వన్నెలన్నియు మీఱి । యున్న వస్తువుజాడ ।
నెన్నఁడెఱుంగక, యెన్నోరీతుల బలుకు ॥ చున్నవి సుమ్మీ ॥ 63

తా॥ శిష్యా! పంచవర్ణము లొక్కచోట గలిసినదే హృదయ కమలము. ఆకమలమునందే యెఱుకయున్నదని జనులనుచుందురు. శ్రుతులు దాని దెలియుటే మోక్షమని చెప్పుచున్నవి. సర్వ వర్ణములను మీరిన పరిపూర్ణమును పామర జనంబులు దెలియక, యెన్నో విధంబుల బలుకుచుందురు. శృతులుగూడ అటులే బలుకుచున్నవి.

క॥ చులకగ యుక్తిగనొక్కటి । తెలిపెదవిను సందియ
ములు దీఱును దీనఁ । బలుకున గలిగిన యర్థము । పలుకును
విడనాడినిల్వఁ ॥ బడు చోటింకేది । రెండునునొక్క । పలుకే
యైనది । తెలియుమీలాగునఁ । దెలివి దేహములయ్యె । తెలివే
తనువునుబాసి । తెలివే స్థిరముగ నిల్వ ॥ బడు చోటింకేది ॥

తా॥ శిష్యా! నీకొక సులభమైన యుక్తిం జెప్పెదను. దాని వలన నీసందియములు దీరిపోవును. అదేమన, వాచ, వాచార్థము. ఈరెండును యొక దానిని విడచి యొకటి యుండదు. తెలివిని బాసి దేహము, దేహమును బాసి తెలివి యుండదు. రెండును కలసియే యుండును.

క॥ ఎఱుకైన భూతముల, నీ । వెఱుగుము, యాకసము,
గాడ్పు, నింగలమును, నీ । ళ్ళురువైన, నేలయని, నే । నెఱిగిన
పద్ధతిని నీకు ॥ నెఱిఁగించి నాను । ముజ్జగము, లయ్యెను
వీట్లతోను । పరిపూర్ణమందుగ । న్పడుచుఁ దమకుఁదామె । మఱి
కానరానట్టి, మార్గముఁగల వీటి ॥ నెఱిగించినాను ॥ 65

తా॥ శిష్యా! ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి యీపంచ మహా భూతములే జగత్రయమైనవి నాకు దెలిసినప్రకారము నీతో వచించి

Dr DayanandaSwamy ebooks



తిని. ఈ పంచమహా భూతములు పరిపూర్ణమందు తమకు తామే కనబడి, తమకు తామే కానరాకుండ నశించును. ఈ రహస్యము నీకెరిగించితిని.

క॥ ఎఱుకుత్పత్తిని దెలియగ । సరసిజ గర్భాదులైన జాలరనెడిచో । నరుఁడెంతవాఁడు, వాఁడది । యెఱుఁగుదునన వట్టిమాట ॥ లివివింతగాక । తప్పదువాని, కికరాకపోక । అర మరలేక సద్గురుమూర్తి చరణపం । కరుహద్వయార్చన । నెరుగని నరుమాట ॥ లివివింతగాక ॥ 66

తా॥ శిష్యా! ఎఱుక పుట్టుకను దెలియగా బ్రహ్మాదులకైన నలవిగాదు. మనుష్యుడు దాని నెరుగుదుమనని చెప్పుట వట్టిమాట. అట్టివాడు జనన మరణాదు లొందకతప్పదు. గురుమూర్తి పాదపద్మంబుల పూజంపని పామర జనముల మాటలు వింతలు. అట్టివారికి జనన మరణాదులు తప్పవు.

క॥ లేనెరుక బయలు లోపల । దానెట్లు జనించెననినఁ దగవిను వంధ్యా । సూనునిగతి వియదబ్జవి । ధానంబున యక్షరాజ ॥ ధాని విధమునఁ । రజ్జువుసర్ప, మైన విధమునఁ స్థాణుపురుషని, చందాన । మృగతృష్ణ । లోనీరువిధము స్వప్నానందమును రాజ్య ॥ ధానివిధమునఁ ॥ 67

తా॥ శిష్యా! లేని యెఱుక పరిపూర్ణమం దేలాగున నుద్భవించెనని నీకు సంశయము గలుగవచ్చును. అందుకు సమాధానము వినుము. గొడ్రాలుబిడ్డ, ఆకాశ పుష్పము, యక్షరాజధాని, రజ్జుసర్పము, దారు చోరుడు, యెండమావుల నీళ్లు, కుందేటికొమ్ములు, స్వప్నమందలి యానందము నివన్నియు లేకనే యెటుల చెప్పబడుచున్నవో, అటులే పరిపూర్ణము నందెఱుక లేనే లేదని తెలియుము. (అదియునుంగాక)

Dr DayanandaSwamy ebooks



క॥ లేనెరుకను నెరుకనియును । లే నెరుకెట్లాయెననిన
తెన్నగ వినుమీ । లేని మృగతృష్ణ, వంధ్యా । సూనులు, గలి
గుండి వెదకి ॥ చూడలేనట్లు । ఈలేనెరుక । యేడలేదిట్లు ।
స్థాణువు పురుషుఁడు । శశివిషాణము, గగన । సూనము నరుని,
స్వప్నానంద మిక వెదకి ॥ చూడలేనట్లు ॥ 68

తా॥ శిష్యా! లేనెఱుకను యెఱుకయనియు, యా లేనెఱుక నెట్లు బుట్టెననియు, నీవడిగితివేని వచించెద వినుము. ఎటులైతే నీరు లేకయే, ఎండమావుల నీరనియు గొడ్రాలికి బిడ్డలు లేకయే, గొడ్రాలి సుతుఁడనియు, కొయ్యయందు పురుషుడు లేకయే, దారు పురుషుండనియు, కుందేటికి కొమ్ములు లేకయే, కుందేటి కొమ్ములనియు, ఆకాశమందు పుష్పము లేకయే, ఆకాశపుష్పమనియు, ఈ మొదలుగాగల వన్నియు నెటుల అబద్ధములో అటులే పరిపూర్ణమందు వెదకి చూడ యెఱుక లేనేలేదని భావము. (అందుకే దానికి లేనెఱుకయని పేరు.)

క॥ ఎరుక యుదయమెట్లన్నను । సరళంబగు నారికేళ
సలిలము భంగిన్ । యెరుకెట్లు పోవునన్నను । కరిమ్రింగిన
వెలగపండు ॥ కరణిగ నెరుఁగు । తిరిగిరాని, కరణియునెరుఁగు।
పరిపూర్ణమున్నది యెరుకతానెఱిఁగితె । యెరుకే మ్రింగును భస్మా।
సురుఁడు మ్రింగినాటి ॥ కరణిగ నెరుగు ॥ 69

తా॥ శిష్యా! ఎఱుక పుట్టినవిధ మెట్టిదనిన వినుము. టెంకాయలోన జలము యెట్లు బుట్టినవో, అట్లే పరిపూర్ణమందు యెఱుక దనకు తానే పుట్టును. మరియు, ఏనుగు మ్రింగిన వెలగ పండులోని గుజ్జు యెటుల బోవునో, అటులే యెఱుక పరిపూర్ణమును విడచి తనకుదానే బోవును. ఎఱుక తిరిగిరాని విధ మెట్లంటివేని వినుము. పరిపూర్ణము యొక్క నిజ స్థితిని దెలిసికొన్నంతట, యాయెఱుక భస్మాసురునివలె భస్మమైపోవును.

Dr DayanandaSwamy ebooks



విశే:— భస్మాసురుడను రాకసుడు యెవరినెత్తిపై తనచేలునుంచునో వాడు భస్మమగునటుల వరమొంది, యావర మొసంగిన పరమేశ్వరునే పరీక్ష సేయబూని, తుదకు మోహినీవేష ధారియగు విష్ణుమూర్తివల్ల మోస. పోయి, తన శిరంబుపై దానే చేయి నుంచుకొని, తానే భస్మమైపోయెను (ఈ కథ మహాభాగవత పురాణమునందున్నది)

క॥ సంతోషా సంతోషము । లంతనె గనవచ్చి పిదప నరుగు నెచటికో । వింతయి యున్నది చూచితె । యింతే సుమ్మో ఋకపుట్టు ॥ నిక తెలుసుకోరా । సంశయమేల, యిదినమ్మికోరా యెంతని దెలుపుదు నీదేవమార్గము । నంతట బహువన్నె లగుపడి, యగుపడ ॥ దిఁక తెలుసుకోరా ॥ 70

తా॥ శిష్యా! మానవునకు సుఖదుఃఖములు గలిగి వెంటనే దొలగి పోవుచుండును. అవి యెక్కడకు బోవునో మానవునకు దెలియదు. ఇది జూడ మిగుల వింతగా నున్నది. అటులే ఋుక జనించి యెచ్చటికో లేకుండగా బోవును. ఇది లెస్సగా విని సంశయము లేనివాడవై పరిపూర్ణమునే నమ్మి యుండుము. ఒకప్పుడు వివిధ వర్ణములుగా నగుపడుచు, మరి యొకప్పుడు యేమియు నగుపడక పోవు నెఋుకను నమ్మకుము. దేవ మార్గమును నీకెంతని విన్నవింతును.

క॥ రాకడ పోకడ లేకను । నేకస్థితి నుండునట్టి యీబయలందుఁ । రాకడ పోకడ గలిగి, య । నేకముగాఁ దోచునెపుడు॥ నెఋుక సుశీలా । ప్రతిమలోని పెరుమాళ్ళ లీలా । లేక తోచి యెరుక లేనేలేదనుచునీ । కీకీలు గురునిచే నెఋుకైతె జూడుళ్ళ॥ క్కరుకె సుశీలా ॥ 71

తా.। శిష్యా! రాకపోకలు (జననమరణములు) లేని బయలందు, రాకపోకడలు గలిగిన యెఋుక యెల్లప్పుడు అనేక విధములుగా దోచు

Dr DayanandaSwamy ebooks



చుండును. మంచి నడవడిగల వాడవగు శిష్యా! విగ్రహము లందలి పెరుమాళ్ళవలె పరిపూర్ణమునందు, లేని యెఱుక దోచినను లేదనియే నమ్ముము. ఈకీలు సద్గురు మూర్తివల్ల నెరుంగుము.

క॥ వానను వడగండ్లుదకము । దనకై తావచ్చి తనకుఁ దానేగు విధం । బున బరిపూర్ణము లోపలఁ । దనకై తా వచ్చి యెఱుక ॥ తనకై తాజనును । అచలంబున్నదని తా నెఱిగినను। తనలేమి నిజమని తనకు దోచునుదోచి । తనకల్మి మృషగ భావనజేసి నిలువక ॥ తనకై తాజనును ॥ 72

తా॥ శిష్యా! ఎటులైతే, వర్షము గురియు నపుడు, వడగండ్లు జల ముతో గలసి తమంతట తామే వచ్చి మఱల వడగండ్లు తమకు తామే రూపము మార్చుకొని నీళ్ళయి నీటితో గలసి పోవుచుండునో, అటులే ఎఱుక పరిపూర్ణమునందు తనంతట దానేవచ్చి తనంతట దానే పోవుచుండును. ఎఱుక పరిపూర్ణముండుట దెలసికొనిన, దన యసత్యమును తానేగ్రహించి తనకల్మి యబద్ధమని భావించి నిలువక, తనంతట తానే పోవును.

క॥ పరిపూర్ణములో దోచుచు । నెఱుకె తను దనకుదానే మేర్పడ వినుమీ । తొఱటలు తొమ్మిది గలదై । తరితీపుల నొందు చుండు ॥ తనువనదగుచూ । అచలంబున్నదని, తా లేననుచూ। యెఱిగిల్లెఱుకను దెలియు । యెఱుకేనిల్వదుగాని । పరిపూర్ణ మందా, నెఱిగేదెట్లికగుర్తు ॥ తనువనదగుచూ ॥ 73

తా॥ శిష్యా! పరిపూర్ణమందు యెఱుక తనకు దానే దోచుచు, నవ రంధ్రములతో గూడిన శరీరమయి, సుఖదుఃఖము లనుభవించుచుండి, అట్టి ఎఱుక పరిపూర్ణమును గని తాను లేనని తానే నిలువక పోవును. అట్లు దెలసికొనుటయే యెఱుక నశించుటకు గుర్తు అని నీవుగ్రహించుము.

Dr DayanandaSwamy ebooks



క॥ తొలకరి మెఱుపుల కైవడి। పొలుపగు నీళ్ళందుదోచు బుగ్గలరీతి। న్నలసూర్య కిరణమందున। గలనీలము వలెను యెఱుక ॥ కనుపించునయ్యా। అంతలో నచట, గనుపించ దయ్యా ॥ కలకాల మొకరీతి, గలిగుండదీయెఱుక। తిలకింపఁ బగలు, రాతిరి దిరుగు విధమున ॥ గనుపించదయ్యా ॥ 74

తా॥ శిష్యా! తొలకరి మెఱుపు ఁగవలెను, నీటి యందలి బుగ్గవలెను, సూర్య కిరణములందు దోచు నీలమువలెను ఈ యెఱుక గనిపించుచుండును. వాటివలె వెంటనే మాయమై పోవును. పరిపూర్ణమువలె నెల్లకాల మొకటే విధముగా నుండక, రాత్రియు, పగలును దిరుగు విధంబున ఒకప్పుడుండియు ఒకప్పు డుండకుండునని తెలియుము.

క॥ కట్టియలో నిప్పులేకను। కట్టియ నొక సమయమందు గనుపడి బహుగా। మిట్టిపడు తుదనుఁ గనుపడు। నట్టిదెసుమి యెఱుకపుట్టు ॥ నమల విచారా। తనకుఁదానె, పుట్టిన దౌరా ॥ పుట్టి గిట్టుటిలను, నట్టేట నిలుచుండి। బట్టబయలు నొడి గట్టిన గనుపడ ॥ దమలవిచారా ॥ 75

తా॥ నిర్మల విచారముగల శిష్యా! కట్టెలయందు అగ్నిలేకయే, ఒక కట్టతో నొకకట్టె నొరచుటచేత నగ్నిగల్గి, అది ప్రజ్వరిల్లి ఆకట్టెలను కాల్చి భస్మము జేసి తానును జల్లారిపోవును. అటులె పరిపూర్ణమునందు ఎఱుక నిజ ముగాలేక తనంతట తానే జన్మించి వృద్ధిబొంది యావల నశించిపోవును. జనన మరణాది రూపమగు యీ సంసార సాగరమున నిలుచుండి, పరిపూర్ణమును దెలిసికొనిన యెడల, నాసముద్రము నశించిపోవునని తెలియుము.

క॥ తనమూలము తలి దండ్రులు। తనవలెనే వారి వారి తలిదండ్రులకుఁ। దనవలెనె గాని యన్యము। గన, జననస్థాన

Dr DayanandaSwamy ebooks



మొకటి ॥ గలదన తరమా । బ్రహ్మాదుల, కది తెలియు తరమా ।
వినుమీ యీ బ్రహ్మాండ । జననము, నీ నాయం । దునునైన దిది
యుఁగా । దని, యింకొక్కటి వేరే ॥ గలదన తరమా ॥ 76

తా॥ శిష్యా ! తనకుమూలము తనయొక్క తల్లిదండ్రులు వారికిమూలము వారి తల్లి దండ్రులు, ఇట్లేకాని వేరే జన్మస్థానమున్నదని చెప్పుటకు నలవికాదు. బ్రహ్మాదులకైన నది దెలియుటకు సాధ్యపడదు. యీబ్రహ్మాండము నీ నావలన నయినదే కాని, మరి యెవ్వరివల్లను గాలేదని తెలియుము.

క॥ కనరానిదాని శూన్యం । బని యనఁదగు గాని బయలు
ననదగదుసుమీ । కనవచ్చుచున్న దిదుగో । గనుగొనలేదయ్యె
నెరుక ॥ కనుగొనరాదా । యెరుకను శూన్యమని యనరాదా ।
కనవచ్చెనా ? లేదా', గనుగొంటివే । దానియనరాద భయమేమి? ।
యనుమానించకు మిదిగో ॥ కనుగొనరాదా ॥ 77

తా॥ శిష్యా ! కనుపడి కనుపడ కుండెడు దానిని శూన్యంబని యన వచ్చునుగాని, సదా గనుపించెడు బయలును శూన్యంబని యనకూడదు. ప్రత్యక్షముగా గనుపించెడు పరిపూర్ణమును గనుగొంటివిగదా ! సంశయము నొందక పరిపూర్ణమును శాశ్వతముగాను, యెఱుక నశాశ్వతముగాను శూన్యముగా నెన్నుకొనుము.

క॥ ఎఱుక బయలందు లేమిని । యెఱుకను శూన్యం
బటంచు నెఱిగింప బడెఁ । యెఱుఁగుమిదె యాకసంబి । ట్లెఁ
ఱిగితె, యెరుకాకసంబు ॥ లేకమౌగదరా । ఆకసము బయలు,
నేకమెట్లౌరా ! పరిపూర్ణమిదిగొ గ । న్పడు శూన్యమనరాదు ।
యెరుఁగుము మెదిలించ । నిఁక నాచెయిచూచేవు ॥ యేకమౌ
గదరా ॥ 78

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! పరిపూర్ణమందు యెరుక లేనేలేదు. కావున యెరుక శూన్యమని చెప్పబడెను. చూడుము. ఎరుకయు, ఆకాశము నొక్కటేయగును. భేదములేదు. పరిపూర్ణ మిదుగో కనుబడుచున్నది. కావున దీనిని శూన్య మన రాదు. ఆకాశము పరిపూర్ణము నొక్కటియనరాదు. ఇంకా నీకు సందేహముండిన యెడల మరల మరల వచించు వాడను వినుము.

క॥ కనఁబడెడు బయలులోపలఁ। గనుగొనలేదయ్యె నెరుక గావున శూన్యం। బనవలసె, దీనినాకస। మనవలసెను దీనవిశ్వ॥ మాయెనో యప్పా। యింతకు వేఱే మాయ లేదప్పా। కనుకనె యీవిశ్వ మొనర లేదని తెప్ప। వినజెప్పనాయెను కనబోకుం డనుచు నీ మాయనోయప్పా॥ 79

తా॥ శిష్యా! కనబడెడు పరిపూర్ణమందు యెరుక కనుపించదాయను గనుక యెరుకను శూన్యమని చెప్పబడెను. ఎరుక వల్లనే యీ విశ్వమంతయు గలిగెను. కావున యీ ప్రపంచము లేదని చెప్పితిని. ఎరుకకంటె మాయ వేఱుగాలేదు. ఈ మాయను నీ వెంతమాత్రము నమ్మవద్దునుమీ!

క॥ అహమనదు గదా యచలము। అహమున్నదొ లేదొ చూడు మదినిజమెకదా। అహమునుఁ బుట్టించదుగద। అహ ముదయించుట కొఱకై॥ యది యున్నదిగా। అహమె విశ్వమై, నిల్చినదిగా। అహమే యీముచ్చట్లు। నన్నిట్లెరుఁగునుగద। అహమేదాలేనని, యెఱిగితె సరిగాద॥ అదియున్నదిగా॥ 80

తా॥ శిష్యా! పరిపూర్ణము "నేను" అని యనదుగదా! అహమనునది యున్నదో లేదో చూడుము. మరియు పరిపూర్ణము అహమును బుట్టించదుగదా! అహమేమియులేని పరిపూర్ణమందు కలుగుచున్నది అహమే యీ విశ్వ మాయను అహమే యీ ప్రపంచమందలి ముచ్చటలన్నియు దెలసి కొనునది. యిట్టి అహమే లేదని దెలిసి కొనుట సరియైన మార్గము.

Dr DayanandaSwamy ebooks



విశే:— అహమనగా "నేను" దీనినే అహంకారమందురు.

క॥ ఆవరణము, నాకసము, ని । రావరణము, నచల
మనుచు ననిరి మహాత్ముల్ । ఆవరణము, మితిగల్గిన, ని ।
రావరణము, లేనిదమిత ॥ మనిదెలుసుకోరా । యీరెంటిని
వేరనికనుకో(్ర)రా । ఆవరణముననే । నిరావరణముఁజూచి । యనా
వరణమేది, నీ కావలమాటలే ॥ దని తెలుసుకోరా ॥ 81

తా॥ శిష్యా! ఆవరణము నాకాశమనియు, నిరావరణము పరిపూర్ణ
మనియు పెద్దలు నుడివిరి. ఆవరణమునకు మితిమేరలుండును. నిరావరణ
మునకు మితిమేరలు లేవు. ఈ రెండును ఒకటి కావని దెలిసికొనుము.
ఆవరణము చేతనే నిరావరణమును జూచిన పిమ్మట, నా యావరణమును విడచి
పెట్టితివేని, ఏమాటయు లేదని తెలిసికొనుము.

విశే:— ఆవరణము = వాఙ్మానస గోచరమగు మితిమేరలు గలది.
నిరావరణ మనగా = అవాఙ్మానస గోచరమగు మితిమేరలు లేనిది.

క॥ అకాశము శూన్యంబని । లోకులు మొఱబెట్టి దానిలో
పవనాదుల్ । ప్రాకటముఁగఁ బుట్టినవని । చీకాకుగఁ జెప్పి
నారు ॥ ఛీ వినరాదూ । వంధ్యాసంతు క్షితిలోనలేదూ । కాకుంటె
వినఁజోద్యము । గను కుందేటికొమ్ము । లీకాలమున మే, మేకంటి
మనుమాట ॥ ఛీ; వినరాదూ ॥ 82

తా॥ శిష్యా! కొందరాకాశము శూన్యమనియు అట్టి శూన్యమైన ఆకాశము
నందు వాయువ్వాది భూతములు పుట్టినవనియు చీకాకుగా చెప్పియుండిరి.
కావున వారి మాటలను వినకూడదు. వినుటకు చోద్యమైన, గొడ్రాలికి
బిడ్డయు నీ ప్రపంచమున బుట్టనేలేదు. కుందేటికి కొమ్ములు యెన్నడు
మొలువనే మొలవవు. గొడ్రాలి బిడ్డను, కుందేటి కొమ్ములను మేము

Dr DayanandaSwamy ebooks



చూచితిమని వేడుకగా జెప్పిన వారి మాటలు యెప్పటికి నిజమా? అటులే ఆకాశము శూన్యము కాదు. శూన్యమేయైన పృథివ్యాది భూతము లుద్భవించవు.

క॥ లేని యెరుక బయలందున । లేనేలేదనక యితరు
లేలఁబలికిరో । లేనిది కలదని పిదపను । లేనేలేదనుచు సిగ్గు ॥
లేక యాలీలా । ఛీ వినకు ఛీ కాకు నీకేలా । మేనం దశుద్ధము
తానలదుకొని మళ్ళి । పూనికడిగినరీతి నౌను సిగ్గొక యింత ॥
లేకయాలీలా ॥ 83

తా॥ శిష్యా! ఇతరులు లేని యెరుక బయలందున లేనే లేదనక మొదట కలదనియు, పిదప లేదనియు సిగ్గులేక నానావిధముల జెప్పిరి. ఛీ, నీవట్టి మాటలను వినకుము, శరీరమం దమేధ్యమును బూసికొని, పిదప నా యమేధ్యమును గడుగుకొనినటుల, పామర జనములు ఒకప్పుడు వున్నదనియు, నొకప్పుడు లేదనియు బలుకుచుందురు. నీవు యామాటలను వినకుము.

క॥ అన్నపు సూక్ష్మాంశము మన । సెన్నగ నీరంబు ప్రాణ
మెఱుఁగుము, నా రెం । డెన్నఁడు గలయవొ; నాడే । సున్నసుమీ!
యెఱుకమాట ॥ సుగుణసంపన్నా । కలయుటె యెఱుక సుమి
యింతకన్నా । ఉన్న దెఱుఁకను మూల మన్నదె వినలేదు ।
యెన్నడు నీభ్రాంతి నిన్నంట నీయకు ॥ సుగుణసంపన్నా ॥

తా॥ శిష్యా! అన్నముయొక్క సూక్ష్మాంశమగు మనస్సును, నీటియొక్క సూక్ష్మాంశమగు ప్రాణమును, ఈ రెంటియొక్క కూడికయే యెఱుక. యీ రెంటను ఒకటిగా నెప్పుడు కూడక యుందునో, అపుడే యెఱుక శూన్యం బగును. ఎఱుక తనయొక్క మూలము నెఱుగదు. ఇట్టి యెఱుకను నీవు నిజమని నమ్మకుము. యీ భ్రాంతి నెన్నటికిని నిన్నంట నీయకుము.

క॥ పిల్లలు తాటాకులతోఁ । బిల్లల గావించి పెండ్లి । పేరం
టంబుల్ । కొల్లలుగఁ జేయువారల । తల్లులుగని సత్యమనుచుఁ॥

Dr DayanandaSwamy ebooks



దలచేర మదిని । వినునీవిట్లు తలఁచు నీమదిని । కల్లసంసా
రముఁ గని మానవులు సంత । సిల్లఁగ గురుమంత్రసిద్ధులు నిజ
మని ॥ తలఁచేరమదిని ॥ 85

తా॥ శిష్యా ! పిల్లవాండ్రు తాటియాకులతో బొమ్మలను జేసి, వాటికి పెండ్లి పేరంటములు చేయుదురు. ఆపిల్లల తల్లులవిజూచి నిజమని భావింతురా ? అటులే యజ్ఞానులగు వారు కల్ల సంసారమును నిజమని నమ్ముదురు కాని, గురుమంత్రసిద్ధులగువారు అట్లు దలంచరు, ఇది నీమదిలో చక్కగా దెలిసికొనుము.

క॥ మేనెఱుకలనగ రెంటిలో । దానిని నిది, దీనినదియుఁ
దగసృజియించుఁ । మేనెఱుక లివియు మూలము । లేనిది
సృజనయ్యెననుచు ॥ లేనేలేదంటి । అంటెతప్పు, లేనేలేదంటి ॥
మేనెఱుక లిప్పుడు దేనందున్నవో చూచి । లేని మేనెఱుకల ।
లేనివనుచు నమ్ము । లేనేలేదంటి ॥ 86

తా॥ శిష్యా ! యెఱుక దేహమును, దేహము యెఱుకను సృజించుచుండును. యీ రెంటికిని మూలము లేదు. కావున నివి లేనే లేవని చెప్పితిని. అట్లు లేవని చెప్పుటలో తప్పులేదు. యీరెండును దేనియందున్నవో అపరిపూర్ణమును దెలిసికొని, లేనటువంటి దేహమును యెఱుకను నమ్మకుము.

క॥ ఎఱుక పని చేయ దనకుము । యెఱుగుట మఱచు
టలు రెండు నెవ్వరి పనులో । యెఱిఁగింపుము నామ్రొలను ।
వెఱువకు తప్పితివె దెబ్బ ॥ వేసెదఁ చూడు । అట్లనకుండజేసెద
చూడు । వెఱపించుటదెబ్బ వేసైననాతండ్రి । యెఱిగించుపై
మర్మ । మెరుగగ నేదీసి ॥ వేసెదఁజూడు ॥ 87

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! ఎఱుక పనిచేయదని యనకుము. ఎఱుక మరపులు ఎవ్వరి పనులో నాకుం దెల్పుము. భయపడకుము. చెప్పకున్న నిన్ను శిక్షించెదను. అని పలికిన శిష్యుండు, స్వామీ! దేవరవారు కొట్టెదనని భయపెట్టుచున్నారే కాని యొకదెబ్బైన గొట్టినవారు కారు. కొట్టిమైనను పై భావమును యెఱింగింపుడు. అనిన గురువర్యుండు ఎఱుకనుదీసివేసి నిన్నట్లనకుంత జేసెదను. అని మరియు.

క॥ లేనికల గలిగినప్పుడు । దానికి దశదిశల యందుఁ దగమొదలుకొనఁగ । దానంట కున్న మేల్కను । లేనికలే చూచె నేని ॥ లేకపోవుగదా । కలలో మేల్క లేకపోదుగదా । లేనెరుక బయలు నీలాగున నీకెపుడు । గాన వచ్చితె బోధగావలె నన వపుడు ॥ లేకపోవుగదా ॥ 88

తా॥ శిష్యా! నీకు లేనికల గలిగినప్పుడు కలలో గనుపించిన వస్తువు లెల్లను, మెలకువ జెంది చూచిన నబద్ధమని దోచును. కలలో నీకు మెలకువ (తెలివి) లేకపోలేదుగదా! అటులే లేని యెఱుకయు నీకు నిజముగనే యున్నట్లు కనబడును. నీవు పరిపూర్ణమును దర్శించిన పిమ్మట, కలవంటి దగు యెఱుక నిలువక పారిపోవును. అప్పుడు నీవింకో బోధగావలెననికోరవు.

క॥ ఒంటుకు దాపలి బిందొక । టంటించిన కొలఁది లెక్క యధికంబగు, నా । యొంటుకు వలపల బిందొక । టంటించిన లెక్కవుళ్ళ ॥ క్కాయెగదోయీ । ఒంటుండి లేదౌను గదోయి । తంటదీరునచూడు, దానివలెనె యెరుక । కంటె బయలును తాను । గలిగుండి తనకుళ్ళ ॥ క్కాయె గదోయీ ॥ 89

తా॥ శిష్యా! ఒంటుకు దాపల బిందొకటి పెట్టినచో లెక్క యధికం బగును. ఉదా:- 1 అను సంఖ్యకు 0 ను ఆ సంఖ్య కుడివైపున బెట్టినచో 10 అగును. ఒంటుకు వలపల బిందొకటి పెట్టినచో, ఆ బిందువు (సున్న)

Dr DayanandaSwamy ebooks



ఎటువైతే లెక్కకురాదో, 1 అను సంఖ్యకు 0 ను ఆ సంఖ్యను యెడమవైపున నుంచినచో, లెక్కకు రాకపోవును. ఆసంఖ్య మాత్రము ఉన్నచోటనే యుండును. అటులే యెఱుక పరిపూర్ణమునకు కుడివైపునున్న సున్నవలె విలువలనుచూపును.

క॥ ఎరుకొక్కటుండె నేనియు । యెరుకే యీ విశ్వరూప మేర్పడదాల్చున్ । యెరుకొక్కటి లేకుండిన ॥ యెరుకైన ప్రపంచమన్న ॥ దెవరెఱిఁగేరికను । లేదననయిన । నెవరున్నా రికను । పరిపూర్ణమయినట్టి, బయలుండ గనిపెట్టి । గురుని వాక్యముఁబట్టి గురుతు పోగొట్టితె ॥ ఎవరెఱిఁగేరికను ॥ 90

తా॥ ఎఱుకొకటి యున్నయెడల, నా యెఱుకే యీ ప్రపంచ రూపమును దాల్చును. ఎఱుకొకటి లేకుండిన, ప్రపంచమున్నది లేనిది యెరుగువారెవరు. ప్రపంచము నెఱుగుట యెఱుకకు దప్ప దేనికిని సాధ్యముకాదు. గురుని వాక్యానుసారము పరిపూర్ణముండుట దెలిసి, యెఱుకయనుగురుతు పోగొట్ట వలయును.

క॥ తెలుపు మృదుత్వము మధురము । గల వస్తువు చక్కెరనుచు గనుఁగొన్నట్లా । తెలివి విశదముగ జగములఁ । గల వస్తువు బిందువనుచుఁ ॥ గనుఁగొనరాదా । నేదెలిపితె, విని నమ్మ రాదా । తెలివిచే బయలుండ తెలిసి యీతెలివినిఁ । దెలివిచేతను పట్టి తీసి వేసినఁబోను ॥ కనుగొనరాదా ॥ 91

తా॥ శిష్యా! తెలుపుగను, మృదువుగను, తీపిగను యుండువస్తువను చక్కెరయని నీవు యెట్లు దెలిసి కొనుచున్నావో, అ తెలిసికొన్న తెలివియే, ఈ దేహాది వస్తు ప్రపంచమును వెలిగింప జేయు బిందు (ఎఱుక) యని యెఱుగుము. నే జెప్పిన బోధను నమ్ముము. ఎఱుకవల్ల పరిపూర్ణమును యెఱిగి, ఆ యెఱిగిన యెరుకను వదిలితివేని అది తనకు దానే పోవును.

Dr DayanandaSwamy ebooks



క॥ లేనెరుక బయలులోపలఁ। దానై తన కేరుపడిన తన మూలమునే । తానెరుఁగ, దలచినప్పుడు । తానే లేకుండు దృష్టాం ॥ తము వినుమిచట । కలదోఁచదే । తనకై తానెచట ॥ తానై తోఁచినకల తనమేల్కగ నఁబోతే । దానై తనకులేదు, తగియున్నదీ దృష్టాం ॥ తము వినుమిచట ॥ 92

తా॥ శిష్యా! లేనియెఱుక బయలులోపల, తనకు తానే పుట్టి తన మూలము విచారించునప్పుడు తానే లేకుండబోవును. ఎటులన, మెలకువ గల్గి నప్పుడు కలలో దోచిన వస్తువు లెటుల లేకుండ బోవునో, అటులే తన మూలము దెలిసికొనిన దానే లేకుండ బోవును.

క॥ చచ్చుట పుట్టుట మెలకువ । వచ్చుట గాఢపు సుషుప్తి వచ్చుట, యివినా । ల్గచ్చముగ సహజ మెరుకకు । బొచ్చెము యీ యెరుక నిల్వ ॥ బోదు మాయప్పా । అచలము కిట్లు, లేదుగదప్పా । మచ్చికతో రెంటి మర్మము నీకిప్పుడెచ్చుగ దెలిపితినెరుఁగు, మెరుక నిల్వ ॥ బోదు మాయప్పా ॥ 93

తా॥ శిష్యా! చచ్చుట, పుట్టుట, మెలకువ జెందుట గాఢ సుషుప్తిని బొందుట, యీ నాల్గును యెఱుకకు సహజముగా నున్నవి, ఈ యెఱుక నిత్యముగా నిల్వదు. అచలమున కిట్టి యవస్థలు లేవు ఈ రెంటి మర్మము లను నీకు జెప్పితిని. తెలిసి కొనుము.

క॥ యెరుకను కలలోఁ బురుషుని । కెరుకే యీవిశ్వ మగుచు నేర్పడు, కలగా । నెరుక బయలుకనితా లేం । దెఱిఁ గిన, నెరుకదియు మేల్క ॥ యిదినమ్ము లెస్సా । యెరుకతో పొందు వదలదే పిస్సా । యెరుకనే కలనీకు, యెప్పుడు దోచితె యెరుక లేదనుమేల్క, నెరుఁగు మప్పుడుచాలు ॥ యిదినమ్ము లెస్సా ॥ 94

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా ! ఎఱుకయను కలలో వచ్చిన పురుషునకు ఎఱుకే యీ విశ్వమంతయు కలగా దోచును, మెలకువ జెంది చూడగా, కలలోని పురుషు డెటులైతే లేకపోవునో, అటులే బయలు నెరిగి యెఱుక లేక పోవును. యెప్పుడు యెఱుకయను కల నీకు దోచుచుండునో, అప్పుడా యెఱుక లేదని మెలకువ జెందుచుండుము. ఎఱుకతోసంబంధము దొలగుటయే నీకు మేలు.

క॥ చిత్తరువు రంగుగోడల । నెత్తెరుఁగునఁ దెలిసినావొ
నీవిప్పుడు నీ । చిత్తమున జగము నెరుకను । నుత్తబయలునట్ల
దెలియు ॥ మూహతోడుతను । తెలిసివిడువు మూహ జగములను।
అత్తెరంగునఁజేసి యావలిమాటను । యిత్తెఱంగునఁ దెలియ
నెవరుండే; రటుమీఁద ॥ నూహతోడుతను ॥ 95

తా॥ శిష్యా ! గోడల యందలి చిత్తరువులను, యేతెలివిచేత దెలిసికొంటివో, అటులే నీచిత్తమున జగత్తును యెరుకను, పరిపూర్ణమును దెలిసికొని, ఆజగత్తును యెరుకను విడచిన పిమ్మట నావలి మాట జెప్పుటకు నెవరును లేరని చక్కగా నూహింపుము.

క॥ పరిపూర్ణములో లేనిదె । ఎరుకొక్కటి దోచితన్ను
నెఱిఁగిన మృషగా । నెఱుక విడుచు నదియెట్లనఁ । గరములు
తమ పనులు తామె ॥ గడుపునట్లుగను । ఇదిగాకుంటె కలదొకటి
వీను । మఱికానిదామాట మంచిదీమాటని । పరిపరి విధముల
పల్కె పల్కులపని ॥ గడుపునట్లుగను ॥ 96

తా॥ శిష్యా ! పరిపూర్ణమందులేని యెఱుక తనకుదానే దోచి, తాను మిథ్యయని యెఱిగిన పిమ్మట తనంతటదానే విడిపోవును. యెట్లంటేని, చేతులు తాముగానే పనులు జరిపించుకొని యెటుల చాలించునో, మరియు నోరు మంచిమాటలుగాని, కాని మాటలుగాని మాట్లాడి యూరకున్నటుల యని దెలియుము. మరియును.

Dr DayanandaSwamy ebooks



క॥ తలయెత్తి చూడజాలునె । యలచీఁకటి యెదుట నిలచి యుజ్జ్వల కళలం । గల వచ్చి మెలకువందున । కలచేష్టలు మోృలనిలచి ॥ గనుగొన గలదా । అట్లనె యెఱుక కనుగొన వలదా । యిలలోన గురుబోధ నెఱిఁగిన నరునిఁ చేష్టలు గంటె నుళ్ళక్కి సద్గురు బోదౌట ॥ కనుగొనవలదా ॥ 97

తా॥ శిష్యా ! ఎటులైతే, సూర్యకిరణములను చీకటి తలయెత్తి చూడ జాలదో. ఎటులైతే కలలో దోచినవన్నియు మెలకువ గల్గిన పిమ్మట జూచు టకు నలవి గాదో, అటులే సద్గురుబోధ జెందిన మానవుని చేష్టలన్నియు నుళ్ళక్కి యగునని తెలియుము.

క॥ అంటదు, కల, మెలకువ, మే । ల్కొంటదు, కల నెన్నటికిని నదినిశ్చయమీ । రెంటి క్రియ గురుతు బయలుల రెంటిని రెండంటకుండు ॥ రెండింటిలోను । కల యెఱుక లీ రెండు, మిథ్యోను । దంట మెలకువ, బయలుంట యెప్పటి కెఱిగి । గెంటుమాపైరెంట రెంటి కల యెరుకల ॥ రెండింటి లోను ॥ 98

తా॥ శిష్యా ! నిజముగా కలను మెలకువయు, మెలకువను గలయు నంటని విధంబున, గుఱుతనెడు నెఱుకయును బరి పూర్ణమును, నీరెండును నొకదాని కొకటియంటకుండును. ఇందులో కలయు నెఱుకయు నబద్ధములు. మెలకువ పరిపూర్ణము సత్యములు, అబద్ధమైన కల యెఱుకలను రెంటిని వదలి, నిజమైన రెంటిని గ్రహింపుము.

క॥ ఎరుగదు సుషుప్తి జాగ్రత । నిరవందం గల సుషుప్తి నెరుఁగు మెలఁకువ । ట్లరయ నెరుక మరుపుల, బయ । లెరుఁ గదు యెరుక యీరెంటి ॥ నెరుఁగుచునుండు । గురుముఖమున నెఱిగి యీ రెండు । స్థిరముగ నెరుకను తీసివేసితెచాలు । పరులు నేనని యెడి పలుకు లేకుండు ॥ యిట్లెరుఁగుమీ రెండు ॥ 99

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! నిద్ర మెలకువ నెఱుగదు. మెలకువ మాత్రము నిద్రను' స్వప్నమును యెఱుంగును. అటులే, ఎఱుక మఱపులను పరిపూర్ణ మెఱుగదు. ఎఱుక మాత్రము పరిపూర్ణమును, మఱపును యెఱుంగును. ఈ విషయమును గురు ముఖంబున చక్కగా దెలిసికొని, నేను పరులు, అను భావమును దీసివేసిన చాలును.

క॥ సంకల్పము లేనిది ని । స్సంకల్పము లోన దోఁచు
చను దోఁచుచనుఁగా । సంకల్పమె తప్పని, ని । శ్శంకగా మది
దెలిసెనేని ॥ చనుతాలేననుచూ । నిస్సంకల్పము నిలిచెద
ననుచూ ॥ సంకల్పించుట కింక, సంకల్పమేది । నిస్సంకల్ప
మందిట్లు । సంకల్ప మెరిగితె ॥ చనుతా లేననుచు ॥ 100

తా॥ శిష్యా! సంకల్పము లేకయే, తనలోన నది నిస్సంకల్పముగ గనుపడి గనుపడక బోవుచున్నది (అనగా; నిట్టి సంకల్పమే తోచి తోచక పోవుచున్నది.) అట్లు సంకల్పించుట తప్పని తెలిసిన వెంటనే సంకల్పము తానే పోవుచున్నది. ఇక నిస్సంకల్పము సరి యనిన యెడల సంకల్పించుకొనుట కేమియు లేదు. కావున, సంకల్ప నిస్సంకల్పములు రెండును అనిత్యములని దెలియుము.

క॥ ఎఱుక తనకుఁ దావిడి పో । దెరుకను విడిపింప
లేదు । యెవ్వరు ధాత్రిఁగా । గురుఁడొకఁడు తప్ప గురునకు ।
పరిచర్య యొనర్చిబోధ॥ పద్ధతి వినినఁగా । తిరిగిరాని, పద్ధతి గని
నఁగా । పరిపూర్ణ మెరుక నే । ర్పరచు నెరుకలేక । హరిని
గలలోఁగన్న । కరిమ్రిగ్గినట్లయీ ॥ పద్ధతి వినినఁగా ॥ 101

తా॥ శిష్యా! ఎఱుక తనకు తావిడచిపోదు. అయెఱుకను విడిపించు నంతటి సమర్థుండెవ్వడీ ప్రపంచమున లేదు. ఒక గురుస్వామి మాత్రము విడిపించ గలడు. కావున గురునకు శుశ్రూష నొనర్చి పునర్జన్మలేని బోధను

Dr DayanandaSwamy ebooks



వినుము. అట్లు వింటివేని సింహమును స్వప్నమందు గాంచిన ఏనుగు నశించు విధముగా, పరిపూర్ణము నెఱిగినంతట నెఱుక తనంతట దానే నశించును.

క॥ అపరోక్షమౌనె మనుజుల । కుపరోక్షంబైన బయలు గురుకృప లేకన్ । అపరోక్షమౌను, మనుజుల । కుపరోక్షంబైన బయలు ॥ గురుకృప గలుగన్ । కీల్దెలసిన యెఱుకతాఁదొలగన్॥ విపరీత బుద్ధినివిడిచి నీవెప్పుడు । నుపచారములు చేయుచుం డుము గురునకు ॥ గురుకృపగలుగున్ ॥ 102

తా॥ శిష్యా ! తెలిసికొనుట కసాధ్యమైనపరిపూర్ణము, గురు కృప లేక నెట్లు దెలియనగును. కావున నీవెల్లప్పుడు విపరీత బుద్ధిని విడచి, సద్గురు మూర్తికి నుపచారములు జేయుచుండుము. అట్లు జేసితివేని, ఆ సద్గురు మూర్తియే నీ కెరిగించును. ఈ మర్మమును నీ వెఱిగితివేని యెరుక తానే దొలగి పోవును.

క॥ నే నెవ్వడ నను జీవుడుఁ । నేనే నేనను శివుడు నీరెండనకన్ । దానుండు నచల మన్నిట । నేనరిగిన తాను పైది ॥ నేనెట్లనీని । నేననకున్న దాని నెట్లనినీ । నేనన్న దాననే, నీ నా ప్రసంగము । తానన్న దాననే తలపోయ వలెనెట్లు ॥ నేనెట్లనీని ॥ 103

తా॥ శిష్యా ! జీవుడు నేనెవ్వడను (దేహమా, అంతఃకరణమా, జ్ఞానేం ద్రియములా, కర్మేంద్రియములా ) అని అనేక విధంబుల బలుకుచుండును. శివుడు నేను నేనే యనుచుండును పరిపూర్ణమీ రెండు ననక అంతట నిండి యుండును. నే నీ రెంటి నెఱిగిపోయిన పిమ్మట, నేనని యనువారెవరు ? నే ననకున్న శివుడేమి యనగలడు ? నేనును శివుడు నున్నంత మట్టుకే యీ ప్రసంగము. తానన్న దానివల్లనే యిట్లు యోచింప వలయును.

Dr DayanandaSwamy ebooks



క॥ తొఱ్ఱలు తొమ్మిది గలమే । నృత్తికి యొకరెంటి లోన మల్కులు నాల్గుం । డెఱ్ఱది తెల్లది నల్లది । కఱ్ఱది దానగ్రమందు॥ కలదొక్క తూటు । అది యెఱుకనే । పులు గుండు చోటు ॥ కుఱ్ఱ గురుబోధానె । గొడ్డలి చేఁబూని । మఱ్ఱి పుఱుఁగుల రెంటి । మలచి కొట్టరపోని ॥ కలదొక్క తూటు ॥ 104

తా॥ శిష్యా! దేహమను మఱ్ఱిచెట్టునకు తొమ్మిది తొఱ్ఱలు గలవు. ఆ తొఱ్ఱలో రెంటియందు నాల్గు మల్కులు గలవు. అవి ఎఱ్ఱగ, నల్లగ, తెల్లగ, కఱ్ఱగనుండును. ఆకఱ్ఱదాని కొనయందు నొక రంధ్రము గలదు. అదియే యెఱుక యనెడు పక్షి వాసము జేయు స్థలము. కావున, హేకుమారా! గురు బోధయను గొడ్డలిచే యా మఱ్ఱిచెట్టును, అందుండు పక్షిని కొట్టివేయుము.

విశే:— దేహమునకు నవద్వారములు గలవు. నాశికారంధ్రములు 2 నేత్ర రంధ్రములు 2 కర్ణరంధ్రములు 2 నోరు 1 గుదము 1 గుహ్యము 1 కలసి తొమ్మిది రంధ్రములయ్యెను. పై పద్యములో జెప్పిన "రెంటిలోన" అనగా! నాశికారంధ్రములందు, ఇడా, పింగళ, సుషుమ్న, ప్రిత్యగాత్మ, యను నాలుగు నాడులకు నగ్రభాగంబున బ్రహ్మ నాళమందే యెఱుక యుండును. దీనినే హంస అని చెప్పబడును.

క॥ తనువునఁ గలిగిన యెరుకే । తనువును దనువను చుఁదన్ను దానని యెరుగు॥ తనువును బాసిన మీఁదట । దను నాదేహమును రెండు ॥ దానెరుఁగ దపుడు । అది గనుక తా లేనే లేదెపుడూ ॥ అనుమాన రహితమేం । దచల మున్నదిగంటె । దనమాటఁ దలపోయ । దనకుసిగ్గయి తన్ను । తా నెరుగదపుడు॥

తా॥ శిష్యా! దేహము వలన గలిగిన యెఱుక, తనువు తనను యెఱుగు చుండును. దేహమును విడచినపిమ్మట తననుగాని దేహమునుగాని యెఱు

Dr DayanandaSwamy ebooks



గదు. కావున, యెఱుక లేనిదగుటచే లేనేలేదు. నిస్సందేహముగా అచల ముండుట నెరిగిన యెడల యెఱుక దానే సిగ్గుపడి పారిపోవును.

క॥ ఉప్పిని జెడుగద తరువొ। క్కప్పుడు విత్తనము జచ్చు నారెంటికి, నీ। త్రిప్పలు తప్పవు ధర యే। త్రిప్పలు తానె రుఁగ నట్లు ॥ తెలిసికోవోయీ। తను వెరుకల బయలెల్లెరుఁ గోయీ ॥ గొప్పయిన గురుబోధ। చొప్పుననెఱిఁగి, పై త్రిప్పలు గలదాని। తీసివేసితెచాలు ॥ తెలిసికోవోయీ ॥ 106

తా॥ శిష్యా! పురుగువల్ల చెట్టు నశించును. ఒకప్పుడు విత్తనము గూడ నశించును. ఈ రెంటికి నీ త్రిప్పలు దప్పవు. భూమికి మాత్రము యీ త్రిప్ప లేమియు లేవు. అటులే, దేహము, యెఱుక ఈ రెండును నశించును. కాని. పరిపూర్ణ మీ రెంటిపాట్లు నెరుంగదు. అందువల్ల నీవు గొప్పదైన గురుబోధను తెలిసి కొని జనన మరణాదులతో గూడుకొనిన తను వెరుకలను వదిలి వేయుము.

క॥ మతముల వారలు తమ। సమ్మతమైనటువంటి శాస్త్ర మర్యాదలచే। మితమేరు పరచుకొని బహు। గతులను గలహింతురట్టి ॥ గతినీ కేమిటికిఁ। జపలతఁ జెందే స్థితినీకేమి టికి। ప్రతిలేని యీ బట్ట బయలుండ జూచి సంతతము లేనెరు కలే, దని నమ్ముమికఁ వారి ॥ గతి నీకేమిటికి ॥ 107

తా॥ శిష్యా! మతవాదులు తమకు నమ్మత మైనటువంటి శాస్త్రీను సారముగా మిత మేర్పరచుకొని పలు విధంబుల, కలహించుచుందురు. అట్టి విరుద్ధపు వాదములతో నీకేమాత్రము పనిలేదు. అనమాన మైన అచల పరి పూర్ణమును గ్రహించి సదా లేని యెఱుకను విడువుము.

క॥ ద్వైతా ద్వైత విశిష్టులు। సైతురు వినసైప రెపుడు సైపక పిదపఁ। సైతురు క్రమమున వేఱని ॥ నాతతమది జీవ

Dr DayanandaSwamy ebooks



శివుల ॥ నవి వినబోకు । నేబోధించినవి విడువబోకు । పూతమౌ
బయలును । బొడఁజూచి గురునిచే ॥ ద్వైతా ద్వైతవిశిష్టా ద్వైత
ములను మాను ॥ మవి వినబోకు ॥ 108

తా॥ శిష్యా! ద్వైతులు, జీవేశ్వరులు వేరనియు, అద్వైతులు జీవే శ్వరు లొక్కటేయనియు, విశిష్టాద్వైతులు ముందు వేరుకాదని, ఆపైని వేర నియు నొప్పు కొందురు. అట్టి మాటలను నీవు వినకుముఁ నే బోధించినది విడువబోకుము. పూజ నీయమగు బయలును గురుని కృపచే గనుగొని, మత వాదుల వాక్యములను వినకుము.

వి శే:— మతత్రియము = 1 ద్వైతము. 2 అద్వైతము, 3 విశిష్టా ద్వైతము. షణ్మతము. = 1 శైవము, 2 వైష్ణవము. 3 శాక్తేయము, 4 గాణాపత్యము. 5 సారస్వతము, 6 కపాలము. ఇవి గాక నీ ప్రపంచము నందునింకా అనేక మతములు గలవు గ్రంథ విస్తర భీతిచే వ్రాయలేదు.

క॥ కొందరు దశవిధ నాదము । లందున నభ పంచకంబు
నందునఁ జక్రా । లందున లక్షధ్యానము । లందున హంనందు
బుద్ధి ॥ నాటింతురోయీ । యోగములందు నటి యింతురోయీ ।
అందు సిద్ధులచేత । నా నందింతురు, కొంద, రెందరేమనిననీ ।
బోధందేయుండుము ॥ నాటింతురోయీ ॥ 109

తా॥ శిష్యా! ప్రపంచమున కొందరు దశ విధ నాదములందును, కొందరు పంచాకాశములందును. కొందరు షట్చక్రములందును. కొందరు పంచ ముద్రిలతో గూడిన లక్షద్యాన మందును, కొందరు హంసయందు తమ బుద్ధిని నిల్పుదురు. కొందరు యోగముల వలన యానందింతురు. కొందరు అణిమాది యష్టసిద్ధుల వలన యానందింతురు. ఎవరెన్ని పాట్లు పడినను, ఎవరేమన్నను నీవీ బోధను విడువకుము.

Dr DayanandaSwamy ebooks



విశే:— దశవిధ (ప్రణవ) నాదములు = జల, భేరీ, మృదంగ, గంటా, శంఖ, వీణ, తాళ. చిణి, చిణీ యివిదశవిధ నాదము లనబడును, పంచాకాశము లనగా = ఘటాకాశము, మఠాకాశము, చిదాకాశము, హృదయాకాశము, మహాకాశములను నీయెదును. షడ్చక్రములన = ఆధార, స్వాధిష్ట, మణిపూరక అనహాత, విశుద్ధ, అజ్ఞేయములని పేర్లు. పంచముద్రలనగా = భూచరి, ఖేచరి, మధ్యమ, శాంభవి, షణ్ముఖి ఇవే పంచముద్రలు. యోగములు = యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యానధారణ, సమాధి, ఇవి హఠ యోగ మనంబడును. రాజ యోగమనగా, కేవల జ్ఞానయోగము, అష్టసిద్ధులన = అణిమ, మహిమ, గరిమ, లఘిమ; ప్రాప్తి, ప్రాకామ్య, ఈశత్వ, విశిష్టములను నీ యెనిమిది,

క॥ కొందరు ముద్రలు కనవలె । నందురు మఱికొంద రధిక మందురు ద్రష్టః । కొందఱు భజనే లెస్సని । యందురు యివి యన్ని యెఱుకె ॥ యని తెలుసు కొనుమీ । నీకివియేల ? పనిలేదు వినుమీ । ముందుగ పరిపూర్ణ । మున్నది గనిగుర్తు । నెందుండ కుండదా, నెగరఁ గొట్టిన జాలు ॥ నని తెలుసు కొనుమీ ॥ 110

తా॥ శిష్యా! కొందఱు పంచముద్రలు గనవలె నందురు. మఱికొందరు ద్రష్టయైన సర్వ సాక్షిని దర్శించ వలెనందురు. కొందరు భజనయే మంచిదని చెప్పుదురు. కాని యివన్నియు యెఱుకేయని నీ వెఱుంగుము నీకు యీ వృథా మార్గములతో పనిలేదు. పరిపూర్ణముండుట దెలిసికొని యెఱుకను విడనాడుము.

క॥ దేవుని నీవు నెరుంగవు । నివిప్పటి కెట్టివాడో నే దెలి పెద, నీ । కా వెఱ్ఱి బోధ లెందుకు । కావున సద్దేవునిదిగో ॥ కనుఁగొనవోయీ । నామరూప, కర్మ లేవోయీ । నీవా దేవునిలోన, నినులెస్స వెదకిన । నావల, ముచ్చట, నడుగోయి దెల్పెద ॥ కనుఁగొనవోయీ ॥ 111

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా ! నీవు దేవుని దెలియవు. నీ వెవ్వరైనదిగూడ దెలియవు, వినిపించెద వినుము. నీకా వెఱ్ఱిబోధలతో పనిలేదు. ఆదేవుని ఇదిగో చూడుము. దేవునికి నామరూపక్రియ లుండనేరవు. ఆదేవునియందు నిన్ను నీవు బాగుగా వెదకి నన్నావలి ముచ్చట నడుగుము తెలిపెదను.

క॥ మానవుఁడు సేయఁబూనిన । దానిని లోఁతెఱిగి చేయ దగునని మదిలో । నేనెఱిగి నీకు జెప్పితి । పూనుము రుచి బుట్టదేని ॥ పోని, నీమనసు । రుచిబుట్టితె, పూను నీమనసు । నేనేమి యనబోతే । నీకేమితోచునో. తేనినిష్ఠూరము, లేకుండుటే లెస్స ॥ పోనీ నీమనసు ॥ 112

తా॥ శిష్యా ! మనుష్యుడు జేయదలంచిన కార్యమును చక్కగా విచారించి చేయవలయును. అని నామనస్సులో చక్కగా విచారించి నీకు జెప్పితిని. నా యుపదేశము నీకు మంచిదనిపించిన యెడల వినుము. లేకుండిన విడచిపెట్టుము. నేనేమి జెప్పిన నీకేమి దోచునో, కావున, లేని నిష్ఠూరము లేకుండుటయే మంచిది అందులకై నీవు చక్కగా విచారించుకొనుము.

క॥ పంచాక్షరములతోడ । బ్ర । పంచము తానుద్భవించె ప్రణవాక్షర మం । దంచు శ్రుతులెన్న దాన్నెరు । కంచని నీ వెఱిఁగి యెరుగు ॥ మచలము దీనిꠝ । నిల్పకుమెరుక నచలము లోనꠝ । చంచల మతిచేత । చతురాక్ష రెక్కువం । చెంచెద వెందుకు? యిదినమ్మి యెరుగుమి ॥ ట్లచలము దీనꠝ ॥ 113

తా॥ శిష్యా ! పంచాక్షరముల వల్లనే ప్రపంచము బుట్టెనదనియు, దానికి ముందు ఓంకారముండెననియు శ్రుతులు బలుకుచుండెను. దానిని నీవు యెఱుకని దెలియుము. ఎఱుక వల్లనే పరిపూర్ణము నెరుగుము. పరిపూర్ణము నందు యెఱుకను నిలుపకుము. నీవు మనశ్చంచలమునచతురాక్షరే యెక్కువని యెందుకు దలంచెదవు నామాట వినుము.

Dr DayanandaSwamy ebooks



విశే:— పంచాక్షరి = నమఃశివాయ, చతురాక్షరి = నారాయణ లేక నమఃశివ.

క॥ ఎరుకే చిజ్జడ మీజగ । మరయఁగ బరిపూర్ణమేమి యనరాదదియా । యెరుక జడము లస్థిరములు । పరిపూర్ణము శాశ్వతమది ॥ పాటించికనరా । కావారెండీ, పాటివి వినరా । గురు ముఖమున వీటి, నరుఁడు గుర్తెఱిఁగిన । దిరిగి పుట్టడు వాఁడి, ధ్ధరపై మునుపటివలె ॥ పాటించికనరా ॥ 114

తా॥ శిష్యా ! ఎఱుకే చిత్ (జ్ఞాన) స్వరూపముగాను, జడ స్వరూపము గాను, ప్రపంచ స్వరూపముగా నున్నది. ఆలోచింపగా పరిపూర్ణ మిట్టిదని వచించుటకు నలవి కాదు. ఈ యెరుకయు జగము లస్థిరములు. పరిపూర్ణ మొక్కటే శాశ్వత మైనది. గురు ముఖంబున నీ రెంటిని బాగుగా దెలిసి కొనుము. యేమానవుడు నీ రెంటిని చక్కగా దెలిసికొనునో వానికి పునర్జన్మములేదు.

క॥ కొందరు భూతము లయిదిటి । యందునఁ చిత్తంబు నుంతు రధికము లనుచుం । గొందరు యేమియు లేదని । యందురు గుఱుతెరుగు మిన్ని ॥ యపశబ్దములురా । ఇవియన్ని నిలువ, వని తెలియవలెరా ॥ యెందతేమనిన నీ । కెందుకు బయలును । ముందుగ గనిగుఱు । తెందుండనివకవ్వి ॥ యపశబ్దములురా ॥ 115

తా॥ శిష్యా ! కొందరు పంచభూతములే శ్రేష్ఠమని యెంచి వాటియందే మనస్సు నిల్పెదరు. మఱికొందరు' యేమియు లేదని యందురు. వారి మాట లబద్ధములు, తప్పులని తెలిసి కొనుము. ఎవరెన్ని విధముల జెప్పినను నీకెందుకు ? నీవు ముందుగా పరిపూర్ణమును జూచి యెడుకను విడచి పెట్టుము.

Dr DayanandaSwamy ebooks



క॥ కొందరు కర్మమునే బా । గందురు, మఱికొందఱెక్కు
వందురు, తనువుఁ । గొందఱు ప్రాణము లధికం । బందురు
నీకట్టి వట్టి ॥ యాశలేమిటికి । వారితోఁ బొందు । చేసే చేమిటికి॥
నెందఱిమాటల వెన్నైన నీబోధ । క్రిందివేగానీ పై । కెగిరేవి
కావిట్టు ॥ లాశలేమిటికి ॥ 116

తా॥ శిష్యా ! కొందరు యజ్ఞయాగాది కర్మ లొనరించుట మంచిదని యెదరు. మఱికొందరు దేహమే యెక్కువనియెదరు. కొందరు పంచప్రాణము లధిక మందురు. కావున, నీకీ వృథా ఆశలెందుకు వారితో నీవు స్నేహమెందుకు జేసెదవు ? ఎంద రెన్ని విధముల జెప్పినను అన్ని నీబోధకు సాటిరావని దెలియుము.

క॥ తను వెఱుకలు రెండొక్కటి । యని యనరాదనుచు
కొందఱందురు భువిలో । గనుక వెఱుకలు తుది నొక్కటి ।
గను, గన్పడకుండు రెండు ॥ గనరా యోయన్నా । రెండొక్కటి
వినరా మాయన్నా ॥ అనుమాన మికనేల, యందఱిమాటలు ।
వినబోక, నే బోధించిన, రీతి నిప్పుడు ॥ గనరా యోయన్నా॥

తా॥ శిష్యా ! దేహము యెఱుక యీ రెండువొక్కటేయని చెప్పగూడదని కొందరనియెదరు. దేహమున్ను యెరుకయు వేరువేరుగానే కనబడును కాని, తుదకవి యొక్కటిగానే గనుపించును. కావున నీ రెండొకటనే భావించుము. నీవు సంశయ మొందక, అందరి మాటలను వినక నేబోధించిన విధమిప్పుడు దెలిసి కొనుము.

క॥ కన్నుల ప్రక్కల ప్రేళ్ళిడి । తిన్నగ భ్రూమధ్య
మందు దృష్టి నిలిపియుం । దున్నది వెన్నెలలో, బయు । లన్నా
కను మందు రెఱుక ॥ యదినిల్వాదోయి । తనువుతోఁ బొవు ।

Dr DayanandaSwamy ebooks



నని తెలియవోయి ॥ ఎన్ని తనుపులువచ్చి, యేగిన ఝుణకక
యున్న బయలుఁజూచి యుళ్ళకెక్కుఁటకను వీడు ॥ మది నిల్వ
దోయి ॥ 118

తా॥ శిష్యా! కొందరు కన్నుల ప్రక్కల వ్రేళ్ళిడి, కనుబొమల నడుమ దృష్టినిల్పి చూచిన వెన్నెలవలె గాన్పించును ఆ వెన్నెలలో బయలున్నదని వచింపు చుందురు. అది యెఱుకయే గావున యెంతమాత్రము నిల్వక దేహము తోగూడ పోవునని దెలియుము. ఎన్ని దేహములు వచ్చిపోయినను, పరిపూర్ణము మాత్రము కదలకుండ నుండును. అది దెలసికొని అసత్యమైన యెరుకను విడచిపెట్టుము.

క॥ జనులాత్మానుభవంబై । నను, ముక్తని పలికిరిట్లు
నమ్మకు, మెరుకే । కనరాదెచ్చట గురుకృప । ననుభవ మెవ్వ
రెకినయిన ॥ నామాట నిజమా, అనుభవముళ్ళ క్కామాటె
నిజమా ॥ వినజెప్ప మీరెండు । వివరించి పైమాట । వినినే
ముందరిబోధ । వినిపింతు వేవేగ ॥ నామాట నిజమా ॥ 119

తా॥ శిష్యా! ఆత్మను దెలసి కొనుట ( దర్శించుట ) యే మోక్షమని కొందరు వచించెదరు. వారి మాటలను నమ్మకుము. అది యెరుకయే గాని వేరుగాదు. అది యేరికని యనుభవము కాదు. సద్గురుండిటుల బోధింపడు. అది నిజమని నీ వెన్నకుము. మఱియు.

క॥ తనుదా గనినను మోక్షం । బని పలికిరి, గాని జనము
లది నమ్మకుమీ । తనుఁదాను బట్టబయుటను । గనబోయిన
తనకుఁదానె ॥ కానరాదోయి । విశ్వము తనకు గానరాదోయి ॥
తనవలన నైనది । గనుక విశ్వము రెండు । గనుపించుటుళ్ళకిక్క ।
గావున తనకుఁదాఁ ॥ గానరాదోయి ॥ 120

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా ! కొందరు తన్నుగనిన మోక్షమని చెప్పి యుండిరి. ఆ మాటలు నీవు నమ్మకుము. పరిపూర్ణమందు తన్నుతా జూడ బోయిన తానే లేకుండ బోవును. ఈప్రపంచము తన వల్లనైనది కావున, నిజ మెరిఁగిన పిమ్మట తానున్ను ప్రపంచమున్ను మిథ్యయై పోవును.

క॥ మాయగదా లేని యహం । బాయెఁగదా; తనకుఁ దానె యచలమునొప్పిం । దాయెఁగదా; మాయన, లే । దాయెఁగదా మాయచిత్ర ॥ మాయెఁగదోయి । సంశయమంత పోయెఁగదోయి ॥ మాయ సమూలము । మాయ చూచుచుండ । మాయ మైపోయెను । మాయకే యిది చిత్ర ॥ మాయెఁగదోయి ॥ 121

తా॥ శిష్యా ! లేనిమాయనే తాననెడు అహంకారము. పరిపూర్ణము యెల్లప్పుడున్నది. పరిపూర్ణమునందు మాయలేదు. ఈమాయ చిత్రమైనది. నీ సంశయము దీరి పోయెనుగదా ? మాయ యొక్క సమూలమును మాయనే జూచుచు తుదకా మాయనే మటుమాయమై పోవును.

క॥ లేనియహ మున్న బయలును । లేని ప్రపంచమును దన్ను తెన్నగఁ దనలోఁ । దాను విమర్శించిన, నా । లేనిది లేకుండు నవల ॥ లేదు యేమాట । ఇట్లన నయిన ॥ లేదు యేమాట ॥ లేని యహమీబయట । లేనే లేదని చూచి, లేనిది కలదని । లేని మాటాడేవు ॥ లేదు యేమాట ॥ 122

తా॥ శిష్యా ! లేని అహమును, ఉన్నబయలును, లేని ప్రపంచమును చక్కగా తన్నుదాను విచారించినచో, లేని అహమున్ను ప్రపంచమున్ను తానును లేకుండుట నిజము. అటు పిమ్మట నేమాటయు నుండదు. లేని అహమును పరిపూర్ణమునందు లేనేలేదని తెలిసి కొనిన పిమ్మట, లేనిది కలదని నీ వెన్నటికి పలుకజాలవు.

క॥ పరిపూర్ణ మెఱుకలెట్టివొ । గురుముఖమున రెంటి తెన్ను గుఱుతెఱిఁగెఱుకఁ । సరిపుచ్చుకున్న మృషయని । పరిశుద్ధపు

Dr DayanandaSwamy ebooks



బోధ యిదియే ॥ పాటించికనరా । శివరాముల పద్ధతియిదిరా । నరులు కొందఱు పల్కి । రెరుకను మ్రింగి యీపరిపూర్ణమయ్యె నం । చెరుగక చెడుటకై ॥ పాటించికనరా ॥ 123

తా॥ శిష్యా ! పరిపూర్ణము, ఎరుక నీ రెండు యెటువంటివో గురు ముఖాంతరంబున దెలసికొని, ఈ రెంటి మంచి చెడ్డలను గ్రహించి, యెరు కను అబద్ధమని విడచి పెట్టుటయే పరిశుద్ధమైన పరిపూర్ణబోధ, ఇదియే శివ రామ దీక్షితుల వారి మార్గము. మానవులు కొందరు తాము చెడిపోవుటకై యెరుకను మ్రింగి పరిపూర్ణ మయ్యెననియెదరు అది సరికాదు. నీవా మాటలు వినకుము.

క॥ బిందువు తనువునఁ బుట్టును । బిందువు తను వింద్రి యముల బృందంబసువుల్ । అందముగఁ గలుగునివి । దేవం డునఁ బుట్టినవొ తెలియ ॥ నజునికిఁదరమా । మూలము లేని నని తెలిసికొనుమా । అందుకె బయలున్న । దరసి మూలము లేని । బింద్వాది కంబుల । పేరుదల్వకు తెలియ ॥ నజునికి దరమా ॥ 124

తా॥ శిష్యా ! దేహమందే బిందువనెడు నాత్మ జనించుచున్నది. బిందువు చేతనే తనువు ఇంద్రియములు గలుగుచున్నవి. ఈ దేహాత్మలు యెందున బుట్టి నవో, అది దెలియుట బ్రహ్మదేవునికి గూడ శక్యము గాకుండును. కావున నీవు పరిపూర్ణము నెఱిగి మూలములేని దేహాత్మల జోలికింబోకుము.

క॥ జనులనిరి, దేవుఁడెవరికిఁ । గనరాఁడని, నామరూప కర్మజననము । ల్గన నతనికి లేవని యా । జనవాక్యము బయలు కెపుడు ॥ సహజమవౌ వినరా । అనుమానము, చాలించికనరా । కని, నామరూపాది । కములున్న యెరుకను । వినబోక విడిచి, పెట్టినబోవు తానంత ॥ సహజమవౌ వినరా ॥ 125

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! దేవుడెవరికి నగుపడడనియు. నామము, రూపము, కర్మ జనన మరణాదులు లేనివాడని జనులు బలుకు చుందురు. కావున ఆ జన వాక్యమును బట్టి చూడ అదంతయు బయలుకే సహజముగా నున్నవి నీవు అనుమాన రాహిత్యుడవై, నామ, రూప, కర్మ, జనన మరణాదులతో గూడి కొనిన యెరుకను విడచి పెట్టుము, అట్లు విడచిపెట్టిన యెరుక తనంత దానే పోవును.

క॥ అంతటఁగలదీ యెరుకని । యెంతో వాదింపుచుందు రెరుఁగని వారల్ । ఇంతట నంతటఁ గనుపడు । నంతటిదే కాని యెరుక ॥ యంతటఁగలదా । అదినిజమైతె । నగుపడ వలదా । అంతటఁగలదొక్క యచలమె గానెరుక । యంతటఁ గలదని యనరాదు వినరాదు ॥ అంతటఁగలదా ॥ 126

తా॥ శిష్యా! ఎరుక అంతట నిండియున్నదని పామరులు బలుకుచుం దురు. ఎరుక అంతటింతట గనుపడి కనుపడకుండ బోవునదేగాని, స్థిరముగా నుండనేరదు. అంతట నిండుకొని స్థిరముగా నుండునదైన యెడల కనుపడవల యును గదా? అట్లు కనబడ కుండుటచే యెరుక పరిపూర్ణము వంటిది గాదు, అంతట గలదని చెప్పగూడదు. ఆ మాటలు వినగూడదు. పరిపూర్ణ మొక్కటే అంతట నిండియున్నది.

క॥ బయలాకసమని కొందరు । భయపెట్టెద రందువలన భయపడకుమీ । బయలందు శబ్దమున్నను । బయలాకస మనుచు నమ్మ ॥ బడని నీచేత । శబ్దములేదీ భ్రమ యెందు చేత ॥ బయలాకసముగాదు । పరిపూర్ణమనినమ్మి । నయముగ నెరుకను, నమ్మక విడిచిపో ॥ బడును నీచేత ॥ 127

తా॥ శిష్యా! కొందరజ్ఞానులు, బయలనగా ఆకాశమని చెప్పి భయ పెట్టుచుందురు. నీవు వారి మాటలు విని భయపడకుము. బయలందు శబ్ద

Dr DayanandaSwamy ebooks



మున్నయెడల బయలును ఆకాశమని నమ్మవచ్చును. బయలందు శబ్దములేదు. కావున బయలు ఆకాశ మెట్లగును ? బయలనగా పరిపూర్ణమేకాని ఆకాశము కాదని నమ్మి ఎరుకను విడచి పెట్టినచో, ఆ భ్రమ తనకు తానే పోవును.

క॥ కలమేల్క తెరుక బయలుల । నిలసామ్యము చేసి చూడు మీభ్రమ తొలఁగుణ్ । ఫలమేమి ? పెక్కు చదువ్వుల । వల నను జపయాగయోగ ॥ వ్రతముల వలనన్ । శమదమ ముఖ, శతముల వలనన్ ॥ తలక్రిందుఁగాబడ్డ । తనువునేఁగానన్న । కల మేల్కనిన తానెక్కడ, నిలువదట్టులే ॥ వ్రతముల వలనన్ ॥

తా॥ శిష్యా! కలవంటి దెరుకయనియు, మెలకువ వంటిది పరిపూర్ణ మనియు దెలియుము. అట్లు దెలిసితివేని నీభ్రమ తొలగిపోవును, పనికి రానటువంటి, అనేక శాస్త్రములు, జపములు, తపములు, యోగములు, యాగములు, వ్రతములు, యింద్రియ నిగ్రహములు మొదలుగాగల వెన్ని జేసినను, తలక్రింద పడినను ప్రయోజనములేదు. ఎటులైతే కలలో గన బడిన వస్తువులు మెలకువ జెంది జూడగా కనబడవో, అటులే యెరుకయందు కనబడిన దేహాదికములు పరిపూర్ణమునందు గనబడవు. మరియు.

క॥ నీకలలో నినునన్నును । లోకులు లోకములఁజూచి లోపలిభ్రమచే । నాకరుణ పడసి మెలకువ । చేకొని కల కల్లఁ జేసి ॥ చేరెద వెటకో । సర్వమునీతో, జేరెను వెటకో ॥ ప్రాక ట్టముగబట్టి । బయలెరుకలీరీతి । నీకుదెలిసిన వెనుక నిలువక. వేవేగ ॥ చేరెదవెటకో ॥ 129

తా॥ శిష్యా! నీకలలో నిన్నును, నన్నును, లోకులను, లోకములను గాంచి నిక్కమని భ్రమజెందు చుందువు. మెలకువ జెంది జూచిన నేవియు గాన్పించవు అటులే నీవు యీ ప్రపంచమును నిజమని నమ్ముచున్నావు మరియు కల గాంచువానివలె యీ కల్లను నమ్ముచున్నావు. ఇప్పుడు నావల్ల

Dr DayanandaSwamy ebooks



జ్ఞానమును మెలకువ జెంది యీ విశ్వమంతయు కల వంటిదని నమ్ముము. ఆ పైన నీవేమౌదువో చూడుము. ఇదంతయు నీతోగూడి యెక్కడ నుండునో గ్రహింపుము. పరిపూర్ణమును యెరుకను గుర్తెరింగిన పిమ్మట నీవెక్కడికి జేరెదవో యది దెలిసికొమ్ము.

క॥ హరికర నఖముఖ విదళిత । కరిమస్తక గళితమైన ఘనమౌక్తికముల్ । దొఱిగిన నెఱుకలు; గుఱిజలె । ధరియింతురు రెంటివెలలు ॥ తమ రెఱుఁగలేక । ఆట్లనెబోధ క్రమ మెఱుగ లేక । పరిపూర్ణబోధను నెఱిఁగింపుచుండీన । యెఱుకకే కొందఱు మఱిగేరీ మర్మము ॥ తమరెఱుఁగలేక ॥ 130

తా॥ శిష్యా! సింహము యొక్క కాలిగోళ్ళచేత విదళింపబడిన ఏనుగు మస్తకము నుండి రాలిన యమూల్య మౌక్తికములను దొఱికిన ఎఱుకలు వాటివిలువను గుర్తింపక గురువింద పేర్లవలె గ్రుచ్చి మెడలో ధరింతురు. అటులే, పరిపూర్ణబోధను దెల్పుచున్నను కొందఱవివేకులు యెఱుకనె నమ్మెదరు. వారికి రెంటియొక్క తారతమ్యములు దెలియదని యెరుంగుము

క॥ తనువో, బహిరింద్రియములో । మనసో, ప్రాణములో, విషయ మమతో; నేనం । చని, నీవని, యది, యిది, యని । యనుమానించెదవదేల ॥ యదితోవగాదు । నీవెన్నడు నిదివిన లేదు । వినుమీ పరిపూర్ణము గని, లేని యామీఁది । తనువధికము లేదని గురువుచేఁ దెలియు ॥ మది త్రోవగాదు ॥ 131

తా॥ శిష్యా! నేను శరీరమునా; లేక ఇంద్రియములా; మనస్సా? ప్రాణములా? లేకవిషయములా? లేకమమతయా? ఇదిఅది అని యిటు లనేక విధము లనుమానించెద వెందులకు, అది సరియైన త్రోవగాదు. నీవెన్నడు యిది పెద్దలవల్ల వినలేదు కావున చెప్పెదను వినుము. ఈ పరిపూర్ణ బోధను విని దేహాదికము లు నీవుగాదని తెలిసికొనుము,

Dr DayanandaSwamy ebooks



క॥ నిను, ననుఁ బ్రపంచమును, నిజ। మని యెఱిఁగెడు
నెఱుకచేత నచలమును, గనుం। గొనినను జగమని యెఱిఁ
గెడి యెఱుకను దక్షణమె మాను ॥ మిద్దవివేకా। చాలు నీవి
క్రమమెఱుగుదాక। నిను నన్ను పైరెండింటిని విశ్వమును బయ
లనరాదున్నదని। గుర్తులేకుండు। నిద్దవివేక ॥ 132

తా॥ శిష్యా! నిన్ను, నన్ను ప్రపంచమును ఏయెఱుకచేత నిజమని గుర్తింపు చుంటివో, ఆయెఱుక చేత పరిపూర్ణమును జూడుము. తర్వాత నన్నిటిని యెఱిగిన యెఱుకను విడిచి పెట్టుము. ఓ వివేకము గలవాడా! వీటి నన్నిటిని యెఱిగిన యెఱుకను విశ్వమనక, బయలనక యున్నదానికి గుర్తులేదు కావున అచల బోధను బొంది గురుతుగల యెఱుకను విడిచి పెట్టుము.

క॥ ప్రొద్దున నిద్దుర మేల్కని। వద్దికి నేతెంచి, గురుని
వక్త్ర జనితమౌ। సుద్దులు, మ్రొక్కి వినుము, యే। ప్రొద్దవి
బలు ముద్దుసుమ్మి ॥ పుట్టినందులకు। గురు చరణములు
పట్టినందులకు। నిద్ధమౌ భక్తిచే నీవిట్లు చేసితె। దిద్దితీర్చి బోధ
తెలుగు చూపును నీవు ॥ పుట్టినందులకు ॥ 133

తా॥ శిష్యా! నీవు ప్రతిదినము ఉదయమున మెలకువ జెందిన తోడనే, సద్గురుని వద్దకేతెంచి వారి పాద పద్మంబులకు మ్రొక్కివారి ముఖము నుండి వెడలు బోధను వినుము. అట్లు వింటెనే మంచిది. ఎందుకనగా! నీవు ప్రపంచమున పుట్టినందులకు సద్గురు పాదము బట్టినందులకు, సద్భక్తిచే నట్లొనరించినచో, వారు నీతప్పులన్నియు దిద్ది, నీకు సరియైన మార్గమును బోధ చేయుదురు.

క॥ గురుఁడు పరిపూర్ణమును, జూ। పెఱుకే లేదనుచు
దెలిపెఁ యికదలపకుమం। చెఱిఁగించక, విడిపోవునె। యెరుక

Dr DayanandaSwamy ebooks



నరుల్ సాధనములు ॥ నెన్ని చేసినను । లక్ష్యముద్ర । లెన్ని
చూచినను ॥ హరిహర బ్రహ్మ, సురాసుర ముఖులైన । ధరణీ
సురాద్యష్టా । దశజాత్యుద్భవులైన ॥ నెన్నిచేసినను ॥ 134

తా॥ శిష్యా! మానవులెన్ని సాధన లొనర్చినను, లేక లక్ష్యముద్ర లెన్ని జూచినను, హరి హర బ్రహ్మ సురాసురలకైన, బ్రహ్మ, క్షత్రియ వైశ్య, శూద్రాది పదునెనిమిది జాతుల వారికైన, గురు వచ్యం 'ఇది పరిపూర్ణము' అని జూపించి యిక నెరుక జోలికి బోకుమని దెల్పునంతవరకు యెరుక వదలి పోజాలదు.

క॥ బలధన విద్యాధైర్యం । బులు, చక్కదనంబు సత్త్వ
బుధ్యాదులిలం । గలలోనివి లేని మను । ష్యుల జగమును
దనసుదాను ॥ జూచి మానవుడు । మేల్కనేని । చూడతేం
డొకడు । కలమేల్క లెరుకబయు । లు కట్ల జతగూర్చి । కల
యెరుకల, దేశి, కులచే వీడితెచాలు ॥ చూచి మానవుడు ॥

తా॥ శిష్యా! ధనము, బలము, విద్య, ధైర్యము, చక్కదనము సమృద్ధి యీమొదలు గాగల వన్నియును కలవంటివి యని దెలసికొనుము. కలలో గాంచిన వన్నియును మేలుకొనిన నుండవుగదా? కల మెలకువలకున్న సంబంధమువలె, పరిపూర్ణ మెఱుకలకు జతగూర్చి, విమర్శించి, కలను యెరుకను సద్గురు కృపచే విడచి పెట్టిన చాలును.

క॥ ఈ వట్టిబట్టబయులును । నీవిప్పుడు నుండజూచి । నిజ
ముగ నెరుక । న్నవని నేనని జగమని । భావింపుము విడవ
దీని ॥ బాయము మనిశముఱ । యేము నిజనుమీ నివహన్నిశముఱ ॥
శ్రీవనితేశ, రాజీవ సంభవభవ । దేవేంద్రాదులు నింక సేవించ
తలపేల ॥ బాయుమనిశముఱ ॥ 1

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! ఈయుక్త బట్టబయలైన పరిపూర్ణమును, నీవుండజూచి యిదియే నిజమని నమ్మి, నీవు నేను, ఈప్రపంచమును, యెరుకని భావించి పిమ్మట నెరుకను వదిలిపెట్టుము. సదా యీ భావమును మరచి పోకుము. లక్ష్మి, సరస్వతి, గౌరీ, బ్రహ్మ, విష్ణు మహేశ్వరాది దేవతలను సేవించవలె నను తలంపు నుంచకుము.

క॥ లేదనకు మున్నదదిగో । నేఁ దెలిసితి ననకుదీని నీవెటుఁ
గెనవా । కాదది నీచే దెలియను । యేదిర తన్మాత్రసమితి ॥
యీబట్టబైటా । దీనికిసాటి యేది యెచ్చోట ॥ వాదేల నిఁక
యెరుకతో, దీనికనిపెట్టి । పోదోలు మెరుకని । కేది బట్టను
చారు ॥ యీబట్టబయుట ॥ 137

తా॥ శిష్యా! అచల పరిపూర్ణమును లేదనకుము. ఉన్నదదో చూడుము చూచి నే దెలిసితినని బలుకకుము. నీకు దెలియ సాధ్యమగునా? నీవు దానిని దెలియలేవు. దాని యందు పంచ తన్మాత్రలు లేవు. ఆపరిపూర్ణమును సాటియైన దేదియులేదు. వాదించుట నొదిలి, యెరుకచేత పరిపూర్ణమును దెలసి, యెరుకను విడచి పెట్టుము. అట్లు విడచితివేని, నీకేదియు నంటదు.

విశే:— పంచ తన్మాత్రలు = శబ్ద, స్పర్శ, రూప, రస గంధములు

క॥ కనవచ్చి యిట్టిదట్టిది । యనరాకుండునది, బయలు
నదె కనుగొనుమీ । కనరాకపోతె శూన్యం । బనుమిట్టిది యట్టి
దనుచు ॥ బలుక వచ్చినను । నెఱుక యాలోపలికి జొచ్చినను
వినుమా బయలును నీవే । మునిన నొప్పెదగానొ । ప్పను నీమాటకు
నేజె, ప్పినరీతి గనరాగఁ ॥ బలుక వచ్చినను ॥ 138

తా॥ శిష్యా! కనవచ్చుచున్న పరిపూర్ణ మిట్టిదని వచించుట కెవ్వరికిని యలవికాదు. అది ప్రత్యక్షముగా కనుపడుచున్నది చూడుము. కనుపడ

Dr DayanandaSwamy ebooks



కుండిన యెడల శూన్యమని చెప్పుము పరిపూర్ణ మిట్టిదని తెలియబడదు. ఎఱుక పరిపూర్ణమంను జొరదు. నే జెప్పినటుల విని, ఎఱుకను విడచిపెట్టి పరిపూర్ణమునే నమ్ముము.

కII కనవచ్చు బయలు లేదని। యనవచ్చునె, యిట్టిదట్టి దనవచ్చునె, ఛీ। యనరాదెఱుకను నెన్నడు। గనుకనె నీబయలు నెల్ల II కాలముఁ౦టుండీ । దీనందెఱుకే కాలము లేందీ। వినుము లేనెరుకను; వివరించ శూన్యమౌ । యనుమానమే యెఱుక, గనువిశ్వమిట్టిదే II కాలముంటుందీ II 139

తాII శిష్యా పరిపూర్ణము ప్రత్యక్షముగా నగుపడుచుండ, లేదని యెట్లు జెప్పవచ్చును. ఇట్టిదట్టిదని వచించుట కలవిగానిది. ఎరుక యున్నదని చెప్పదమా ? ఛీ అట్లు చెప్పగూడదు. పరిపూర్ణము సర్వకాల మొకే విధంగా శాశ్వతంగా నున్నది. దీనిలో యెరుక యేకాలమందు నుండనేరదు. చక్కగా విచారించినచో యెరుక శూన్యమై యనుమానాస్పదమై నిలచును. అనుమానమే యెరుకయని దెలియుము. ప్రపంచము యెరుకవల్ల జన్మించినది కావున అదియును నిజముగాదు.

కII పరిపూర్ణ మనిన నెట్టిదొ। యెరుకెఱిఁగిన నెఱుక బైట కేగిన యెరుకె । యెఱుకకు శూన్యంబయ్యెను । యెఱుకను జన్మించినట్టి II యీ విశ్వమంత । యెరుకవలెనే యేమిలేదంత । యెరుక యుండగానె । నెరుక విశ్వములు లేనెఱుకే యివిగూడ, నెంతోవింతైతోఁచు II యీవిశ్వమంత II 140

తాII శిష్యా ! పరిపూర్ణ మిట్టిదని తెలిసికొనిన యెరుక తాను వెంటనే పారిపోవును. అట్లు పారిపోయి తాను శూన్యమని యెరుంగును. అంతట యీ యెఱుక వలన గలిగిన ప్రపంచము అంతకంటె దూరముగా దొలంగును. ఎరుక యుండగానే, ఎరుకయు నీప్రపంచము, లేనియెరుకకు యెంతో చిత్రముగా దోచుచుండును.

Dr DayanandaSwamy ebooks



క॥ గురుమూర్తి చూపకున్నను । పరిపూర్ణంబెట్లు తనకుఁ
బ్రత్యక్షమగుఁ ? । గురుమూర్తి చూపెనేనియుఁ । బరిపూర్ణము
తనకులెస్స ॥ ప్రత్యక్షమౌరా । చూచితె యెరుక పారిపోవునురా।
యెరుక పోయిన వెనుక యెవరా ప్రత్యక్షాన్ని। యెఱికిట్టి దట్టిదం,
చెప్పఁగు వారటుమీఁద ॥ ప్రత్యక్షమౌరా ॥ 141

తా॥ శిష్యా! సద్గురు వర్యుఁడు జూపకుండిన యెడల పరిపూర్ణము తనకు ప్రత్యక్షము గానేరదు. గురువు బోధించినచో చక్కగా ప్రత్యక్షమౌను అట్లు పరిపూర్ణమును దాను దర్శించిన తోడనే, ఎరుక పారిపోవును. అటు పైన పరిపూర్ణ మిట్టిదని వచించువారెవరు ? ఎవరును లేరని తెలియుము.

క॥ పరమపదమనఁగ బయలన । గురుగుహ్య మనంత
మనిన గోప్యంబనినఁ । పరిపూర్ణ మచల మనినను । తిరమ
నఁగా బట్టబయలు ॥ తెలియుమూయప్పా । తెలిసిన యాతెలివి
మానప్పా । యెరుక నెరఁగినదాని । నెరుక మీరినదాని । నెరుక
మరుపులులేని, పరవస్తువన, బయలె ॥ తెలియుమూయప్పా ॥

తా॥ నాయనా! పరమపదము, బయలు, గురుగుహ్యము, అనంతము గోప్యము, పరిపూర్ణము, అచలము, స్థిరము, అను నీనామము లన్నియు బయలునకు మారుపేళ్ళని దెలసికొనుము. అట్లు గాదని భేద బుద్ధితో దెలసికొనిన తెలివిని విడచిపెట్టుము. ఎరుక నెరింగినదియు, ఎరుకను మించినదియు, ఎరుక మఱపులు లేనిదియు, అగు పరవస్తువే బయలని దెలియుము.

క॥ బట్టబయలనుచు దీనికి । మొట్టమొదల్ పేరులేదు
ముందమున నెరుకే । పుట్టియుఁ బేరిడి దీనిని । బట్టుకలవ్వాడలేక॥
పారిపోవునురా । కనరాదిందు, దూర నేరదురా । పుట్టి చచ్చును

Dr DayanandaSwamy ebooks



మళ్ళి । పుట్టిగిట్టుచునుండు । నిట్టి తిప్పలు నొంద దెరుకే బయు లునఁ జూడ ॥ పారిపోవునురా ॥ 143

తా॥ శిష్యా ! దీనికి బట్టబయులని మొట్టమొదట పేరు లేనేలేదు. ఈ యెరుక పుట్టిన పిమ్మట పేరు బెట్టి దానిని పట్టుక లవ్వాడలేక పారిపోవును. కాని యాపరిపూర్ణమందు దూరనేరక, మరల మరల బుట్టుచు, మరల మరల జచ్చుచు నిటు లనేక తిప్పలు నొంది తుదకా యెరుక బయలును జూచి తనంతట తానే పారిపోవునని తెలియుము.

క॥ వినుమా నేనని యెరిగెడి । తనువందున లేదు బయలు తానిండినదౌ । గనుఁగొను మదిగనుఁ గొనియీ । తను వును విడనాడుమింత ॥ తడువేలనోయీ । యీపనికింత గడువేల నోయీ । అనుమానముంటె యాఘనులైన, శివరాములను దీక్షి తులు చేసె, యచల గ్రంథమునంత ॥ తడు ॥ 144

తా॥ శిష్యా ! వినుము. నేను నేనని గుర్తించెడు శరీరమందు పరి పూర్ణము లేక అంతట నిండియున్నది చూడుము. అది జూచినపిమ్మట యీ శరీరమును విడచి పెట్టుము. ఇందుల కాలస్యమేల ? దీనికి గడువు కావల యునా ? అనుమాన ముండిన యెడల, మాపెద్దలగు శివరామదీక్షితుల్ల వారిచే రచింపబడిన యచల గ్రంథమును చూచి సరియని దెలిసికొమ్ము.

క॥ దేహాకారము కానిది । యాహంభావంబులేని । యఖిల జనులు, దా సోహం సోహంబనినను । మోహము జెందనిది బయలు ॥ మొదలెరుఁగవలెరా । యెరిగిన యెరుక తుదకరుగ వలెరా । కోహం కస్త్వంబని । కూతలు గూసెడి దేహి దేహములని తెలియనిదీ బయలు ॥ మొదలెరుఁగవలెరా ॥ 145

తా॥ శిష్యా ! పరిపూర్ణము దేహాకారము గానటువంటిది. అహం భావము లేనిది. సమస్తజనులు దాసోహం, సోహం అని పలుకుచుండినను

Dr DayanandaSwamy ebooks



మోహము జెందునదికాదు. అట్టి పరిపూర్ణమును దర్శించిన పిమ్మట, యెఱుక పారిపోవుటకు సందియము లేదు. నేనెవడను, నీవెవడవు అను దేహాత్మలను రెంటిని పరిపూర్ణము దెలియకుండునని తెలియుము.

కll ఏవస్తువు చేతను దా । నావిర్భవమొందు దేహమను తనువరయన్ । అవస్తువె దానికి, వి ॥ త్తైవెలయును దాన్నె సాక్షి ॥ ద్రష్టనిగనుమీ। యెఱుకయిదె స్రష్టము వినుమీ। భావించి చూడుమీ బట్టబయలును భూమి । యావిత్తు చెట్టున్న దరయ దావిత్తునే ॥ ద్రష్టనుగనుమీ ॥ 146

తాll శిష్యా ! దేహమను వృక్షము. యేవస్తువుచేత బుట్టుచున్నదో, అవస్తువే దానికి విత్తయి యున్నది. అవిత్తనమునే సాక్షియనియు, ద్రష్ట యని నీవు దెలిసికొనుము. అదినీవు దెలిసికొంటివేని యంతయు స్రష్ట మగును. బయలును భూమి ఆ ద్రష్టయనువిత్తనమును దేహమనుచెట్టును యీరెంటి నెరుగదు. అనగా ! యీ రెండును యెఱుక రూపమని తెలియ వలెను.

కll ఏపరిపూర్ణము మేనికి । లోపలి వెలినుండి యుండు లోపము లేకన్ । అపరిపూర్ణమె జగతికి । లోపల వెలినుండి దాని ॥ లోనె యున్నదిరా । పయి రెండివ్వి లేనివెన్నకురా । ఈపూర్ణ బోధచే పైప్రపంచ శరీర । రూపము లెడబావు మీపట్లనే దాని ॥ లోనేయున్నదిరా ॥ 147

తాll శిష్యా ! ఏ పరిపూర్ణమైతే దేహమునకు లోపల వెలుపల నిండుకొని యున్నదో, అపరిపూర్ణమే యీ ప్రపంచమునకు లోపల వెలుపల నిండి యుండి దానియందేనున్నది. ఈ పరిపూర్ణ బోధచే దేహ ప్రపంచముల రెంటిని విడచి పెట్టుము.

Dr DayanandaSwamy ebooks



క॥ ఎరుకనగా నెరుగుట, మఱి। మరుపనఁగా నెరుక తనను మరుచుట యీరెం। డెరుగనిదే బయలని, నీ। వెఱి గెరుకను మరువునిష్ప॥ డెరుకచే విడరా। విడిచితె పైమాట లెరిగేదెవ్వడురా। యెరుకే పరిపూర్ణమం చెదిరించి వదిరేవు। పరిపూర్ణమైతె చూపర బయలందున దాని॥ నెరుకచే విడరా॥

తా॥ శిష్యా! ఎరుకనగా ఈప్రపంచమును దన్నును యెరుగుట, మరుపనగా అట్లు దెలిసికొన్న తెలివిని మరచి పోవుట. ఈరెంటిని యెరుగనిదే పరిపూర్ణము. ఈయెరుక మరుపుల రెంటిని నీవు యెరుకచేత త్యజింపుము. అట్లు విడచి పెట్టిన పైరెంటిని యెరుగు వారేవ్వరును లేరు. యెరుకను పరిపూర్ణ మనబోకుము. అట్లంటివేని పరిపూర్ణమందు యెరుకనుజూపించుము.

క॥ లేదన్నను గనుపడు గద। నేదెలిపెదనన్న బయట నేనిల్వగదా। నేదీని వెనుకగదనా। కేదోమూలంబిదేగ॥ నిక లేదెచ్చోట। కనుక నుళ్ళకెక్కనుమాట। సకల వస్తు విషయ సాక్షిత్వములకు దా। నొకరూపమైయుంట నూహింపుమను భ్రాంతి॥ యికలేదెచ్చోట॥ 149

తా॥ శిష్యా! పరిపూర్ణము లేదని యన్నను కనుపడుచున్నది లేదని యెట్లనవచ్చును. నే దెలిపెద నన్నచో, నేనను అహంభావము పరిపూర్ణమున లేదుగావున, నేననునది నా పరిపూర్ణముకంటె వెనుక వచ్చినది. నాకు మూలము యిదేగాని మరేమియులేదు. కావున నేననునది యబద్ధము. నేననునది పోయెనేని యెరుక మాయమగును. సమస్త వస్తు విషయ సాక్షిత్వము నూహింపగా నంతయు భ్రాంతి రూపముఁగా నుండుటచే అచలమును దెలసి కొందునను భ్రాంతి గలిగినది. కాని యెరుకకు మూలము లేనే లేదని తెలియుము.

క॥ సత్యమగు బట్టబయలు, న। సత్యంబగు నెఱుక నెఱిఁగి సద్గురు కృపచే। సత్యము గాదని యెఱుకను। సత్య

Dr DayanandaSwamy ebooks



ముగా నమ్మియుంటె ॥ చాలుచాలన్న । వానితోటి సాటెవ్వరన్న।
నిత్యానిత్యములను । నిర్ణయ మెరుగక । నిత్యుఁడై యుండెడు,
నిజబోధ గలిగితే ॥ చాలుచాలన్న ॥ 150

తా॥ శిష్యా! సత్యమైన పరిపూర్ణమునందు అసత్యమైన యెరుకను సద్గురు కృపవల్ల సత్యము కానిదని తెలిసికొన్నచో వాని సమానుండెవ్వడును లేడు. నిత్యము అనిత్యములను నిర్ణయమునెరుంగక నిత్యుడై యుండునట్టి నిజబోధను జెందిన అదియే చాలును.

క॥ పరిపూర్ణములోఁ దోచిన । యెరుకే కలలేని యెరుక
నెరిఁగిన మృషయీ । మరుఁగెరుక కెరుక దెల్పిన । నెరుగుట
మేల్కనదుసుమ్మి ॥ యిదియేమఅకుమీ । సద్గురునాజ్ఞ, కెదిరి
మీరకుమీ । యెరుక నారీతిగ నెరిగిపోయిన వెనుక । పరిపూర్ణ
మొకటుండు పలుకరాదెట్లందు ॥ నిదియేమఅకుమీ ॥ 151

తా॥ శిష్యా! పరిపూర్ణమందు దోచిన ఎరుక కలవంటిది, అనగా లేనిది. దాని నెరుగబోయిన అదే లేకుండగా బోవును. ఎరుక యొక్క మరుగు యెరుక దెల్పిన, నది యెరుగుటయే మెలకువయని తెలియుము. ఇది మరువకు సుమా! సద్గురు స్వామి యాజ్ఞకు నెదురు దిరుగకుము ఎరుక నీ ప్రకారముగ యెగిరి పోయిన పిమ్మట, పరిపూర్ణ మొక్కటే నిలచి యుండును. అది అట్టిదిట్టిదని పలుకుటకు సాధ్యముకాదు.

క॥ నేటగు కాటుక పక్షుల । కూటమియై నడుమనల్ల
గుడ్డున్నది, యీ । మేలైన గ్రుడ్డునడుమను । నాటుక నొక
తేజమున్న ॥ దటుగానవన్నా । బట్టబయట నలవందునన్నా ।
పటుతర శోణిశు । భ్రమనీలపీతాది । పటలములో నుంచి,
పరమైతావెలుగొందు ॥ నటుగానవన్నా ॥ 152

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా ! అందమైన కాటుక పక్షుల కూటమివంటి, నేత్రి మధ్యంబున నొక నల్ల గుడ్డు గలదు. ఆ గుడ్డునకు నడుమ నొక తేజమున్నది. ( దీనికే ఆపోజ్యోతియని పేరు ) దానిని నీవు కనుగొనుము. అది యెరుపు. తెలుపు, నీల, పచ్చ మొదలగు వర్ణములలోనుండి పరమై వెలుగొందు చున్నది. అటు నీవు చూడుము అది పరిపూర్ణమునందు తోచి తోచక పోవుచున్నది.

క॥ వినుమెరుకే యదిగనుఁగొను । వినుతింపగ బయలటన్న విను తెరువనినఁ । గనుఁగొన బాత్రలు గనుపడు । తనువన నవయువములన్ని ॥ తగదొంతి యనిన । గుండలిభూతి తత్రిజాగ్రతనిన । వినుమట్లు యెరుకన్న వివరింతు తత్వాలు । మనసందు గట్టిగ, మరువకు మీమాట ॥ తగదొంతియనిన ॥

తా॥ శిష్యా ! పరిపూర్ణమును యెరుకే కనుగొనును ఈ యెరుక నొక్కొక చోట నొక్కొక రీతిగా వ్యవహరింప బడును. బయలునకును ఆకాశంబునకును యోగ్యత వలన భేద మగుపడుచున్నది. శరీరమును, ఇంద్రియ తత్వసమూహమును, జాగ్రితయును కుండలీ మొదలగునవి యెరుక యనంబడును. ఇదినీవు మరువకుము. యెరుకకు దేహేంద్రియములే దొంతులని తెలియుము.

క॥ పొర లరఁటి దుంపయనినను । దరువును ధనమనిన రవలు ధారుణి యనినఁ । గిరియన్న రాళ్ళుగుట్టన । ధరణిఁ ముళ్ళనిన తత్త్వ॥ తతియెఱుకంచనిన। లేనియెఱుక సుస్థితి తెన్న గనిన ॥ నెఱుక చేసిన విశ్వ । మెఱుకవంటిదె బయలు । నెఱుక గుర్తెఱిగితా । నెఱిగితే సరితత్త్వ ॥ తతియెఱుకంచని ॥ 154

తా॥ శిష్యా ! పొరల విశేషమే అరటి దుంప యనిన చెట్టే యగుచున్నది. భూమి యన్నను, రత్నము లన్నను ధనమే యగుచున్నది. గిరియనినను, రాళ్ళనినను కొండలే యగుచున్నవి. అటులే ముళ్ళన్నను, తత్వము లన్నను, యెరుకే

Dr DayanandaSwamy ebooks



యని దెలియుము. యెరుకయొక్క స్థితిని బాగుగా దెలిసికొని, ఆ యెరుకచే గలిగిన యీ ప్రపంచమంతయు యెరుకే (అబద్ధము) అని పరిపూర్ణ మెరుక లను దెలియుటే సరియైన పద్ధతి.

క॥ పెనుమాయనుజూడుమ యిదె । జనకుని జఠరంబు వలన జననీగర్భం । బునఁజొచ్చి మాఱురూపున । జనియిం చును నవయవములు ॥ జనితమైభువిని । వినఁగనఁదినమూ ర్కొను వచ్చునుచని । దినదినమభివృద్ధొ, దీనిచే బయలును । గని యీ మాయల మఱల । గదమాయించుము పోనీ ॥ జనిత మైభువిని ॥ 155

తా॥ శిష్యా ! ఈ మహామాయనుజూడుము. తండ్రి కడుపున శుక్లరూపం బున నుండి, తల్లికడుపున బ్రవేశించి, సకలావయవములుగల్గి మారూరూప ముతో (శిశురూపమున) ఈ భూమియందు దేహమై జన్మించును. ఇది తినుటకు, జూచుటకు, వినుటకు, అనుటకు, అలవాటు పడి దిన దినాభివృద్ధి జెందును. ఈ దేహము యొక్క సహాయమున పరిపూర్ణమును దెలసికొని, యీమాయను తరిమివేసి, ఆ మాయా రూపంబైన శరీరమును వదలి పెట్టుము.

క॥ పెట్టియలోపలి గారడి । చెట్టుప ఝ గానవచ్చి చెట్టని చూడఁ । గట్టుపయిదోచు నిది, కను । కట్టుసుమీ ! దీనివలెనె॥ గనుపించునెఱుక । అంతలోనెచట । గనుపించదెఱుక । దిట్టమౌ బోధచే, పట్టియెఱుకను, తిరిగి । పుట్టకుండగదాని పుట్టిముం చుము లేందే ॥ గనిపించునెఱుక ॥ 156

తా॥ శిష్యా ! గారడి వాడొక పిల్లవానిని పెట్టెలో నునిచి మూతవేసి, కొంత సేపటికా మూత దెఱచి జూడగా అందులోని పిల్లవాడా పెట్టెలో నుండక వొక చెట్టుపై గానుపించును. అట్లు చెట్లుపై గానుపించిన పిల్లవాడు క్షణ

Dr DayanandaSwamy ebooks



మననే లోకు లెల్లరు జూచుచుండగానే గట్టుపై గానుపించును. మఱికొంత సేపటికి, యెక్కడను గానుపించ కుండును. ఇది కను కట్టు విద్యసుమా! అటులనే, ఎరుకకూడ ఒకప్పుడగుపడి యింకొకప్పు డగుపడ కుండును. సద్గురు బోధచే యెఱుకను తెలిసికొని. మరల పట్టకుండుటకై దానిని నాశ మొనర్చుము.

క॥ నేననని బ్రహ్మలోపల । లేనిది సంభవమునొంది లీల తనకుఁదా । మేనుజగములై వెలసెను । నేనదిమృగజలమురీతి॥ నిజముగాదనుచు । లోకులనెడు, గజిబిజి వినుచు । మానసమున వారి, మాటకామోదించి । దానికీబోధను. దగునంచు వినజేస్తి ॥ నిజము గాదను ॥ 157

తా॥ శిష్యా! నేను నేనని 'పరిపూర్ణమందు లేని యెరుక బుట్టి, తానే శరీరముగను ప్రపంచముగను పరిణ మించెను. నే ననెడి యహంకారము, మృగజల సమానముగా నెంచుము. లోకులాడెడు వాక్యములును, నీమనస్సులో సరియగునా ? కాదా? యని విచారించి గ్రహించుటకే, ఈ పరిపూర్ణ బోధను నీకు తగునని యుపదేశించి యున్నాడను.

క॥ కల నెడబాసిన మనుజుల । కలలోపలి పనులుసేయఁ గలవారలె, యా । కలవారుగారు, వారల । వలె నెఱుకను గురునిచేత ॥ వద లెఱుకలోన । గలదనిసేయు, వల దెఱుకలోన। కలవారంచనినోట । బలుకుట నరయక । పలికిన వారికి దొలఁ గదు పాపము ॥ వలదెఱుకలోన ॥ 158

తా॥ శిష్యా! కలగనువారు యాకలయందలి పనులు జేయుదురు గాని, జాగ్రిత నొందిన పిదప యా పనులను జేయలేరు. అట్లే గురుకృపవల్ల యెరు కను విడచి పెట్టినవారు మరల నెరుకకులోబడరు. వీరు పరిపూర్ణజ్ఞానులు,

Dr DayanandaSwamy ebooks



వీరు కలలోని వారని చెప్పగూడదు. అట్లు జెప్పినచో వారికి పాపముతప్పక సిద్ధించును.

క॥ గుడమే, మధురము, మధురమె । గుడ, మీగుడ మధురములను గొనకొని తెలుతఁ । బొడమినదే తనసరిగా ॥ బొడమిన దొకటిగను రెండు ॥ పోనట్టెగదరా । తను వెఱుక లిట్లయినట్టేగదరా ॥ పొడజూచి బయలు । నిప్పుడె మేనెఱుకల జోలి । నిడరాలేనిదెరెండు । పెడచెవులిడక విను ॥ పోనట్టె గదరా॥ 159

తా॥ శిష్యా ! బెల్లమేదీపి, తీపే బెల్లము. రెండు విధములుగా పరిణమించిన బెల్లము తీపి యెటులడాచెనో, విచారించిన రెండునెట్లు పోయెనో, అటులే దేహాత్మలు రెండును యెరుకగా పరిణమించి, పరిపూర్ణమును దర్శించిన వెంటనే పారిపోవును. కాబట్టి గురుడు జెప్పినట్టి బోధను జాగ్రతగావినుము.

క॥ ఇదియున్నది యిదియున్నది । యిదియున్నదియనుచు బయలు నెఱిఁగి యెఱుకచే । నిదిలేని దిదియులేనిది । యిది లేనిది యనుచు నెఱుక ॥ నెఱిఁగితే సరిరా । అపైనుండే దె । ట్లుందువినరా ॥ ఉదయాస్తమానము । లుడుగక, యిదినీ । నెమ్మది లోననమ్మి, నామాట నిశ్చయ మి॥ ట్లెఱిఁగితే సరిరా ॥ 160

తా॥ శిష్యా ! ఇది యున్నదున్నదని పరిపూర్ణము నెరిగి, అట్లు నెరిగిన యెరుకను లేదులేదని తెలసికొనుటయే సరియైన మార్గము. అటుపైనుండిన పరిపూర్ణమును నీ।నోట వచించుటకు సాధ్యము కానందున, నామాట నిజమని నమ్మి రాత్రింబవళ్ళు దృఢ మానసుండవై, నీకు నీవే పరిపూర్ణమును గనుగొమ్ము, ఇదియే మంచిమార్గము.

క॥ ఎఱుగననుటయును నెరుకే । యెరుగుదుననితన్ను బరుల నెరుఁగుట యెరుకే । యెరుక నెరుంగుదు ననితా । నెరుఁ

Dr DayanandaSwamy ebooks



గుచు నుండునది యెరుకె ॥ నిరుపమబుద్ధి । నీవెఱుఁగుట నిగమ ప్రసిద్ధి ॥ గురుమంత్రమనియెడు । గునపముతోడ । నీ యెరుక కుండువేరు, నెఱిఁగి త్రవ్వితేచాలు నిరుపమబుద్ధి ॥ 161

తా॥ ఓ శిష్యా ! సమస్తము నేనెరుగుదును, నేనెరుగను అనునది యెరుకయే సుమా ! తన్ను యితరులు దెలియునట్టిదియు గూడ యెరుకే. యెరుకను నే నెరుగదునని చెప్పునదియు యెఱుకే. ఈ యెరుకనే, వేదములు గూడ ప్రసిద్ధముగా చెప్పుచున్నవి. సద్గురూపదేశమను గునపముతో నెరుక యను వృక్షమును కూకటివ్రేళ్ళతో ద్రవ్వివేయుటయే మంచిమార్గము.

క॥ ఎరుకే చదువులఁ జేయును । యెరుకే విను జదువు నెరుక యెరుకే, తిరమం । చెరిఁగించును శంకించును । యెరుకే కొనకేమిలేక ॥ నేగునో రన్నా । బయలే చదువు నెరుఁగదోయన్నా। యెరుకే యెన్నటికైన । పరిపూర్ణమున్నదం । చెఱిగితె లేదని యెఱిఁగితే నిలువక । నేగరో రన్నా ॥ 162

తా॥ శిష్యా ! వేదశాస్త్ర పురాణేతిహాసము లన్నిటికి కారణముయెరుకే, వినునదియు, చదువునదియు యెరుకే, ప్రపంచము నిజమని తెలియజేయునది, కాదని సందేహించునది యెరుకే, తుదకు యేమియు లేక మాయమగునది యెరుకే. పరిపూర్ణమునకు పై జెప్పిన వేమియును లేవు. యెప్పుడో యొక ప్పుడీ యెరుక పరిపూర్ణ మున్నదని తెలిసికొని తాను లేనని నిలువక పారిపోవును.

క॥ చూపులలో గలవస్తువు । చూపులఁగను వస్తువులను జూపులు చూడఁగ । తేపకు నెరుకని తెలియును । చూపులు లేనట్టిబయలు ॥ చూచేదింకేది । యెఱుకేలేదు. తోచేదింకేది ॥ దీపమువలె, గనుపాపలో గలవస్తు । వే పరమాత్మని జూచిన దెరుకాయె ॥ చూచేదింకేది ॥ 163

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! చూపులలోనుండు వస్తువులును, చూడబడిన వస్తువులును, చూపులును, ఈ మూడును యెరుకని దెలియుము. చూపులులేని పరిపూర్ణము దేనిని జూడబోదు. పరిపూర్ణమందు యెరుకలేదు. కావున దోచుటయెట్లు? రెండును యబద్ధము కంటిపాపలందు జ్యోతివలె కనుపడు వస్తువే పరమాత్మ యన, నది యెరుకయని తెలియుము. పరిపూర్ణమునకు జూచుటయు దోచు టయు లేదు.

క॥ శతపత్రాప్తునిఁ బొడగని । యతిరయమున తిమిర మణఁగి యగుపడదెట్లు । ట్లతులిత గురుకృప గలిగిన । మతిమంతులఁజూచి యెరుక ॥ మరినిల్వబోదు । సంశయము నీమది నిలుపరాదు ॥ శృతులందు స్మృతులందు । నితిహాసముల యందు । సతతము శ్రమపడి, వెదకిన, నీయెరుక ॥ మరినిల్వ బోదు ॥ 164

తా॥ శిష్యా! సూర్యుని పొడగనిన తోడనే చీకటి పటాపంచలై పోవు నట్లు, గురుకటాక్షముచే పరిపూర్ణము గన్నవారిని గాంచి, యెఱుక నిలువక పారిపోవును. యిక నీమదియందు సందేహ ముంచకుము. వేదశాస్త్ర పురాణేతి హాసములందు నీవు శ్రమపడి వెదకి జూచినను యీ యెరుక నిలువక పారి పోవును.

క॥ ఎరుకే కోశములైదును । నెరుకే భూతముల నెరుఁగు నెరుగును సర్వం । బెరుకే, యెరుక నెరుంగును । నెరుకను గుర్తెరుగ వేరే ॥ యెరుక యున్నదా । ఉన్నదంటే నరకమే కాదా। నిరతము గురుసేవ పరతంత్రుడగుచు । సత్కరుణకు పాత్రులై యెరుక మానినవారి ॥ కెరుక యున్నదా ॥ 165

తా॥ శిష్యా! పంచభూతములు పంచకోశముల యెరుకేయని తెలిసి కొనుము. సర్వమును గుర్తించునదీ యెరుకే. సర్వమును గుర్తింప జాలు

Dr DayanandaSwamy ebooks



నట్టి యెరుకను దెలిసి కొనుటకు, యెరుక తప్ప మరియొకటి లేదని నమ్ముము. యెరుకను యెరిగేది వేరే నింకొకటి యున్నదనిన వాక్కుదోషము సంభవించును. అహర్నిశము సద్గురు సేవా పరతంత్రులగుచు వారికరుణకు పాత్రులైన వారికి యెఱుక లేనేలేదు. యున్నదని పల్కుట పాపమే యగును.

విశే:—పంచకోశములు = 1 అన్నమయకోశము, 2 ప్రాణమయకోశము, 3 మనోమయకోశము. 4 విజ్ఞానమయకోశము. 5 ఆనందమయగోశము.

క॥ గురుమంత్రముచే నిలువని । యెరుకను బరిపూర్ణ
మనుచు నెరిఁగి నిరతముఁ । యెరుకయి యుండినవారల । తెరు
విఁన నీకేలవట్టి ॥ దీజోలిమాను । యెరుకలేని యాజోలిపూను ।
గురునిచే పరిపూర్ణ మరసి యీ తెలిసిన । యెరుక నెన్నటికి నీవెరు
గకు మిదివట్టి ॥ దీజోలిమాను ॥ 166

తా॥ శిష్యా! గురు కటాక్షమును బొంది, స్థిరముగాని యెరుకను పరిపూర్ణమని నమ్మి యెరుక రూపులై యుండినవారి జోలి నీకెందులకు? అది పనికిరాని మార్గము వారిమార్గమున నీవు చేరకుము. యెరుక లేనటువంటి పరిపూర్ణముం బట్టుము. గురుని కరుణ వల్ల పరిపూర్ణమును దెలిసికొని యీ తెలిసిన యెరుకను నీ వెన్నడును దలచకుము.

క॥ లేనికలదోచినప్పుడు । లేనివిచిత్రంబులన్ని లేకయె
దోచుఁ । లేనికల మేలుకొన్నను । లేని విచిత్రములు తానులేక
పోవునురా । అనుమానములేదిందువినరా । లేనెరుక యీరీతిగా
నేబయలునుజూడఁ । దానుదనుత్రయముపూనెందు నిలుచుండ॥
లేకపోవునురా ॥ 167

తా॥ శిష్యా! లేనికల దోచినప్పుడు లేని వస్తువులన్నియు నున్నటులే దోచును. కలనుండి మెలకువజెందగానే యీకలలో లేని యెరుక పరిపూర్ణ

Dr DayanandaSwamy ebooks



మును జూచిన వెంటనే తాను స్థూల సూక్ష్మకారణ శరీరములతో నిలువక పారిపోవును.

విశే:—మహా కారణ శరీరమనగా జ్ఞానము. అజ్ఞానమే యెరుక యని తెలియదగినది.

క॥ మరణ సుషుప్తులఁ జెందిన । పురుషుఁడు మేల్కని నవాఁడు భువితదితరుడౌ । పురుషుఁడు కలగనువాఁడని । యెరి గుండుము మొదటియతడె॥ యెరుగఁడీరెంటిౕ । రెండవ పురుషుఁ డెరుఁగునీరెంటిౕ । ఇరువు రొక్కటెసుమ్మి, తిరిగి పుట్టుదురిల । గురునిచే మేల్కనినఁ, దిరిగిపుట్టనెపుట్ట ॥డెరుగఁడీ రెంటిౕ ॥

తా॥ శిష్యా ! మరణప్రాయమైన గాఢనిద్ర జెందువాడొకడు. మేలుకొని యుండువాడొకడు. ఈరెండునుగాని వాడు కల గనుచున్న వాడని దెలి యుము. వీరిలో మొదటివాడు కల మెలకువను దెలియడు. రెండవవాడు కల మెలకువలను రెండును దెలియును. ఈ యిరువురును యొక్కటే యగు దురు వీరు తిరిగి జనన మరణాదు లొందెదరు. గురుకృపవల్ల మేలుకొనిన వాడు దేనిని యెరుగడు. ఈతనికి జనన మరణాదులు లేవు.

క॥ ఎరుకే యెరుకకు కొడుకులు । యెరుకే దలిదండ్రు లెరుక కెరుకే యితరుల్ । యెరుకే యెరుకకు మూలము । యెరు కకు మూలంబు బయలం ॥ చెట్లందువోయి । ఎరుకలేక యేమి లేదోయి । యెరుకే లేని యుత్తపరిపూర్ణమునుజూచి । ఎరుకే తాలేనని, యెరిఁగి పోయినపై, మా ॥ చెట్లందువోయి ॥ 169

తా॥ శిష్యా ! ఎరుకకు పుత్రులు, తల్లి దండ్రులు' యితరమైన వార లున్న ఎరుకే. యెరుకే యెరుకకు మూలము, అట్లుండ పరిపూర్ణమే మూల మని యెట్లు చెప్పవచ్చును? ఎరుకలేనియెడల నేమియులేదు. లేని యెరుక

Dr DayanandaSwamy ebooks



పరిపూర్ణమును జూచి తానబద్ధమని తెలిసికొని మాయమగును. అపైమాట యెట్లుండును ? ఎరుక లేనపుడు ప్రపంచమే యుండదు.

క॥ గురుతుగఁ గలలోపల నీ। నరులూరక వచ్చిపొంది, నయముగ సుతులన్। వరకన్నియలను గాంచియు। గురు వరుచే మేలుకొనిన ॥ గురుతుండదన్న। అపైమాట నెరిఁగేదేదన్న। ఎరుకొక్కడుండిన, నేర్పాటులుండును। నెరు కొక్కటేగితే, యేర్పాటు చేసెడి ॥ గురుతుండదన్న ॥ 170

తా॥ శిష్యా ! సంసారమను నీ స్వప్నమందు మానవులు స్త్రీ పురుషులను గురుతులతో వచ్చి నొకరితో నొకరు సంబంధ మేర్పరచుకొని, కొడుకులను బిడ్డలనుగని, గురుకృపచే మేలుకొనిన పిమ్మట స్త్రీ పురుషులకు గురుతులుండవు. ఆ గురుతులను గుర్తించునదే యెరుక, యెరుక యుండునంతవరకే గురుతులన్నియు నుండును. (స్త్రీ పురుషభేదముండును) ఎరుక బోయిన పిమ్మట నేమియు నుండదు.

క॥ నినునను నీకలగాంతువు। నినుననుఁ గలలోనగాంతునేనొకవేళన్। నినునను నీవే నను నిను। గనుగొనగా గలమెమేలు ॥ కొనినమీఁదటను। గురుబోధిట్లు, వినినమీఁదటను। మునుపు గలిగి యెరుక। మొదటికే నిలువదు। నినునన్నునేనిన్ను, నిను నీవెరుంగుట ॥ కనిన మీదటను ॥ 171

తా॥ శిష్యా ! స్వప్నమందు నిన్నును నన్నును నీవు గాంచెదవు. అటులే, ఒకవేళ నేను నన్నును నిన్నును జూడగలను. మెలకువ జెందిన తర్వాత, నన్ను నీవును, నేను నిన్నును జూడలేము. అటులే గురుబోధ జెందిన తర్వాత; మునుపుండిన యెఱుక మూలముతో నశించును. అప్పుడు నన్ను నీవును, నిన్ను నేనును, తెలిసికొనిన నీవు నేను అను భేదముండదు.

Dr DayanandaSwamy ebooks



క॥ నిను నీవు నన్ను నేనును । నను నీవును నేను నిన్ను
ననునెరిగినదే । తననెరుగని దానినిగని । తనకలిమి మృషంచు
దెలిసి ॥ తానేగినను । అవిమేల్క లవ్వలిదాని, నెవ్వడెరుగును ।
ననునీవు నేనిన్ను వినిపింతు మొండొరులు । అనుటకిద్దరికిపుడు,
మునుపున్న యెరుకేరి ॥ తానేగినను ॥ 172

తా॥ శిష్యా ! నిన్ను నీవును. నన్ను నేనును, మరియు నన్ను నీవును, నిన్ను నేనుకు యెరుగుటయు యెరుకవల్లనే యని దెలిసికొనుము, ఆ యెఱుక తనను యెరుగనట్టి పరిపూర్ణమును గాంచిన తోడనే, సంపద నంతయు నబద్ధ మని తెలిసికొని తాను పారిపోవును. అట్లు ఎఱుక పారి పోయిన తర్వాత దాని నెరుగు వారెవ్వరో ఆలోచింపుము. (అనగానెవ్వరు నుండరు) మనకు ముందు నుండిన యెరుక లేకుండుటచే, నేను నీవుయను పరస్పర భేదభావ ముండదు. ఎటులన,

క॥ తిమిరారి యందులేనిదె । తిమిరముతనుదానెవచ్చి
తేజోనిధియై । తిమిరారి యునికి గన్గొని । తిమిరముదానిలువ
నట్లు ॥ తెలిసికోరాదా । బయలెరుకల, దెలిసి యామీద । భ్రమ
రూపమైనట్టి, బ్రహ్మాండ మెఱుకల । భ్రమదీసి వేసిన, భ్రాంతి
పుట్టదు మఱల ॥ తెలిసికోరాద ॥ 173

తా॥ శిష్యా ! సూర్యునియందు లేని చీకటి తనకుతానే యరుదెంచి, అంతటను వ్యాపించి, సూర్యోదయమునుజూచి తనకు దానే పారిపోవును, అటులే పరిపూర్ణ మందులేని యెఱుక తనకు తానే వచ్చి, పరిపూర్ణమును గాంచినంతనె, తనకుదానే పారిపోవును గురుకటాక్షమువల్ల భ్రమరూపమగు బ్రహ్మాండమెఱుకల భ్రమను త్యజించినచో మరల నా భ్రమ జనించదు.

క॥ లేదని లేదని యెందరు । వాదించిన లేకపోదు పరి
పూర్ణముతా । పోదని బోదని, నిలిపిన । పోదని యనుకోదు

Dr DayanandaSwamy ebooks



యెఱుక ॥ పోనేపోతుంది । గట్టిగలేచి పోనే పోతుంది । వాద భేదములేని వారిచే నెఱుకను । పాదుకదలించెడు పద్ధతినెరిఁగిన॥ పోనేపోతుంది ॥ 174

తా॥ శిష్యా ! పరిపూర్ణమును లేదులేదు అని యెందరువాదించినను, అది లేక పోలేదు. ఎఱుకను పోదుపోదని యెంత పట్టుబట్టి నిల్చినను పోదని యనుకొనకుము. పోనేపోవును. కావున వాద భేదములులేని మహాత్ములచే యెఱుకయొక్క పాదును పెకలించు పద్ధతి నెఱిగినచో, యెరుక మాయమై పోవును.

క॥ మేనెఱుకల రెంటనునొక । దానిని నెడఁబాసి చేయ తరమా పనులఁ । మేనికి నెఱుకకు గావున । మేనన నెరుకెరుక యఁనిన ॥ మేనని యెరుగు । రెంటినినీవు, నేనని యెరుగు ॥యెరిగి వీటితో బయలు । నెరిగి మేనెరుకల । తిరిగి చూడకఁ చూస్తె, గురుని పాదములాన ॥ మేనని యెరుగు॥ 175

తా॥ శిష్యా ! శరీరమున్ను, యెరుకయు నొకదాని నొకటి విడచి యేలాటి పనులైనను జేయఁజాలవు. కావున దేహమే యెరుకయనియు యెరుకే దేహమని దెలియుము. ఈ రెంటిని 'నేను' అను అహంకారమని యెరుగుము. వీటి సహాయంబున పరిపూర్ణము నెరిగి, అటుపిమ్మట దేహమును యెఱుకను మరలి చూడకుము. జూచితివేని నీగురు పాదముల యాన.

క॥ మఱపు సుషుప్తియు మూర్ఛయు । మరణంబుసమాధి యనుచు మానవు లెరుకఁ । దొఱగిన నరుని శరీరము । నెరిఁగె దరా నరుఁడుమేను ॥ నెరుఁగడో యన్న । తననైనతా, నెరుగడో యన్న । యెరుఁగకుండినవాడు । తిరిగి పుట్టుచునుండు । తిరిగి పుట్టఁడువాఁడీ గురుబోధ గల్గిన ॥ నెరుగడోయన్న ॥ 176

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! ఎరుకను విడచిన మానవుని దేహమునుగని, లోకులు మఱపు, మూర్ఛ, నిద్ర, మరణము, సమాధియని, ఈ యైదింటిలో నొకటిగా నెంచెదరు. ఆ యెరుకను విడచిన వాడు మరల మరల జనన మరణాదుల బొందును. కాని ఈ పరిపూర్ణబోధ వడసిన వాడు తానే లేకపోవును గనుక మరల పుట్టనే పుట్టడు.

**క॥ పరిపూర్ణ మెరుక లివియని । యెరుఁగని బయలందు లేని యెరుక తనకుఁదా । నరుదెంచుట గురుశిష్యుల । తెఱగున మాట్లాడి రెంటి ॥ తెలిసి తాఁ జనును। అపైమాట పలికేదేదికను। అరమరలేకనే, నెరిఁగించినట్టి యీ । గురుబోధ పాత్రుల నెరుఁగక తెలుపకు ॥ తెలిసి తాఁ జనును ॥ 177**

తా॥ శిష్యా! ఇది పరిపూర్ణము, యిది యెరుకయని యెరుగ జాలని పరిపూర్ణమందు లేనియెరుక తనంతట తానేవచ్చి, గురు శిష్యుల విధముగా వ్యవహరించి, పరిపూర్ణమును యెరుకను దెలిసికొని, తాను జనును, పైమాట జెప్పునది లేదు. యీబోధను పాత్రాపాత్ర విచారణ లేకుండా నీవెవరికిం దెల్పకుము.

**క॥ మఱపు సుషుప్తియు మరణము । పరిపూర్ణంబునకు సాటి పఱచి యెఱుకకుఁ । మఱువమి మెలకువ పుట్టువు। లిరు దెఱుగుల నెఱిఁగి యెఱుక ॥ నెగరజిమ్మోయి । ఆపైనుండే, దెఱిఁగేదెట్లోయి । గురుమంత్రమిదెసుమ్మి, మరువక యేపొద్దు । స్మరణ జేసితివేని తిరిగిపుట్టవు నీవ ॥ లెగరజిమ్మోయి ॥ 178**

తా॥ శిష్యా! మరపు, నిద్ర, మరణము నీమూటిని పరిపూర్ణముతోబోల్చి, తెలివి, మెలకువ, పుట్టుకలను యెరుకతో బోల్చి, రెండు విధముల బాగుగా దెలిసికొని, యెఱుకను యెగుర గొట్టగా; ఆ యెరుక నశించిన పిమ్మట నాపై

Dr DayanandaSwamy ebooks



నుండునది యెరుగుట శక్యముకాదు. ఇదే గురు మంత్రము సుమా! దీనిని మరచిపోక యెల్లప్పుడు స్మరించుచుంటివేని తిరిగి పుట్టవు.

క॥ క్షితిలోన నరుఁడు, పక్వా । న్నతతిని వెలిగ్రక్కి మరల నాకునె, యతిసం । సృతివిడిచి తిరిగి పూనునె । వితరణ శాలిచ్చినట్టి ॥ విత్తమడుగునా । సత్యశాలి, సత్యముడుగునా । ప్రతిలేని గురుబోధ, స్థితిఁజెంది, యెరుకనీ । గతిసంగ్రహించుఁడు, కృతకృత్యుఁడిచ్చిన ॥ విత్తమడుగునా॥ 179

తా॥ శిష్యా! మానవుడు పక్వాన్నమును దిని, వమనము జేసికొని ఆ కక్కిన దానిని మరల భుజించునా? సంసారము నిస్సారమని రోసిన, యతీశ్వరుడు మరల సంసారమందు జేరుకొనునా? దాతయైన వాడు అతిథుల కిచ్చిన దానమును మరల గ్రహించునా? సత్యవ్రతుడు సత్యము దప్పునా? అట్లే గొప్పదైన యీ గురు బోధను గ్రహించి యెరుకను విడచిన కృతకృత్యుడు మరల నెరుకను గ్రహింపడు.

క॥ మరుపనఁ దొలిమేనులుమూ । డెరుకన నాలవ శరిర మీ రొండొకటే । పరిపూర్ణమందలిదియని । యెరుకను గురువాక్కుచేత ॥ నెగరజిమ్మిననూ । పోవునులేని, యెరుక నెరిఁగిననూ ॥ ఎఱిఁగేదే లేకుండ, యేమో యావలిజాడ । నెరిగే వారెవరిక, నింతే చాలెరుకను ॥ నెగరజిమ్మిననూ ॥ 180

తా॥ శిష్యా! మరుపనగా మొదటి మూడు దేహములు యెరుకయన నాలవ శరీరము ఈ యెరుక మరపులు రెండు నొకటేయని దెలియుము. యీ నాల్గు దేహములను మించినదే పరిపూర్ణము. గురుకృపచే పరిపూర్ణము నెరిగి యెరుకను బారదోలిన యెడల, లేని యెరుక లేకుండబోవును. పిదప యెరుగు వారెవ్వరును యుండరు. ఇంతే చాలును.

Dr DayanandaSwamy ebooks



విశే:—మొదటి మూడు దేహములు=స్థూలదేహము, సూక్ష్మదేహము. కారణ దేహము. నాలవది మహా కారణ దేహము:

క॥ నానావిధావయవములు । నానావిధనామరూపనటనలు మాయల్ । నానావిధముల యూహలు । నేనను యెరుకందు నిన్ని ॥ నిబిడమైయుండు । బయలునుగని తా, నిలువ లేకుండు॥ నేను మేనులురెండు । లేనేలేకుండిన । మేనులేదది లేక, నే నిలిచేదెట్లన్న ॥ నిబిడమైయుండు ॥　　181

తా॥ శిష్యా! నేనను యహంకారరూపమైన యెరుకయందు నానావిధములైన, అవయవములు, నామరూపక్రియలు, మాయలు, వివిధములైన యూహాపోహలు నిండియుండును. ఈ యెరుక పరిపూర్ణమును గాంచినచో నిలువదు. యెరుక లేనిచో దేహముండదు. దేహ మెప్పుడుండదో, అప్పుడే నేననునది నశించును. అనగా శరీరాత్మలు కూడ నశించునని తెలియుము.

క॥ జగముపలన సంకల్పము । జగమా సంకల్పముననుజనియించును, వే । రగుపడదు జన్మమందిర । మగుపడదెడబాసినిల్వ ॥ వారెండెన్నటికి । బయలునుగనిన, నివిరెండెన్నటికీ ॥ ఇఁగదెఁచబోకుము । యివిబుట్టుటుళ్ళక్కి । మృగతృష్ట యగుపడ, మిథ్యంచెఱిగిన మాడ్కి, నారెండెన్నటికి ॥　　182

తా॥ శిష్యా! జగమువల్ల సంకల్పము. సంకల్పమువల్ల జగములు బుట్టుచుండును. యీ రెండుబుట్టుటకు కారణ మింకొకటి కనబడదు. ఈ రెండు నొకదాని కొకటి కారణములుగా నున్నవి. యివి నొకదాని నొకటి విడచి నుండజాలవు. ఈరెండును పరిపూర్ణమును జూచి నశించును. యీరెండును మరల బుట్టుట అబద్ధము. యెండమావుల యందలి నీరెట్లు అబద్ధమని నీ వెరిఁగితివో; అటులే జగత్తును సంకల్పమును అబద్ధమని నీ వెరుంగుము.

Dr DayanandaSwamy ebooks



క॥ పరిపూర్ణ మనెడు పలుకే। యెరుకను బల్వాక్షరముల
నెచ్చట గనినన్ । దిరమైయున్నది గనుఁగొని । నెరుకను నల్వా
క్షరముల ॥ నిఁక గట్టిపెట్టు । ఎవరికిఁ దెలియు, దిదిమూలగుట్టు॥
గురుమూర్తి కరుణచే, నెఱిఁగి తెలిసితివేని । బరిపూర్ణబోధను,
పరులు దెలిసినబోధ ॥ నిఁక గట్టిపెట్టు ॥ 183

తా॥ శిష్యా! పరిపూర్ణము పరిపూర్ణమని యెరుక యనెడు న (బ) ల్వాక్ష
రములచేత యెచ్చట జూచిన వ్రాసిపెట్టి యున్నది. కాని, యా యెరుకను
అక్షరములను గట్టిపెట్టుము. నీవీ రహస్యము గురునిచే నెరిగి పరిపూర్ణబోధను
గ్రహించి యితరులు నీకు జెప్పిన బోధను విడచి పెట్టుము.

క॥ చూపించి చూపరానిది । చూపించితి దానినుండ
జూచితివిగదా । చూపించగఁ జూచెనిది దీ । న్నేప్రొద్దుఁ దలంచ
బోకు ॥ యిదె గురుబోధ, నిన్నంటదు, యితరపుబోధ । నాపాప
నాకూన, నాచిన్ని నాయన । నాపెన్నిధానమ, నారత్నములకొండ॥
యిదె గురుబోధ ॥ 184

తా॥ శిష్యా! చూపి చూపరానటువంటి పరిపూర్ణమును నీకు జూపించి
తిని. నీవు చూచితివిగదా! నేను చూపించుటయు, నీవు జూచుటయు
యను యీ యెఱుకను నీ వే ప్రొద్దును దలచకుండుము. ఇదియే అచల
బోధ దీనిని గ్రహించితివేని యితరబోధ నిన్నేమాత్రము అంటదు.

క॥ నామము రూపము నటన । స్తోమము బయులందు
లేదు చూడుమునీవా । నామము రూపము నటన । స్తోమము
యెఱుకందు గలవు ॥ చూడుమీ నిజము । బయలెఱుకల, జూచి
చూడకుము । వేమారు నేనెంత, వినఁ జెప్పినగాని । ఈమార్గమే
తప్పు యిక లేదు రెండవది ॥ చూడుమీ ॥ 185

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా ! నామము, రూపము, క్రియ యనెడి వృత్తి సమూహము పరిపూర్ణమునందు లేదు. నీవు దానిని జూడుము. యీ నామ రూప క్రియల నెడు వృత్తిత్రయము యెరుకయందు గలదు. బాగుగా చూచి తెలిసికొనుము. అట్లు పరిపూర్ణ మెరుకలను గనుగొని యెరుకను విడచిపెట్టుము. నీకు నేనెన్ని విధంబుల బోధించినను యీమార్గముదప్ప వేరేమార్గము లేదు.

క॥ గురుఁడు గురుబోధ శిష్యుని । కెఱిఁగించెడు వేళశిష్యు డెఱిఁగెడు వేళఁ । యిరువురు వైశ్వానరక । ర్పూరములవలె వెలిగియవల ॥ పాడచూపరోయి । అట్లనె నీవి. క్కడ దెలియు మోయి । పరిపూర్ణమెరుకల నెఱిఁగియామీదట । ఎఱుకను విడచుటే, గురుబోధంచెఱగుము ॥ పాడచూపరోయి ॥ 186

తా॥ శిష్యా ! గురుడు శిష్యున కుపదేశంచెడు వేళయందును. శిష్యుడా గురుడుబోధించు బోధను వినెడువేళను. గురు శిష్యు లిరువురు. కర్పూర శిఖి వలె బ్రకాశించి, అటుపిమ్మట నగుపడరు. అటులే పరిపూర్ణమును. యెఱు కను యెరుకనే దెలిసికొని, ఆ పైన యెరుకను వదలుటయే గురు బోధయని తెలిసికొనుము.

క॥ సతికౌగిట తత్పతి, త । త్పతికౌగిట సతియుఁజేరి పవ ళించికడుఁ । రతిఁజెంది మేలుకొని, సు ॥ స్థితులయి, యొకరొ కరు పడిన॥ చేష్టదెలుపుదురా । సిగ్గెడలియా, చేష్టదెల్పుదురా । ప్రతిలేని గురుబోధ స్థితిజెందియుట్టె, సం । తతి తిరిగి తేనెరుక, గతి యిట్టిదనరాని ॥ చేష్టదెల్పుదురా ॥ 187

తా॥ శిష్యా ! భర్త కౌగిట భార్య, భార్య కౌగిట భర్తయు పడుకొని రతిక్రీడలందేలి నిదురించి ఉదయమున మెలకువ జెందిన పిమ్మట, రాత్రి తాము మదనోద్రేకంబున జేసిన క్రీడా వినోదములను వారొకరికొకరు జెప్పకుం దురా ? అటులే గురు శిష్యులు. ప్రతిలేని యీ పరిపూర్ణ బోధను దెలిసి

Dr DayanandaSwamy ebooks



కొని, యెరుక లేదని యెరిగిన పిమ్మట యెరుక వలన తాము పడిన పాట్లను చెప్పుకొందురా ? చెప్పుకొనరు.

**క॥ రానిది పోనిది బయలని । లేనిది యెరుకనుచుఁనీకు లెన్నగదృఢమౌ । దానుక నీవీ మంత్రము । మానక జపియించు చుండు ॥ మాబుద్ధిశాలీ । లేనిదెలేదు, మరువకీజోలీ ॥ లేనిదెలే దని పూనినిశ్చయమైతె । తానొక్కటుండును గాని యట్టనువిను॥ మాబుద్ధిశాలి॥ 188**

తా॥ శిష్యా ! రాకపోకలు లేనిది పరిపూర్ణమనియు, లేనిది యెరుక యనియు నీకు దృఢమగు వరకు నీవీ మంత్రమును యెడ తెగక జపించు చుండుము. ఓ బుద్ధిశాలీ లేనెరుక గావున, యీ మాటను నీవు మరువకుము. లేనెరుక లేదని దృఢ నిశ్చయమైన యెడల, వున్నదొక్కటే పరిపూర్ణమని దెలియుము.

**క॥ ఉన్నది పరిపూర్ణము, లే । దెన్నటికిని యెరుక యనుచు నిదిదృఢమౌదా । కెన్నుము నేబోధించిన । తిన్నని యీబోధ శిష్య ॥ తిలక మరువకుమీ । సుజనులమ్రోల పలుక వెరువకుమీ ॥ నిన్ను కుమతులువచ్చి । నీలోతడిగినవారి కెన్ని విధములనునీ । వెఱిగింపకిది శిష్య ॥ తిలక మరువకుమీ ॥ 189**

తా॥ శిష్యా ! ఉన్న దొక్కటేపరిపూర్ణము. యెన్నటికిని యెరుక లేనే లేదని నీకు దృఢమగునంత వఱకు. ఈ పరిపూర్ణ బోధను ధ్యానింపుము. నేను బోధించినదానిని మరువకుము. సజ్జనుల కెరిగించుటలో నీవు భయపడకుము. దుర్మార్గుల కి రహస్యమును దెల్పకుము.

**క॥ పరిపూర్ణ మెరుకలను నే । నెఱిగించితి నీవురెంటి నెఱిగితివిగదా । యెరుకను ౹పరుదక్షిణగా । మరివేగిర మిమ్ము**

Dr DayanandaSwamy ebooks



వట్టి ॥ మాటలేమిటికి । ఎరుకతోనింక కూటమేమిటికి । పరులు నేననియేటి భావమభావమై । నిరతము నొకరీతి నిలిచి యుండుము, వట్టి ॥ మాటలేమిటికి ॥ 190

తా॥ శిష్యా ! నీకు పరిపూర్ణమున్ను, ఎఱుకను, ఈ రెంటి నెరిగించి తినిగదా ! నీవీ రెంటి వివరమును చక్కగా దెలసికొంటివిగదా ! కాబట్టి ఎఱుకను నాకు గురుదక్షిణగా నొసంగుము. యిక వ్యర్థమైనమాటలెందులకు ? ఎఱుకతో నింక నీకు సాంగత్యమెందుకు ? వారు, వీరు, నీవు, నేనను భేదబుద్ధి మాని, ఎల్లప్పుడొకే విధముగా నుండుము.

క॥ పరిపూర్ణ మెరుకలివి యని । గురువరుఁ డెఱిఁగించి యెరుక కూటమిమాన్పఁగ । గురునకు గురువే సరియౌ । మఱి శిష్యున కంతనోట ॥ మాటవెళ్ళునా । పోయినయెఱుక మళ్ళి మళ్ళునా ॥ గురుశిష్యులనియెడు । గురుతున్న దెరుగక నిరతము నొకరీతి । నిలుచున్న బయలందు ॥ మాటవెళ్ళునా ॥ 191

తా॥ శిష్యా ! ఇది పరిపూర్ణము, ఇది యెరుకయని గురువర్యుండు శిష్యున కెరిగించె. యెరుక యొక్క సాంగత్యమును మాన్పుటకు, నసమానుండగు గురుడే సమర్థుండు. అటుపైన శిష్యుని నోటనుండి అనుమానాస్పదమైన మాట వెడలునా ? పోయిన యెఱుక మరలి తిరిగి వచ్చునా ? స్థిరముగా నుండెడి పరిపూర్ణమందు గురు శిష్య లొకేరీతి నుండువార లగుటచే, భేద భావము వదలి యున్నందున మాటవెలికిరాదు. అదియునుంగాక.

క॥ స్థిరమగు, పరిపూర్ణము న । స్థిరమగు నీయెఱుక యెఱుక దెలియుజగములం । దెఱిఁగిన దెరుకే, గద, సద్గురు కృపచే నెఱుకపోవ ॥ గురుశిష్యులేరి । నోరెత్తకమరి వినరోరి ॥ గురునిపాదములాన । గురుతులేనటువంటి। పరిపూర్ణమొకటుండు। పలుకరానట్లుండు ॥ గురుశిష్యులేరి ॥ 192

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా ! స్థిరముగా నుండునది పరిపూర్ణము అస్థిరముగా నుండునది యెరుక. ఈ యెరుకనే సమస్త జగత్తును యెరుగఁచుండును. ఈ యెరుక సద్గురు కృపచే దొలగిపోయిన పిమ్మట గురు శిష్యులను భేదముండదు. నీవీ సంగతి మారుమాటాడక వినుము. గురుపాదములసాక్షిగా, గురుతు లేనటువంటి, నామరూపక్రియ రహితమైన పరిపూర్ణ మొక్కటే వర్ణనాతీతమై యుండును.

క॥ గురుడచలము నెఱుకనుఁ దన । కెరిఁగించిన శిష్యుఁ డెరిఁగి యెరుకై యుండఁగా । ఎరుకను నిలుపకు మనినను । యెరుకను విడనాడిశిష్యు ॥ డెట్లుండునంటే । అట్లనెనేని యెట్లుండునంటే ॥ పురుషుండు లేనట్టి । పొలఁతి సౌందర్యము । మరి మరి గలిగుండి । మరిలేనట్లనియుంటి । నెట్లుండునంటే ॥ 193

తా॥ శిష్యా ! గురు డచల పరిపూర్ణమును, యెరుకను యెరిగించినప్పటికిని, శిష్యు డెరుకై యుండిన జూచి, యెరుకను నిల్పకుమని యాజ్ఞాపించెను. ఎఱుకను విడచిన శిష్యుండెట్లుండు ననగా, పురుషుడు లేని స్త్రీ సౌందర్యవతి యైకూడ, సౌందర్య హీనముగా గానుపించును. అటులే యెరుకను విడచినవాడు కార్యా కార్యాములందాసక్తుడుగాక నుండును.

క॥ ఎరుకను విడనాడిన యా । పురుషుని స్థితి యెట్టిదనిన పొందుగవినుమీ । సరిపడు సరిపడ దనకను । సరిగా వర్తించుచుండు ॥ సమరసబుద్ధిఁగా । కార్యములందు సహజప్రబుద్ధిఁగా ॥ పరిపరివిధముల, పరువులు పెట్టడు । మరివైరాగ్యముచేత మానుకొనియుండు ॥ సమరసబుద్ధిఁగా ॥ 194

తా॥ శిష్యా ! ఎరుకను విడనాడిన పురుషుడు యెట్లుండునన, చెప్పెదను జాగ్రత్తగా వినుము. ఇది సరిపడును. ఇది సరిపడదు అనక, న్యాయ మార్గ

Dr DayanandaSwamy ebooks



మున ప్రవర్తించుచు, సమత్వ బుద్ధితోనుండును. సర్వ కార్యములందు స్వభావ సిద్ధమైన బుద్ధితో మెలంగును. అతడు పరిపరి విధముల యాశించి పరితపించడు. అతనికి కోరికగాని, వైరాగ్యముగాని యుండదు.

క॥ కలమేలుకొన్న పురుషుడు । కలలోపలి బాములెరుఁగ
కలిగుండకయే । తలపోయలేరుగురుకృప । దెలివొందిన వారికింక॥
తిప్పలున్నవా । తెలుపర కొద్ది గొప్పలున్నవా । తలిదండ్రి దొర
తాత, కులదైవమాప్తులు । కలబాంధవులు, దేశికులని నమ్మితె
యింక ॥ తిప్పలున్నవా ॥ 195

తా॥ శిష్యా ! మానవునకు కలలో సంభవించిన కష్టములు మేలుకొనిన పిమ్మట నుండవు. అటులే, గురుకృపచే తెలివొందిన వారికి యెటువంటి కష్టములైనను దలంపులకు రావు, వారికి సంకటము లుండవు. సుఖదుఃఖములు కొద్ది గొప్పలు సమానముగనే దోచును. గురువే తల్లి, దండ్రి, తాత, కుల దైవము. మిత్రుడు, ఆత్మ బంధువుడని యెంచు వారికి యేయొక్క తిప్పలు నుండవు.

క॥ ఈరీతిస్థితిగలిగిన । నేరుపుశాలితరజనుల నిందాస్తు
తులఁ । దారెరిగి జేయఁడెన్నడు । వారలు మరిచేసిరేరి ॥ వల
దని యనఁడు । చెవియొగ్గి, గావలెనని వినఁడు । వారు మీవారు,
మా వారు వీరనుకొంచు ! సారెకు వీరితో, పోరాడేవారిని । వలదని
యనడు ॥ 196

తా॥ శిష్యా ! పైన జెప్పిన ప్రకారంగ నున్న నేర్పరి, ఇతరులను దూషించడు, భూషించడు, ఇతరులు తన్ను దూషించినను భూషించినను వలదని యనడు. వారిదూషణ భూషణలు చెవియొగ్గి వినడు. వారు మీవారు వీరు మావారు అని వాదించడు. అట్లు వాదించెడు వారిని వలదనడు.

Dr DayanandaSwamy ebooks



క॥ ధ్వని మొదలగు తన్మాత్రలు గనుఁగొనఁగాలేశమైనఁ
గాన్పించని, చో । టును బట్టబయలుగాఁగని । ధ్వనిముఖ తన్మా
త్రలున్న ॥ దాని నెరుఁగకను, గనియీరెంట్లో దేని నెరుగకను ॥
ఉనికి గలిగిన యట్టి, ఘనుని సన్నుతిఁజేయ। జనులకు శక్యమం,
చనరాదు, వినరాదు ॥ దానినెరుకగను ॥ 197

తా॥ శిష్యా ! శబ్దాది పంచతన్మాత్రలు కొంచమైనలేనిదే పరిపూర్ణమని
నమ్మి, పంచ తన్మాత్రలు గల్లదే యెరుకయని దెలసి, యెరుకను నమ్మక, ఈ
రెంటిలో దేనిని యెరుగనట్టి ఉనికిగల మహాత్ముని వర్ణించుట కెవ్వరి శక్యము
గాదు.

విశే:—పంచ తన్మాత్రలు = శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు
(వీటినే విషయ పంచక మనియెదరు)

క॥ నామదిలెస్సగ వినుమీ । సామాన్యంబనుచుఁ జూడఁ
జనదీబోధ౯ । ప్రేమాతి శయమునం గని । వేమారిది గురుని
నోట ॥ వినవలెసుమ్మీ । నిత్యము చదువుకొనవలె నమ్మీ ॥ నామ
రూపక్రియ, నటనలు గలిగిన । దేవస్తువో దాని, నెటు నిల్వ
నీయకు ॥ వినవలెసుమ్మీ ॥ 198

తా॥ శిష్యా ! ఈబోధ సామాన్య మైనది గాదు, దీని ననేక సారులు గురు
ముఖంగా వినవలయును. ప్రతిదినము యీ అచలబోధ గ్రంథములే జదువ
వలయును. నామ రూపక్రియా సహితమైన యెరుకను విడువ వలయునని
నాయభిప్రాయము.

క॥ నే మొదట నిన్ను గఁనుగొని । యేముక్కలు నీదు
చెవిలో । నిమిడించితినో । యాముక్కల మూడింటిని । నేమా
త్రము మరువకుండ ॥ నీబోధసిస్తి । అందుకె యింత, గాబోధ

Dr DayanandaSwamy ebooks



జేస్తి ప్రేమతోఁ జదువుము, దేమర కెప్పుడు । కామితార్థము,
లిచ్చు, నీమముతోడుత ॥ నీబోధనిస్తి ॥ 199

తా॥ శిష్యా! మొదట నిన్ను జూచినప్పుడే, యే మాటలు నీమదికి నాటే
ట్టుగా నీ చెవిలో జెప్పితినో, ఆమూడు ముక్కలను మరువకుండుటకై
నేనింతవరకు నీకుబోధించితిని, నీవు దీనిని మరువకుంటివేని నీకోరికలు
నెరవేరును.

విశే:—మూడు ముక్కలు = పరిపూర్ణమే నిత్యముయెరుక ఆ నిత్యము.
ఎరుకను విడువుము.

క॥ అన్నము దిన్నను నాకలి । తిన్నగనీరంబుఁద్రావ
దృష్ణయు రోగం । బెన్నగ నౌషధ సేవను । జన్నక్రియ యెరుక
నిల్వ ॥ జాలదోయన్నా । యీబోధ నీ, చెవులతోవిన్నా॥ కన్నుల
తోఁజూచి, కడముట్టఁజదివిన । నిన్నంటి నీయెదుట, నిలుచుండి
కనుగొన ॥ జాలదోయన్నా ॥ 200

తా॥ శిష్యా! అన్నముభుజించినచో నాకలియు, నీరుద్రావినచో దాహ
మును, ఔషధము సేవించిన రోగమును యెట్లు బోవునో, అట్లే యీ పరిపూర్ణ
బోధవిన్నచో యెరుక బోవును. నీవీ గ్రంథమును పూర్తిగా జదివినచో యెరుక
నీదగ్గర జేరజాలదు.

క॥ జనన మరణ ప్రవాహము । లణచును నీబోధబట్టు
దని, సాధువులి । చ్చిన నొల్లకుండువారలు । జనునపుఁడా బోధ
మీద ॥ జనియించుప్రేమ । వెదకెదరిట్టి జనచేష్టలేమ । యని
తోచినీకునునే వినఁజెప్ప వలసెనీ । వును నీబోధనువల్ల, ననఘ
దొరకదుమళ్ళి ॥ జనియించుప్రేమ ॥ 201

Dr DayanandaSwamy ebooks



తా॥ జనన మరణ ప్రవాహము నణచునట్టి యీ బోధను పట్టుమని మహాత్ములుపదేశ మొనర్చిన కొందరు మానవులు గ్రహించరు. ఆమహాత్ములు వెళ్ళిపోయిన పిమ్మట పశ్చాత్తాపము జెందుదురు. అందువలన ప్రయోజన మేమి ? నీవీ బోధను వలదని నిరాకరింపకుము. తరువాత గావలయు నన్నచో దొరకదు.

క॥ మఱపుకు దన్మాత్రలుగల । వెరుకకు దన్మాత్రలున్న వీరెండొకటే । పరిపూర్ణమునకు లేవవి । పరిపూర్ణంబెరుకగాదు ॥ పరికించవోయి । వెదకినదీని, సాటిలేదోయి । పరిపూర్ణమునెరుక, పరిశోధించీ గ్రంథము । రచించి నీకిస్తిమరువక చదువెరుక । మరుపుగాదోయి ॥ 202

తా॥ శిష్యా ! మరుపునకు శబ్దాది పంచ తన్మాత్రలు గలవు. అటులే యెరుకకు కూడ గలవు కావున, ఈ రెండునొకటే యని దెలియుము. పరిపూర్ణమునకు పంచతన్మాత్రలు లేవు. కావున పరిపూర్ణము నెరుకయు నొకటి గాదు. నీవెన్ని విధముల వెదకినను పరిపూర్ణమునకు సాటి యింకొకటి లేదు. నేను పరిపూర్ణమును యెరుకను శోధించి యీ గ్రంథమును వ్రాసి నీ కొసంగితిని. దీనిని నీవు శ్రద్ధతో జదువుము.

క॥ అందముగా సద్గ్రంథము । చందమువినుపింతుదాని జదివిన వినినన్ । ముందుగ బయలెరుకై, యే । సందున లేనెరుకలేక ॥ జనవలెనుమ్మి । మరియిదెవిని, చదువుమునమ్మి ॥ యెందుకు నీకింక; యితరశాస్త్రముల ॥ జో, లందు గుర్తెరిఁగి పోదదిగాన దీయెరుక ॥ జనవలెనుమ్మీ ॥ 203

తా॥ శిష్యా ! అందమైన సద్గ్రంథమువలె దీనిని రచించితిని. యిది నీకు వినిపింతును. ఇందువల్ల, ముందుగనే పరిపూర్ణము గోచరించి, ఆపైన యెక్కడను లేనటువంటి యెరుక పారిపోవలయును సుమా! నీవీ గ్రంథ

Dr DayanandaSwamy ebooks


షును నమ్మి చదువుము. లేక వినుము. నీకితర శాస్త్రములతో బనిలేదు. వాటిని నమ్మియుండిన నీయెటక పోజాలదు. కావున యీ గ్రంథమునే జదువుము.

క॥ చక్కెర మెక్కని రోగులు । చక్కెరమాధుర్యమెరుఁగ జాల, రటువలెఁ । మక్కువతో, విని చదువక । జక్కఁగ గ్రంథార్థ మెఱుఁగ ॥ జాలరాజనులు, కావున నీవు, చాలించి పనులు ॥ చొక్కమీ గ్రంథము । చూడుము కొనవెళ్ల । నిక్కడితో జన్మ, మెత్తవు నిదితెలియ ॥ జాలరా జనులు ॥ 204

తా॥ శిష్యా! చక్కెరను చవిజూడనట్టి రోగులకు చక్కెరయొక్క మాధుర్యము దెలియదు. అట్లే యీగ్రంథము చక్కగా వినని యెడల, ఈ గ్రంథ రహస్యము లోకులెరుగజాలరు. కావున నీవు యితర పనులన్నియు వదలి శ్రద్ధగా నీగ్రంథము మొదటినుండి తుదవరకు చదువుము. అట్లు చదివినచో నీకీ జన్మతోనే సరిపోవును. నీవింక మరల జన్మింపవు.

క॥ గూఢార్థ మెఱిఁగి సతఁతా । రూఢుండై నతఁడు గ్రంథరుచిఁ గొనరు భువిఁ । గాఢతరాజ్ఞానంబున। మూఢుండై యున్నవాఁడు ॥ మొదటనే వినఁడు । సుజనులజాడ, ముదమొప్పగనఁడు ॥ వాడుఁ వీడనరాని, వాఁడే గ్రంథమువిను। వాఁడు నిశ్చయమిట్టి, వార్త తెఱుఁగనివాఁడు॥ మొదటనే వినఁడు॥ 205

తా॥ శిష్యా! గూఢార్థ మెరిగినవాడును, ఆరూఢుడును యీ గ్రంథములోని సారము నెరుంగరు. అజ్ఞానియగు మూఢుడు యీ గ్రంథమును మొదటనే వినడు. మహాత్ముల గౌరవింపడు. వాడువీడు అని భేదములేకనుండు పరిపూర్ణుడే. యీ గ్రంథమును జదువుటకు, వినుటకు నధికారి యనంబడును.

Dr DayanandaSwamy ebooks



విశే: ముగూఢార్థమెరిగిన వాడు = సాంఖ్యతారకముల్ నెఱిగినవాడు, ఆరూఢుడు = అమనస్కుడు.

క॥ తాఁబేటి తలపుచేతను । తాబేల్పిల్లల క్షుధార్తి దల
గుట దెలియఁగ । తాబేటి గర్భమందున । తాబేలైపుట్టకున్న ॥
దరమె యితరులకు । సద్గురుబోధ ట్లరయనితరులకు ॥ నేబాధ
లెఱుఁగని, యీబోధగలవారి । చే బోధపడయక చేకొనఁ దల
చితె ॥ తరమె యితరులకు ॥ 206

తా॥ శిష్యా ! తాబేలు తన తలంపు చేతనే తనపిల్లలయొక్క క్షుద్బాధను దీర్చునట్లు, ఇతర జంతువులు జేయజాలవు. తాబేలు సంగతి తాబేలే యెరుగును. అటువలె, పరిపూర్ణ బోధను జెందగోరినవారు పరిపూర్ణుల జేరి తెలిసికోవలయునేగాని, యితర గురువుల జేరిన పరిపూర్ణ బోధ వడయ జాలరు. తిరుగా వారికి కష్టములే ప్రాప్తించును గాని; పరిపూర్ణులు గానేరరు.

క॥ ఈఁత యపేక్షను మనుజులు । నూతిదరింజేరి నిలిచి
నోట గొణగినఁగ । యీఁతేల వచ్చువారికిఁ । జేతులతో నీళ్ళ
మీఁద ॥ జేరి యీదకను । మునునేర్చిన, వారీదించకను ॥యీతీ
రుగనె దేశి, కేంద్రుఁడు దెల్పక । చాతుర్యమునబోధ, సాధింప
నయ్యేన ॥ చేరి యీదకను ॥ 207

తా॥ శిష్యా ! ఈతను నేర్చుకో వలయునను కోరిక గల మానవులు, ముందు నీత నేర్చి వారి నాశ్రయించి వారి సహాయంబున నేర్వవలయునే గాని, అట్లుగాక తానే స్వయముగా బావివద్దకు జేరి యెడ్డున నిలువంబడి "నాకు యీతరావలయును" అని నోట గొణిగినంత మాత్రమున యీత వచ్చునా ? రాదు. అటులే, పరిపూర్ణుడగు గురుని జేరక, తన చాతుర్యంబున బోధను సాధించెద నన్న సాధింప నగునా ? కాజాలదు.

Dr DayanandaSwamy ebooks



క॥ ప్రవిమల చిత్తుఁడు శిష్యుఁడు । సవినయమున దేశి
కునకు శరణాగతుఁడై । త్రివిధ ప్రసాదములనుగొని । భవనా
శస్థితులులేని ॥ పద్ధతివినినఁ । తిరిగిరాని, పద్ధతిగనినఁ । భువిలో
వానిసాటి, బోల్పనెవ్వరులేరు । అవిరళ భక్తినీ। వారీతి నుందువీ॥
పద్ధతివినినఁ ॥ 208

తా॥ శిష్యా ! నిర్మల చిత్తుండగు శిష్యుడు, సవినయ పూర్వకముగా సద్గు
రునకు శరణుబొంది, త్రివిధ ప్రసాదములనొంది, సృష్టి స్థితి లయములు
లేనిదియు, తిరిగి జన్మమురాకుండ జేయునది యగు, యీ యచల బోధను
విన్నయెడల, వాని సమానుండెవ్వడీ భూలోకంబున లేడని తెలియుము.

విశే:—త్రివిధ ప్రసాదములు =త్రివిధ దీక్షలు, 1 దృగ్దీక్ష, 2 స్పర్శ
దీక్ష, 3 వాగ్దీక్ష.

క॥ ఉపనయనముగానిదె తా । నుపనయనము మీఁది
చదువు నూహనెరిఁగినఁ । విపరీతమగును దానను । చపలుఁడు
బ్రాహ్మణుఁడుగాఁడు ॥ చర్చించిచూడ । శూద్రుఁడువాఁడు,
చర్చించిచూడ । ఉపమదుచే బోధట్టు, లూహించనియట్టి ॥ కపట
చిత్తుఁడు సాధు । గణముతో సమమౌనె ॥ చర్చించిచూడ ॥ 209

తా॥ శిష్యా ! ఉపనయనము గానిదే, ఉపనయనమైన తర్వాత జదివెడు
చదువును ( వేదాధ్యయనము ) చదువగూడదు. అట్లు చదివిన చపలుడు
బ్రాహ్మణుడు కాడు. అనగా ! అతడు శూద్రుడే యగును. అటులే, గురు
ననుగ్రహము బొందక, అచల బోధను గ్రహించిన కపట చిత్తుడు సాధు
బృందమున చేరజాలడు.

క॥ మంత్రముచే సంతెట్లగు । తంత్రములేకున్నగాదు
తంత్రము చేతఁ । మంత్రములేకను వడిగల ॥ మంత్రము

Dr DayanandaSwamy ebooks



తంత్రములు రెండు । మరిగూడుకొని । కార్యములన్ని, జరి
గింపుపూని । మంత్ర తంత్రములలో, మర్మముగురుండెరుఁగు
మంత్ర తంత్రములలో, మర్మము గురునిచె ॥మఱిగూడుకోని॥

తా॥ శిష్యా ! తంత్రములేకుండ, మంత్రమొకదానిచే సంతానము గానే
రదు. మంత్రము లేకుండ తంత్రము చేతనే తంత్రము లేకుండ మంత్రము
చేతనే, యేకార్యములు నెరవేరవు. ఈ మంత్ర తంత్రములు వేర్వేరుగానే
పనిని చేయజాలవు. సరియైన మంత్రతంత్రములు రెండు నొక్కచోట కూడిన,
సకల కార్యములు చక్కబడును. ఈరెంటియొక్క మర్మమును గురువు
దెలిసికొనును. కావున నీవా గురువును జేరి మంత్ర తంత్ర రహస్యము
యెరుంగుము.

విశే:—"సంతెల్లగు" సంత అనగా అంగడి సాగుట యనికూడ అర్థ
మగును.

క॥ సంకల్పాదిక గుణములు । సంకులమీ యెరుకయందు
సమకూడుండుఁ । సంకల్పాదిక గుణముల । సంకులమని
యెదను జూడ ॥జాడలేదన్నా । యీరెండును, వేరుగావన్నా ।
కొంకక నీరెంటిగూర్చి, గ్రంథముజేస్తి । సంకోచింపక చదువు,
శంకపుట్టదింక ॥జాడలేదన్నా॥ 211

తా॥ శిష్యా ! యెరుకయందు సంకల్పాది గుణసమూహము గూడి
యుండును. ఈ సంకల్పాది గుణ సమూహము మనస్సుచే దెలియబడదు. యీ
రెండును వేరుగాదు. అట్లని యీ రెంటిని యొకటిగా జేర్చి యీగ్రంథమును
వ్రాసితిని. సంకోచపడక నీగ్రంథమును పఠించితివేని సంశయ ముండదు.

క॥ హటమును కుటిలాత్మనిజం । పుటకై భటకోటి కాజ్ఞ
భూపతియిడినఁ । భటులటువలెఁ జేసెడిచోఁ । పటుకుటిలుడు

Dr DayanandaSwamy ebooks



పడినపాట్లు ॥పాటించికనునా । అట్లనెగురుని, నోటదావినినా ।
యిటువంటిబోధను, యెటువంటి నరుఁడైన అటువెన్క తనచేష్ట,
లెటువంటివోదాని ॥ పాటించి కనునా ॥ 212

తా॥ శిష్యా! ప్రభువు కోపముతో నొకకుటిలాత్ముని జంపుటకై భటుల కాజ్ఞాపింప, భటులా దుర్మార్గుని గొనిపోవు నపుడు ఆ దుర్మార్గుడు తానదివర కొనర్చిన దుష్కృతములను దలపోసి విచార పడునా? విచార పడడు. అట్లే గురుకృపవల్ల యీ పరిపూర్ణబోధ దెలిసికొని, యెరుకను విడచిన మానవుడు అంతకు ముందు తాను యెరుకయందొనర్చిన దుష్కృతములకై విచారపడడు.

క॥ సకల జనుల సమ్మతిగా । నొకడైనను నడువజాల
డుర్వీస్థలిపై । మకరాంక జనని జనకా । ద్యకలంకులలోన, నీ॥
వననేమి గణనా । బోధందితర, జనులేమి గణనా॥ వికల మాన
సుడవై, వెతజెందబోకునీ । వకుటిలభక్తుఁడవని దెలిపితిబోధ ॥
ననచేమిగణనా॥ 213

తా॥ శిష్యా! మానవులలో నొక్కడైనను సర్వజన సమ్మతముగా నడువ నేరడు. సాక్షాత్ విష్ణుమూర్తి మొదలగు దేవతలకు గూడ సర్వాను మతముగా నడచుకొనుట సాధ్యముకాదు అటువంటప్పుడు, నీబోటి మానవుడొక లెక్కయగునా? అటులే, ఇతర మతస్థు లొప్పుకొను నటుల నడచుకొనుట నీకు సాధ్యము గానేరదు. కావున వారి మాటలను నీవు వినకుము. నీవు కుటిలము లేని భక్తుండ వగుటచే నీకీ బోధను జేసితిని.

క॥ బలధన విద్యలు దుష్టుల । కిలగలిగిన నొరులనొంతు
రెంతయు నిర్దక్ష । బలధనవిద్యలుశిష్టుల । కిలగలిగిన నొరుల
బ్రోతు ॥ రెంతో మోదమునా । నీవీరెంటి, నెరిఁగి మోదమునా ।
కలలోననైన దుష్టులచెంతఁ జేరకు । మెలమిశిష్టుల చెంత, కల
నైన వదలకు ॥ మెంతో మోదమునా ॥ 214

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! యీ ప్రపంచంబున దుర్జనులకు బలము, ధనము, విద్య యీ మూడును గల్లయెడల యితరుల యందు పగ సాధించి వారికి కీడు గల్గ జేయుదురు. సజ్జనులకే యీపై జెప్పబడిన బలధనవిద్య లున్నచో, వారలు ప్రేమ పూర్వకముగా యితరులను కాపాడుదురు. నీవు వారి వారి గుణంబు లరసి స్వప్నమందైనను చెడ్డవారితో సాంగత్యము జేయకుము. మంచివారి స్నేహము స్వప్నమందైనను వదలకుము.

క॥ అందమగు స్వాతివర్షపు । బిందువు లెందెందు బడునొ
పృథివీస్థలి, ద । ద్బిందువు లుపాధివశమునఁ । జెందును తగ
నామరూప ॥ చేష్టాదికమును । అట్లనెనీవు, జెందేవన్నియును ॥
మందితొ జతగూడి, మాట్లాడినంతలో । నందుకే సహవాస, మర
యుము తగువాని ॥చేష్టాదికమును॥ 215

తా॥ శిష్యా! స్వాతి కార్తెలోని వర్షబిందువులు, అనేక చోట్లబడి, యాయా స్థాన గుణవిశేషములచే, అనేక నామ రూపములతో వేర్వేరుగా చేష్టాదికములు జెందును. అట్లేనీవు దుర్జనుల గూడికొనినచో, దుర్గుణములు గలవాడవగుదువు. సజ్జనుల గూడి కొనినచో, సద్గుణములు గలవాడ వదుగువు.

విశే:—స్వాతి కార్తెయందు గురిసిన వాన చినుకును, శుక్తియందు బడినచో. ముత్యములగును. భూమియందు బడినచో సస్యములై ఫలించును. అగ్నియందుబడిన నశించును.

క॥ జారులకు లోకులందరు । జారులవలె దోచబడుట
సహజగుణంబౌ । చోరులకు సకల జనములు । చోరకులని
మదికిదోచు ॥ చునికి సహజముగా । నట్లనెదు, ష్టాత్ముకిని సహ
జముగా ॥ సారాములేని సం, సారాబ్ధి దాటించు । వారిని తమ
వంటి వారిని గనుటిట్లు ॥ యునికి సహజముగా ॥ 216

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా ! జారులకు మానవులందరు జారులవలెనే దోచెదరు. చోరులకు జోరులవలెనే తోచెదరు. యివి వారి వారి సహజ గుణములు. అటులే దుర్మార్గుడైన వాడు, నిస్సారమగు సంసార సాగరము తరింప జేసెటి సద్గురుని సైతము దుర్మార్గునిగానే భావించును.

క॥ బయలెరుకలు శిష్యునకుఁ । దయతో గురుఁడెరుఁగఁ జేసి తవారుతను. సం । దియ మేమిలేక యెరుకను । నయమున విడిపించు గురుఁడు ॥ నయశాలిగాదా । నీమదికిది, నాటెనా లేదా ॥ భయభక్తి గురు సార్వ, భౌముని సేవ । నిశ్చయముగ జేసితె, జయమందెదవు, గురుఁడు ॥ నయశాలి గాదా ॥ 217

తా॥ శిష్యా ! గురువర్యుండు శిష్యునకు పరిపూర్ణమును ఎరుకను దెలియజేసి, తర్వాత సంశయమేమి లేకుండ యెఱుకను విడిపింప జేసిన యెడల, నాగురుండు మంచివాడుగదా ! యీ నే జెప్పినదంతయు నీమదికి నాటుకొనెనా లేదా ? నీవు భయ భక్తులతో గురుసార్వభౌముని సేవజేసినచో జయము గల్గును.

క॥ పదిరెండక్షరములు గల । సదమల మంత్రార్థమెఱిఁగి సద్గురు కృపచే । బదియారక్షరములు గల । యదియెట్టిదొ తెలిసె నేని ॥ యతడె సద్గురుఁడు । ఈరెండెఱిఁగి, నతఁడె ధీవరుఁడు । మొదటిది పరిపూర్ణమునుదెల్పు నెఱుకను । దదనంతరప్పుబో, ధనుజేయునీవు దెలియు ॥ మతడె సద్గురుఁడు ॥ 218

తా॥ శిష్యా ! సద్గురు కృపవల్ల మొదట ద్వాదశాక్షరీ మంత్రము నెరింగి, ఆ పైన షోడశాక్షరి మంత్రమెట్టిదో యది దెలిసికొనె నేని అతడు సద్గురు సమానుడు. యీరెండు మంత్రముల భావమును దెలసినవాడే మహాత్ముడు, అందు మొదటి ద్వాదశాక్షరీ మంత్రము. పరిపూర్ణమును దెలుపును. రెండవది యగు షోడశాక్షరి లేని యెరుకను దెల్పును.

Dr DayanandaSwamy ebooks



విశే:—ద్వాదశాక్షరి "అయం వ్యర్థం బాహ్యః కోపీన భవతి" 2 షోడశాక్షరి "మూలాభావ మిదజ్ఞాత శరీరం నాస్తికేవలమ్"

కII ఆమంత్రయుగము దెల్పెద । నేమముతోఁ దలఁచుముత్త దీబట్టబయల్ । ఏమీలేదని బలికిన II నీమంత్రము తత్వమూల II మింకొకటి వినుము । ఎప్పుడునోట నిదిమరువకనుము । ఈ మూలములేని గుర్తెరిగే శరీరము । యేమిలేదనియంటె, నిది షోడశాక్షరి II యింకొకటి వినుము II 219

తాII శిష్యా! నీకారెండు మంత్రములను దెల్పెదను విని నేమముతో ధ్యానింపుము. "ఉత్తదే బట్ట బయలేమియు లేదు" అనగా సర్వము పరిపూర్ణము. దీనిని మించిన దింకొకటిలేదు. యిది ద్వాదశాక్షరీ మంత్రము "మూలం లేని ఈగుర్తెరిగె శరీరం యేమీలేదు" అనగా ఈగుర్తెరిగే శరీరమునకు మూలము లేదని తెలియవలెను. ఇదే షోడశాక్షరీ మంత్రము, ఈ రెండు మంత్రములను నీవెప్పుడు మరువకుము.

విశే:—పైపద్యములలో జెప్పినమంత్రములే ఇందు తెలుగులో జెప్పబడినవి.

కII తొలిమంత్ర పద్ధతెక్కడ । గలదోయని వెదుకనేల కలదంతట, నా । వలమంత్ర పద్ధతెక్కడ । గలదోయని చూడనేలII కాదా చూచేదీ । వినేది, యనేది, తినేది II ఆల తొలుతదానిని, నవలోకనముచేసి । కలకాల మెరుకను గలదాని విడుమెరుక II కాదాచూచేది II 220

తాII శిష్యా! మొదటి మంత్రమందు జెప్పబడిన పద్ధతి యెక్కడ గలదని వెదక బోకుము! అదే పరిపూర్ణము అంతట నిండియున్నది. ఇకరెండవ మంత్రమందు జెప్పబడిన పద్ధతి యెక్కడ గలవని వెదక బోకుము. అదే

Dr DayanandaSwamy ebooks



యెరుక, చూచేది, వినేది, అనేది, తినేది. అని తెలియుము. ఆ మొదటిదానిని యవలోకనము జేసి, యెరుకను యెల్లప్పుడు విడచిపెట్టుము.

క॥ ఇదితప్ప నేమిలేదని । మొదటిది మొఱపెట్టుచుండు ముదమున వినుమీ । యిదియేమి లేదుపొమ్మని । వదలక రెండవది లెస్స ॥ వదరుచుండునురా । బయలెరుకలు యిది నిశ్చయమురా ॥ అదిగాన నీరెంటి, నరసి నీవిప్పుడు । విదితముగ నెరుకను విడుర మంత్రమిట్లు ॥ వదరుచుండునురా ॥ 221

తా॥ శిష్యా! నీవు సంతోషముతో వినుము. మొదటిమంత్రమైన ద్వాదశాక్షరి పరిపూర్ణముదప్ప నింకేమిలేదని మొఱబెట్టు చుండును. రెండవదైన షోడశాక్షరి యెఱుక యేమిలేదని నొక్కి చెప్పుచుండును. కావున యీరెంటిని నీవు దెలిసికొని పరిశీలనము జేసి యెరుకను విడిచిపెట్టుము.

క॥ పరిపూర్ణ మిదిగొ యిదిగో । యెరుకతోఁ జూపించి, లేని యెరుకను లేదం । చెఱిగించిన గురుడేసరి । యెరుకను నిర్పేటి గురు ॥ డెందుకోయన్నా । తద్బోధనీ, కెందుకో యన్నా । శరణన్న వారి మస్తకమందుఁ జెయివెట్టి । తిరముగ నెరుకను, దీసివేయని వాఁ ॥ డెందుకోయన్నా ॥ 222

తా॥ శిష్యా! ఎఱుకవల్ల పరిపూర్ణ మిదుగోయని జూపించి, లేనెరుకను లేదని జెప్పువాడే గురుడు. ఎరుకను విడిపింప లేనివాడు గురుడు కాడు. అతని బోధ నీకు పనికిరాదు. శరణు జొచ్చినవాని శిరమందు తన హస్త పద్మంబునిడి యెరుకను దీసివేయని గురువుతో నీకు పనిలేదు.

క॥ పరిపూర్ణబోధ నెరుఁగని । గురుశిష్యులు బోధకొఱకుఁ గోరఁ బనివడుఁ । గురువర్యుఁ డొకని మరలను । హరువరమునఁ బుట్టినట్టి ॥ యాశిఖండికిని । సతియైనట్టి, యబల తండ్రికినీ ॥

Dr DayanandaSwamy ebooks



**పరుల నిర్ధరిని(దే, వలయుఁయల్లుడు మేము । వరియింతుమని**
**చెప్పి, వరుసపంపిన, యట్టు ॥ లాశిఖండికిని ॥ 223**

తా॥ శిష్యా ! పరిపూర్ణబోధ దెలియజాలని గురుడున్ను ఆ గురువు నాశ్రయించిన శిష్యుడున్ను వీరిరువురు వేరే గురువు నాశ్రయింప వలసి వచ్చును. ఎటులన శిఖండిభార్య తనతండ్రియగు కాశీరాజునకు "తనభర్త దనవలెనే యాడుది కావున, మా యిరువురికి బెండ్లి చేయుటకు యిరువురి పురుషులను తీసికొని రమ్మని వారిని నీయల్లుడును నేనును పెండ్లియాడుదు" మని వృత్తరము వ్రాసెనట. అటులే యాగురు శిష్యుల గతియని తెలిసేది.

విశే:—తొల్లి పాంచాల దేశంబును పరిపాలించు ద్రుపదరాజునకు శంకరుని వరంబున, దుష్టద్యుమ్నుడు, ద్రౌపది, శిఖండియను ముప్పురు బిడ్డలు గలిగిరి. అందు దుష్టద్యుమ్నుడు మగపిల్లవాడు. ద్రౌపది, ఆడబిడ్డ, శిఖండి నపుంసకుడు. ఈ శిఖండి తుదకు పురుషరూపంబు నొందునని శివుడు వరమిచ్చుటచే రాజు ఆతని మగవేషము తొడనేబెంచి పెద్దజేసి యా శిఖండికి కాశీరాజు కూతురును దెచ్చి పెండ్లి గావించెను. అంత కొన్నాండ్లకు కాశీరాజు కూతుర తనభర్త మగవాడు కాడని తెలిసికొని తనతండ్రికిట్లు జాబువ్రాసి పంపెను. "జనకా ! నీవు యీ వృత్తరం చూచినట్టుల యిరువుర పెండ్లికొడుకులను దీసుకరమ్మా. నావంటి ఆడుదైన నీయల్లుడును నేనును చెరియొకరిని పెండ్లి జేసుకొనియెదము" అని వ్రాసి పంపగా, కాశీరాజు మిగుల కోపోద్దీపితుడై ద్రుపద రాజొనర్చిన ద్రోహమునకు పాంచాల దేశముపై దండెత్తిరాగా, అది జూచి శిఖండి భయముచే పారిపోయి యొక యక్షు నారాధించి తన స్త్రీత్వము నతనికిచ్చి యతని పురుషత్వము తాను స్వీకరించి, పురుషాకారముతో నింటికి వచ్చి తన మామను సమ్మతి పరచి భార్యతో సుఖంబున నుండెను, ఈ శిఖండియే భారత యుద్ధమందు భీష్ముని సంహరించినవాడు.

**క॥ పరిపూర్ణ బోధ నెఱి(గిన । గురువరుచే బోధ(గొనిన**
**గొప్పఫలంబౌ । పరిపూర్ణ బోధ నెరుగని । గురువులచే బోధ(**

Dr DayanandaSwamy ebooks



గొనిన ॥ గొప్పఫలమౌనా । అదియెట్లన్న, గూడిరతిలోన.॥ బురు
షునిచే సంతు । పొలఁతి వడయును, బడయ, దరమౌనె వారికిఁ,
దమవంటివారిచే ॥ గొప్పఫలమౌనా ॥ 224

తా॥ శిష్యా! స్త్రీ పురుషునితో భోగించిన సంతానము గలుగును గాని, స్త్రీ తనవంటి స్త్రీతో భోగించిన సంతానము కలుగునా? కలుగదు. అటులే, పరిపూర్ణుడయిన గురువు నాశ్రయించితే పరిపూర్ణబోధ దెలుసును గాని, పరిపూర్ణుడు గానటువంటి గురువు నాశ్రయించిన శిష్యునకు యేమాత్రము లాభము లేదని తెలియుము.

కం॥ దృష్టాంతము దొరికెనునీ, । యోష్ఠము గదలించగానె
నిజకల్లనుచుꣳ । దృష్టాంత మడుగు బోధకు । స్పష్టముగా గప్పు
రము, దీ ॥ పము, జూపవోయి । యీయుక్తి లోపముఁజూప
కోయి ॥ దృష్టినొందెదరిట్లు, తోచి చెప్పితిగాని । శ్రేష్ఠమీ బోధను,
చేకొన్నవారికి ॥ దీపము జూపవోయి ॥ 225

తా॥ శిష్యా! నీ నోటనుండి యీ పరిపూర్ణ బోధ వెలువడగానే, దృష్టాంతము జూపుమని నిన్నెవరైన విచారించినచో, కర్పూర దీపమునందన్నియు నెట్లు స్పష్టముగా గోచరించునో అట్లే యీ పరిపూర్ణబోధయందన్నియు స్పష్టముగా గోచరించును. ఈ శ్రేష్ఠమైన బోధవలన వారెల్లరు తృప్తిబొందెదరు. అని నాకు దోచి నీతో వచించితిని.

క॥ ఎరుక భ్రమగల్గు శిష్యుని । పరితాపము మాన్పునట్టి
పండితుడితఁడే । గురువరుడుఁగాని గురువులై । గురువుల
మని పొట్టకొఱకు ॥ కొణిగేవారెల్ల । వారికిబోధ, దెలియుటకల్ల ॥
పరిపూర్ణమునలేని, యెరుక నేర్పడదెల్పి । యెరుకను, విడిపించ,
నెరుఁగక గురువులై ॥ గొణిగేవారెల్ల ॥ 226

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా, ఎఱుక వలని భ్రాంతి నొందిన శిష్యునియొక్క పరితాపము మాన్పునట్టి గురుని గురువన వలయునేగాని, పొట్టకొరకు గురువులమని వేషభాషలచేత చరించువారిని గురువనగూడదు. అట్టివారి కీ పరిపూర్ణబోధ తెలియదు. పరిపూర్ణమునందు లేని యెఱుకను జూపి యెఱుకను పోగొట్టువాడే గురువనబడును.

క॥ గురుశుశ్రూష యొనర్చుట । నెరిగించెద నెట్టులనిన నేర్పడవినుమీ । నరులిష్టదైవమునకుం। బరిచర్య యొనర్చునట్లు॥ భక్తితోడుతను । గురుమూర్తి కత్యుక్తితోడుతను ॥ సిరత మరమరలేక, నీవు సత్ప్రీతివేని । గురుబోధ మరుగు, సద్గురునిచే దెలిసేవు ॥ భక్తితోడుతను ॥ 227

తా॥ శిష్యా! సద్గురుమూర్తికి శుశ్రూష జేయు విధానమును దెలిపెదను వినుము. నీ కుల దైవమునకు యెట్లు పరిచర్య లొనరింతువో, అట్లే గురువర్యునకు గూడ ధూప, దీప, నైవేద్యము లర్పించి పూజించుము. అట్లునీవు మనః పూర్వకముగా పూజించిన యెడల, యీ పరిపూర్ణబోధవారు నుడివెదరు. అందువల్ల నీవు కడతేరుదువు.

క॥ తనుమన ధనములు గురునకు । వినయంబున ధారవోసి; వేడ్క గురునిచే । ననువైనబోధ నడపిన । ఘనమతిమంతునకు పాటి ॥ గలరా! యీభువిని । లోకులుమ్రొక్క వలదా తాము విని ॥ తాను నితరులని, తాననక, యేమాట । వినక, పరిపూర్ణత, తనకు వారికిసాటి ॥ గలరా యీభువిని ॥ 228

తా॥ శిష్యా! తనువు మనస్సు, ధనము, గురువర్యునకు ధారవోసి గురునిచే అనుకూలమైన బోధవడసిన మానవునితో సమానుండెవ్వడీ భూమియందు లేడు. అట్టి గురుభక్తుని జూచి లోకులెల్లరు గౌరవించి నమస్కారములు జేయ

Dr DayanandaSwamy ebooks



వలయును. నేను, ఇతరులను భేద భావమును లేక యేమాటయును వినక పరిపూర్ణభావము నొందిన వారికెవ్వరును సాటిరారని తెలియువు.

**క॥ జలము నెడబాయనొల్లని । జలచరముల రీవిపూని సచ్ఛిష్యుఁడు, హృ । జ్జలజంబను పీఠముపై । నిలిపితరము మానిగురుని ॥ నే గొల్చుసుమ్మి । తదుక్తులనే దలఁచునమ్మి ॥ కలకాల మీరీతిఁ గడపుచునే ప్రొద్దు । తలితండ్రిదొరదాత దైవ మనుచు గురువు ॥నే గొల్చుసుమ్మి ॥ 229**

తా॥ శిష్యా ! జలచరములు జలమునెడబాసి యుండనటుల, శిష్యుడు తన హృదయకమలమందు గురువును నిల్పికొని సదా గురువునే ధ్యానించు చుండును. గురువాక్యమునే సదా తలపోయు చుండును. యెల్లప్పు డిటులనే ప్రొద్దు గడుపుచు, గురువే తల్లియు, తండ్రియు, ప్రభువు, దాత, దైవమని నమ్మి కొలుచుచుండును.

**క॥ సతి, పొరుగూరికి బోయిన । పతిరాకడగోరినట్లు భావములోనన్ । మతిమంతుఁడు సతతము స । మ్మతితో గురురాక గోరు ॥ సత్యము వినరా । వానితోటి, సాటెవ్వరనరా ॥ హితుని రాకడకు, స్నేహితుఁడు గోరినయట్లు । అతిదరిద్రుఁడు ద్రవ్య తతిని గోరినయట్లు ॥ సత్యము వినరా ॥ 230**

తా॥ శిష్యా ! పతివ్రతయగు స్త్రీ, పొరుగూరి కేగిన తన పతిరాకడ గోరు చుండునటులను, మిత్రుని రాకడను స్నేహితుడు గోరుచుండునటులను, దరిద్రుడగు వాడు ధనమును గోరుచుండు నటులను, సచ్ఛిష్యుడగు వాడు గురు వర్యుని రాకను యెల్లప్పుడు గోరుచుండును, నిజముగా నతని సమానమెవ్వరు లేరని తెలియుము.

**క॥ అతివల రతి చతురత, లా । యతివలచేవారి తండ్రులరయ రనుచు, ద । త్ప్రతులరయనేర్తు, రట్లనె । మతిమం**

Dr DayanandaSwamy ebooks



తుఁడు గురునిబోధ ॥ మానినగాని । తద్బ్రోధతా, మానఁడుపూని॥ అతిదరిద్రునిచే, విద్యార్జనా ఘనుఁడు । చతురత విత్తమార్జించిన తంతులు ॥ మానినగాని ॥ 231

తా॥ శిష్యా ! స్త్రీలయొక్క చాతుర్యములను వారి తల్లిదండ్రు లెంత మాత్రము దెలియజాలరుకాని, వారి పతులుమాత్రము చెప్పకుండగనే గ్రహింతురు. అటులనే బుద్ధిమంతుడైన శిష్యుడు తన గురువు చెప్పకున్నను తానాబోధను గ్రహించును. ధనాపేక్షగల గురుడు తన శిష్యుని వద్దనుండి చాతుర్యముతో ధనము లాగ నట్లు జ్ఞానాపేక్షగల శిష్యుడు గురుని వద్దనుండి తన చాతుర్యముతో బోధను గంహించును.

క॥ పరిపూర్ణ బోధదెల్పెడు । పరియుంతము, సేవఁజేసి బహునమ్మికగా । గురుమూర్తికి దరువాతను । మరికన్నుల గనని వాని ॥ మార్గము ఛీఛీ । తలచరాదా, మాటను ఛీఛీ ॥ గురునాజ్ఞ విననిదే, గురువై శిష్యులగూర్చి । గురుబోధ దెల్పెడు, గురువంచ కుని యొక్క ॥ మార్గము ఛీఛీ ॥ 232

తా॥ శిష్యా ! పరిపూర్ణబోధ వడయునంత వరకు మిక్కిలి నమ్మకముగా గురువరుని సేవజేసి, బోధను దెలిసికొన్న తరువాత గురుని తిరిగి చూడని శిష్యుడు పరమ ఛండాలుడు. వాడు, ద్రోహుడు, వాని మార్గము మహానీచము. వానిని నోట దలచిన పాపము సిద్ధించును. గురునాజ్ఞ లేనిదే తాను గురువై కొందరి శిష్యులను గూర్చుకొని వారి కుపదేశము జేసెడు గురు వంచకుని నడు వడి మహాహీనమైనది. అది నోటకూడ తల్వగూడదు.

క॥ తన శిష్యులు విని తనునతి । వినయంబునఁ గొలుచు కొఱకు వినుతులొనర్చుఁ । దన గురువును, గురుడింటికి । చను దెంచినఁజూచి శుశ్రూష ॥ తగనొనర్చండు । లేమినిఁదెలిపి, చను

Dr DayanandaSwamy ebooks



మనుచుండు ॥ వినుము కుత్సితశిష్యాగ్రణివీఁడు వీఁడెట్లు । ఘనబోధోక్తస్థితి, గనునో, గురునకు శుశ్రూష ॥ తగనొనర్చుండు ॥

తా॥ శిష్యా! తాను గురువైన శిష్యుడు తనను గర్తింపవలెనని యెంచి తన శిష్యుల యెదుట తన గురువును అనేక విధంబుల బొగడుచుండును. కాని నిజముగా తనయింటికి నామహాత్ముండు వచ్చినచో వారికి శుశ్రూషాదు లొనర్చక దన పేదరికము జెప్పి వెడల గొట్టును. అట్టి కుత్సితబుద్ధిగల శిష్యు నకు పరిపూర్ణ జ్ఞాన మేలాగున సిద్ధించునో నీవే వచించుము.

క॥ కుటిలాత్ముఁడైన శిష్యుం। డిటువలె తాబల్కు గురుఁడు యింటికి రాగా । నెటుబోవు చుంటిరోకో । యిటకిఁక దర్శనము మరల ॥ నెప్పుడయ్యేనో । యెవరికి దెలియు నెప్పుడేమౌనో । యెటుదొచదేమైన, యిత్తమంచనుకొంటె । తటుకున నొకరాగి, దుడ్డయిన లేదిప్పు ॥ డెప్పుడయ్యేనో ॥ 234

తా॥ శిష్యా! కుటిలాత్ముండైన శిష్యుడు తన గురువు యింటికి వచ్చినం జూచి మంచి మాటలతో, అయ్యా! మీరెచటికి బోవుచుండి యిచటికి వచ్చి తిరో, మరల మీదరిశనము మాకెపుడు లభించునో, యేవేళ కేమగునది యెవ రెరుంగుదురు. తమకేమైన దక్షిణ సమర్పించు కొనెదనన్న నాయొద్ద యిపుడొక రాగి కాసైనను లేదు. యేమి సేయుదును. అని చెప్పును. (ఈలాటి శిష్యు నకు పరిపూర్ణజ్ఞానం బెట్లు గల్గును)

క॥ జపములు, తపములు సలుపును । విపరీత స్మరణ జేయువేదాంతార్థం । బపరి మితంబుగ జెప్పును । కపటాత్ముఁడు శిష్యకోటి ॥ గనిమెచ్చుకొఱకు । మెచ్చిద్రవ్యమును యిచ్చు కొఱకు ॥ అపకీర్తి సేతల, కలరి నట్లగుపడి । యుపముచే బ్రతు కుచు, నుండులోకులు, తన్ను ॥ గని మెచ్చుకొఱకు ॥ 235

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! కపటాత్ముడైన గురుడు, తనశిష్యులు తనను జూచి మెచ్చుకొనుటకై, జప తపాదులను జేయుచుండును. మరియు వేదాంతార్థములను యెక్కువగా జెప్పుచుండును. ఇటుల నెన్నో విధముల విపరీత చేష్ట లొనర్చి శిష్యుల ధనంబు లాగి పొట్ట బోసికొనుచుండి తుదకు అపకీర్తి పాలగును.

క॥ గురుమూర్తి కెదు రహంకృతి । దొరకొన్నను, దొంగ
త్రోవ దొక్కిన, చెవులఁ । గురునింద వినిన జేసినఁ నరునకు
పరిపూర్ణబోధ ॥ నలవియె తెలియ । కూడదువాని, దెలియక
కలియ । గురుఁడు తెలిపిన పుస్తకరీతిచే పూర్ణ । మరసితినని
యెంతొ మురిసిన గురుబోధ ॥ నలవియె తెలియ ॥ 236

తా॥ శిష్యా! గురుమూర్తి యెదుట అహంకార వృత్తితో మాటలాడినను, దొంగ మార్గమున చరించినను, గురునింద చెవులతో వినినను, గురునింద జేసినను, ఆ నరునకు పరిపూర్ణ బోధ దెలియుటకు శక్యము గాకుండును. అట్టివాని దెలిసి కొనకుండ స్నేహము జేయరాదు. గురువు జెప్పనిదే గ్రంథములందున్నది. అది పరిపూర్ణ బోధగావా! అని మురిసినంత మాత్రమున వానికి గురుబోధ గలుగజాలదు:

క॥ నాలుగు శుశ్రూషణములు । లోలత గావించుకొనుచు
లోకాతీతం । బాలోకించియు గురుచే । నీలోకముజోలి విడువు ॥
మింతేచాలన్నా । నీతోగూడ, నిది మరువకన్నా ॥ కీలుతెలియని
చదువు చాలాచదివెందుకు । చాలించునీవిట్టి, కీలు తెలిసితివేని॥
యింతేచాలన్నా ॥ 237

తా॥ శిష్యా! గురువునకు, తను, మనో, ధన, వాచార్పణములను నాలుగు విధముల శుశ్రూషలు జేసి, లోకాతీతమును యవలోకించి, గురిగల్గిన మనస్సు గలవాడవై యీ లోకము జోలిని విడువుము. ఈ కీలు దెలియ రానటువంటి పెక్కు చదువులు నీ కెందుకు. వాటివల్ల నీకు లాభములేదు.

Dr DayanandaSwamy ebooks



విశే:— చతుర్విధశుశ్రూష (మంతాతరము) స్థానశుశ్రూష, అంగశుశ్రూష అంగశుశ్రూషణ, భావశుశ్రూష, ఆత్మశుశ్రూషలని నాలుగువిధంబులు.

క॥ దేశికుని చరణ తీర్థము । కాశీగంగయని గురుని గను గొన్నను, వి । శ్వేశుండని తనకును నుప । దేశం బొనరించునట్టి॥ దేతారకమని । మనసందు, తానీతీరునుగని॥ యేసీమయందున్న, కాశీప్రయాగ రా । మేశుని పురమై ప్రకాశించు నాసీమ ॥ యదె తారకమని ॥ 238

తా॥ శిష్యా! గురునియొక్క పాదతీర్థమే గంగా జలమనియు, గురువర్యుడే కాశీ విశ్వేశ్వరుడనియు, గురుడు తన కుపదేశించు బోధయే తారకమంత్రమనియు, శిష్యుడు తనమదిలో దలపోయు వలెను. అటుల దలపోయువాడు నివసించు స్థలము కాశీ, రామేశ్వరము, ప్రయాగ మొదలగు పుణ్యక్షేత్రములకు సమాన మైనదని తెలియవలెను. మరియు,

క॥ గురుచరణజలము గోదా। వరియని, గురుమూర్తి రామ భద్రుండని, త । త్పురమును భద్రాచలమని । గురుమంత్రమె తారకమని ॥ గుఱిగల్గినట్టి । తిరిగిరాని మఱుగెఱిగినట్టి । నరుడున్నచోటే సుం, దరమైన, శ్రీశేష । గిరి రంగనాయక, పరమనదగియుండు ॥ గుఱిగల్గినట్టి ॥ 239

తా॥ శిష్యా! సద్గురుపాద తీర్థమే గోదావరి యనియు గురుమూర్తియే శ్రీరామచంద్రమూర్తి యనియు, గురుడుపదేశించు మంత్రమే తారక మంత్రమనియు, గురుడుండు స్థానమే భద్రాచలమనియు, మనస్సునందు నమ్మినవాడై మరల జన్మించనటువంటి మఱుగెరిగి శిష్యుడున్నట్టి చోటే, శ్రీరంగము, తిరుపతి యనందగి యుండును.

క॥ గురుఁడు నరుఁడంచు దలచిన । గురుమంత్రము మరచియున్న గురుపుత్రుల; నా । దరణ మొనర్చక యుండిన

Dr DayanandaSwamy ebooks



గురువును విడనాడి రెండో ॥ గురుని జేరినను । సద్గురుబోధ,
నెఱిఁగి దూఱినను ॥ ఎఱుక మహాత్మ్యము, నెఱిగిన యిటువంటి।
నరునకు దప్పదు, నరకము యింకొక్క ॥గురుని జేరినను॥ 240

తా॥ శిష్యా! గురుని నరుడని భావించినను, లేక గురుమంత్రము మరచి పోయినను, గురు సంతతిని యాదరింపక పోయినను, తన గురువును విడచి రెండవ గురు నాశ్రయించినను, గురుబోధ దెలిసికొని దానిని నిందించినను. యెరుకనే గొప్పదని నమ్మియుండినను, అట్టి శిష్యునకు రవరవ నరకము ప్రాప్తించును.

క॥ జ్ఞాన వైరాగ్య భక్తన । మాననదీ స్నానదేవ మంత్ర
పఠనతధ్యాన, మభిమంత్రములు, పర । మౌనని మతిగోరినట్టి ॥
మనుజ సంఘముకు । బోధనుతెల్పు మనిన వారలకు ॥ తాను
బోధించుట, తగదు, బోధించినఁ । దాను నేననుభ్రాంతి, తరుగ
దేలా గంటె ॥ మనుజ సంఘమును ॥ 241

తా॥ శిష్యా! భక్తి జ్ఞాన వైరాగ్యము లందును, తీర్థాటనము లందును, దెవతోపాసనలందును, మంత్ర తంత్రములందు నమ్మకము గలిగి పరమార్థ సాధకములని యెంచువారలు యెన్నివిధముల వేడినను యీబోధ తెలుపకూడదు. ఒకవేళ తెల్పినను వారి భేదబుద్ధి వదలక వారా భ్రాంతియందే యుందురు.

క॥ ఇంగితము లెఱిగిఁ సద్గురు । పుంగవుచే నరుఁడు
భుక్తి ముక్తిక్రియలకా । సంగాసంగము వెడలిన । శృంగారమె
వానిచేష్ట ॥చూచేవారలకు । వాడున్నట్లు, తోచేవారలకు । మంగళ
సూత్రమె, భృంగి శృంగారమో । శృంగారవతికి నా శృంగార
వతికిట్లు ॥చూచేవారలకు॥ 242

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా ! సద్గురు స్వామివల్ల పరిపూర్ణజ్ఞానము వడసి, భుక్తిముక్తుల యందలి పట్టు విడుపులను విడిచిపెట్టిన వానిచేష్టలు చూచువారలకు (వాడు శరీరముతో గూడుకొనిన వాడని యెంచు పామరులకు) శృంగారముగా దోచ కుండును, సౌందర్య వతియగు స్త్రీ శరీర సౌందర్యమునే పాటించును. గాని, సౌందర్యములేని స్త్రీ శరీర సౌందర్యమును పాటింపక. తన మంగళసూత్రి మునే సౌందర్యముగా పాటించును. అట్లే పరిపూర్ణబోధ మానవునకు పరమ భూషణమై యొప్పారుచుండును.

క॥ జనులందరు గురుబోధను । గనిరా జనులందునేను గలియకయున్న । న్నను మన్నింతురె ? వారని । మనసునఁ దల పోయ బోధ ॥ మర్మమబ్బునా । అబ్బిన వారి, ధర్మమబ్బునా ॥ జననమరణములేని, ఘనమైనత్రోవ, నే । గననైతి ననిబోధ, గన కున్న యీబోధ ॥ మర్మ మబ్బునా ॥ 243

తా॥ శిష్యా ! మానవుడు గురుబోధ జెందిన వారలను జూచి, నేను వారి వలె గురుబోధ జెందకుండిన, జనులు నన్ను మన్నింపరని గురుబోధ జెందిన వానికి, ఆబోధయొక్క మర్మము దెలియునా ? తెలియను. తెలిసినను వారి ధర్మము తలినికి పట్టుబడవు. తుదకు నితడు చావు పుట్టుకలులేని మార్గము కనుగొననైతి గదా యని చింతించును.

క॥ హృదయ గ్రంథి విడుటకై । సదయుత నీబోధఁ దెల్ప జనదాగురుఁడై । వదలక చిత్తములోగురు । పదయుగములు దలఁపవలదె ॥ భక్తుఁడైనపుడు । భ్రాంతిరహితా, సక్తుడైనపుడు ॥ కుదరవు యివి రెండు, గురుశిష్యులకుఁగాక । కదలిక లేనట్టి, ఘనబోధోక్తస్థితి ॥ భక్తుఁడైనపుడు ॥ 244

తా॥ శిష్యా ! హృదయమందు నాటుకొనియున్న సందేహములన్ని విడి పోవునటుల సద్గురుండు దయతో నుపదేశము జేయవలయును. శిష్యుఁడగు

Dr DayanandaSwamy ebooks



వాడు సద్గురు చరణారవిందము లెల్లపుడు మదిలో దలంచు చుండవలెను. అట్లు గాకుండిన సందేహము నివారణ గాకుండును. భ్రాంతులన్నియు దొలగి పోవలెనని కోరిక యున్నయెడల, గురుసేవ యొనర్చుటే ముఖ్యమగు సాధనము. సందేహ రహితమగునట్లు గురుడుపదేశించక పోయినను, లేక శిష్యుడు గురుని భక్తిశ్రద్ధలతో సేవించక పోయినను, ఘనమైన బోధ (పరిపూర్ణబోధ) స్థితి దెలియ నేరదు. మరియు,

క॥ గురుఁడాశ వదలకుండిన । మరిశిష్యుఁడు ద్రవ్యలోభ మగ్నుండైనన్ । మరియాద దక్కదిరువుర । కెఱిఁగుండుము వీరలతివ ॥ హీనులోయన్నా । గట్టిగ, దురభి, మానులోయన్నా । గురుఁడు శిష్యునిగన్న కొడుకుగా గనకున్న । గురునిపై శిష్యుఁడా గుఱినిల్పకుండిన ॥ హీనులోయన్నా ॥ 245

తా॥ శిష్యా! గురుడు ఆశ వదలకుండినను, శిష్యుడు మిక్కిలి లోభిగా నుండినను, ఆ యిరువురకు మరియాద దక్కదు. వీరిని మిగుల హీనులని దెలిసి కొనుము. వీరు గాఢతరమైన దురభిమానులు, గురుడు శిష్యుని కన్న కొడుకువలె జూడక పోయినను, శిష్యుడు గురుని కన్నతండ్రివలె నెంచకపోయినను వారిరువురికి పొందు గుదురదని యెఱుంగుము.

క॥ గురుగురుబోధల చేతను । పరిపూర్ణం బెఱిఁగి, యెఱుక వదలిన యతనిన్ । గురుతెఱుఁగ నొరుల శక్యమె । యెఱిఁగిన నరులట్టిబోధ ॥ నెఱిఁగెదరోయన్న। వారెరిఁగిన, మఱుగుండదన్న॥ చిఱుతపాపలరీతి, మరిపిశాచముభాతి । తిరుగుచునుండు వె, కుర్రుమాడ్కి నుండెగురుని ॥ యెరిఁగెదరొయన్న ॥ 246

తా॥ శిష్యా; గురువర్యుడొనరించు గొప్పదగు పరిపూర్ణబోధవల్ల, పరిపూర్ణము నెఱిగి, యెరుకను విడిచియుండిన శిష్యుని గుర్తించుటకు మానవు

Dr DayanandaSwamy ebooks



లకు వశము గాదు. అట్టి మహాత్ముని దెలిసి కొనినచో వారికేలాటి సంశయము లుండనేరవు. పరిపూర్ణులగువారు బాలోన్మత్త పిశాచులవలె నగుపడుచుందురు. వారి మరుగు దెలియుట చాలా దుస్తరము.

క॥ మలయాద్రి నున్న చెంచుల । కిలచందనభూమహములె యింధనమట, మి । క్కిలిగలుగఁ బట్టి యటువలె । చులకనసుమి యింటగల్గు ॥ సూరిభూషణుఁడు । బహుమాన్యుఁడు దూరస్థుఁడెపుడు । తెలియని వారికి తెలిసేది కఠినము । తెలివిచే దెలిసితె, తెలియఁజేసిన బోధ ॥ సూరిభూషణుఁడు ॥ 247

తా॥ శిష్యా! మలయ పర్వతమున వాసముజేయు చెంచువారలకు మంచి గంధము చెక్కలనే పొయిలోకి కట్టెపుల్లలుగా వాడుదురు. యెందుకనగా, అచ్చట గంధముచెట్లు విస్తారముగా నుండుటచే నట్లు వాటియందు గౌరవ ముండదు, అట్లే తన దగ్గరనున్న గురువును చులకనగా జూతురు. దూరదేశ మందున్న యెడల గౌరవింతురు. యిది తెలియని వారికెట్లు దెలియును? తన తెలివిచే మహనీయుండని తెలిసి గౌరవించిన సద్గురుండు వానికాబోధ నెఱిగించును.

క॥ దూరమున నుండి విన్నను । జేరును సజ్జనుఁడు గురునిచెంతకు బోధనా । గోరియు, దుష్టుఁడు గోరఁడు । దూరస్థుఁడుగాక గురుని ॥ తోఁ గూడియుండి । యెట్లనియన్న దూరాన నుండి ॥ కోరితుమ్మెద తమ్మిఁ, జేరి తేనియగ్రోలు । నారీతి నెరుఁగవు చేరికప్పలు ॥ తమ్మితోఁగూడియుండి ॥ 248

తా॥ శిష్యా! గురుడు యెంత దూరదేశమందుండినను, సజ్జనుడగు, శిష్యుడు వారి దగ్గరకేగి గురు రహస్యమును గ్రహించును. దుర్జనుడు, గురుడు దగ్గర నుండినను గ్రహింపడు. ఎట్లన, తేనెయందలి యాసక్తిగల తుమ్మెదలు బహు దూరముగానుండి వచ్చి తామర కమలముల యందుండెడు

Dr DayanandaSwamy ebooks



మధువును గ్రహించి పోవును. కప్పలు యెల్లప్పుడు ఆ కమలము చెంగటనే దిరుగుచుండియు, ఆ మధువును గ్రహింప జాలవు.

క॥ వాసిని దెలిసిన శిష్యుల । యాశయముకు దగినబోధ యతనికి దెలియం । జేసిముద మందఁజేసెడి । దేశికుఁడే ముఖ్యుఁడనుచు ॥ దెలిసికోవోయి । కనియాతని, గలిసికోవోయి ॥ జేసినదయతోనీ, యాశసంపూర్తిల్లు। వ్రాసి వేసుకొనుము జూచెదు తరువాత ॥ దెలిసికోవోయి ॥ 249

తా॥ శిష్యా ! మంచి చెడ్డలను గ్రహించిన శిష్యునియొక్క అభిప్రాయాను సారముగా బోధ జేయునట్టి గురుడే గురుడు. అట్టిగురుని వెదకి యాశ్రయించిన యెడల, నీ కోరిక నెరవేరును. ఈ మాట ముమ్మాటికి నిజము. కాదందువేని వ్రాసి యుంచుకొనుము. నామాటె నీకు తర్వాత దృఢమగును.

క॥ మంతనమున గురుబోధను । నెంతో వింతనుచు నమ్మి తింతేగద, యే । వింతలు గనరాదని, ధా । వంతము నొందేటి వాని ॥ బ్రతుకంతకంతే । చింతలులేని గతిఁగానడంతే । అంత కంతకు వాని, కతిచాదస్తమెగాని । సంతకూటముతోటి, సంభోగించెడువాని ॥ బ్రతుకంతకంతే ॥ 250

తా॥ శిష్యా ! కుత్సిత స్వభావుడగువాడు. "అకటా ! గురుబోధయందెంతో వింతగ నుండునని వచ్చిచేరితిని, ఈ గురుబోధ యింతయేగదా ? దీనియందేమి వింతలు లేవు." అని మనస్సునందు విచారము నొందువాని బ్రతుకు అంతటిదేయని దెలియుము. వాని కంతకంతకు చాదస్తము యెక్కువగును. ఎట్లన, స్వకాంత కూటమిని విడచి పరకాంతను బొందువాని బ్రతుకెంత హీనమో, అంతటి హీనుడు యేదుఃఖములు లేని పరిపూర్ణ భావమెరుంగడని దెలియుము.

Dr DayanandaSwamy ebooks



క॥ తనగురు బోధను దాఁజది । విన విను జనవితతి మదికి వింతయి యీబో । ధను నేర్వకున్న వ్యర్థము । జననం బనితోఁచి శరణు ॥ శరణనునట్లు । వెంటనెవారు దరిజేరినట్లు । ఘనమైన యుక్తి జేకొను వాడే శిష్యుఁడు । అనుమాన మేమియు గనరాదు వినవోయి ॥ శరణనునట్లు ॥ 251

తా॥ శిష్యా ! తాను గురువువద్ద నేర్చికొనినబోధను, మళ్ళి తా జదువు నపుడు, అది వినెడు వారి మదికి యాశ్చర్యము దోచి "ఈబోధను మాకు దెల్పుము. నీకు శరణుజేసెదము ఇది వినకున్నచో మా జన్మము వ్యర్థము" అని కోరుచు దరిజేరునట్లు మిక్కలి యుక్తియుక్తముగా జదివి చెప్పువాడే శిష్యుడు సుమా ! ఇందు అనుమానమేమియు లేదు. అతడే పరిపూర్ణు డనబడును.

క॥ తనభార్య రూపురేఖలు । తనపుత్రుని సద్గుణములు తనసంపదయుఁ । దనపెఁరటి చెట్టుమందును ॥ ధనగ్రామపు సాధుజనులు ॥ తనకుమెప్పానా । యీయిలలో, నెంతటివారి కైన । వినలేదె నీవహ ల్యనుఁజూచి మోహించె । ఘనవాహ నుండు చక్కనిభార్యగలిగుండి ॥ తనకుమెప్పానా ॥ 252

తా॥ శిష్యా ! తన భార్యయొక్క సౌందర్యమున్ను, తన పుత్రులయొక్క సద్గుణములున్ను, తన కల్మియు, తన పెరటిలోనున్న మందుచెట్లున్ను, తన గ్రామమం దుండెడు సాధు పురుషుడు, యీ మొదలగు వారిని లక్ష్యపెట్టరు, ఎటులన, మహా సౌందర్యవతియైన శచీ దేవి యుండగా, యిండ్రుడు అడవు లందు ఆకులలములు దిని కాలము గపుడు గౌతముని భార్యయగు అహల్యను జూచి మోహించెను. యిదినీవు విని యుండలేదా ?

క॥ జతనముగ దాఁచి చదువుము । రతనమ్ముల హారమి దియు రసికులుగలఁ మా । యతనము దీనికి నేబహు । యత

Dr DayanandaSwamy ebooks



నము గావించితెచ్చి ॥ యిచ్చితినేడు । బోధకు బందోబస్తార
చూడు ॥ రతనాలెల్లౌరాళ్ళు, రతనాలంచని యంటే । రతనాలీ
పద్యాలే, రసికులెరిగెదరివి ॥ నీకిచ్చితి నేడు ॥ 253

తా॥ శిష్యా ! నేననేక యత్నములుజేసి నీకీ రత్నాల హారమును గూర్చి నీకిచ్చినాడను. నీవు దీని జతనముగ దాచుకొని చదువుము. యిది యమూల్యమైనది. ఈ హారముల రతనాలేవని యడిగెదవేమో ? ఈ పద్యములే రత్నాలు కాని, రాళ్ళు రత్నాలు కావు. ఈ రత్నాలు పరిపూర్ణ బోధను దృఢపరచును. వీటిని రసికులే దెలిసికొనగలరు.

క॥ విననేర్చి చెప్పనేర్చిన । మనుజులకే దీనిలోని
మర్మము దెలియుఁగా । వినజెప్ప నేరకుండిన । మనుజులు
నీబోధలోని ॥ మర్మమెఱిగెదరా । దీనియందుండె ధర్మమెఱిగె
దరా ॥ జనులే కొబ్బరికాయ తిననేర్పుగలవారు । తినవచ్చునా
కోఁతి, తనకా కాయబ్బిన ? మర్మ మెఱిగెదరా ॥ 254

తా॥ శిష్యా ! విననేర్చిన, చెప్పనేర్చిన మానవులకే యీ పరిపూర్ణ బోధయొక్క మర్మము దెలియబడును గాని విన జెప్ప నేర్వకుండిన వారికి దీని మర్మ మెంతమాత్రము దెలియదుసుమా ! తిననేర్పుగల మానవునకే కొబ్బరికాయ పనికి వచ్చునుగాని, తిననేర్పులేని కోతికి కొబ్బరికాయ దొరికిన నేమి ప్రయోజనము.

క॥ తానెంత లెస్సచదివిన । దీనినిదెలియంగఁ గలఁడె
దేశికపర్యం । బూనిక సేవించనియెడ । మానవులది యెట్లులన్న॥
మఱివినవోయి । నామాటందు మన సుంచవోయి ॥ వానకాలము
లోని, వర్షమొక్కబిందు । వైనమింటనునిల్వ దదినిశ్చయమెకద॥
మరి వినవోయి ॥ 255

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! తానెన్ని చదువులు జదివినప్పటికిని, గురువర్యుం డెరిగింపకున్న యీ పరిపూర్ణ బోధ దెలియజాలడు. ఎట్లంటేని, వర్షాకాలమున వర్షించు నీటి బిందువులలో నొకటైన ఆకాశమందు నిలువనట్లు, గురువర్యుని భక్తి శ్రద్ధ విశ్వాసములతో సేవింపకున్న యీ గ్రంథమునందలి మర్మము దెలియదు. యిదినిశ్చయము.

క॥ నన్నాశ్రయించి నావని । యన్నా, యీబోధనీకు నతుకుటకొఱకై । యెన్నోయుక్తులు, చెప్పితి । విన్నావా, దీనినీవు ॥ విడువ కెప్పటికి । నా యాజ్ఞను గడువ కెప్పటికి ॥ నన్ను నీవు నినునే, గన్నవేళెట్టిదో । నన్ను నీవు విడవు, నిన్నునే విడలేను ॥ విడువకెప్పటికి ॥ 256

తా॥ శిష్యా! నీవు నన్నాశ్రయించుటచే, ఈబోధ నీమదికి నాటునటుల నెన్నియో యుక్తులుగ నీకు జెప్పియున్నాడను. నీవు విన్నావుగదా! నీవు దీని నెప్పుడును మరువకుము. నాయాజ్ఞను మీరకుము. నాయనా! నన్ను నీవును, నిన్ను నేనును జూచినవేళ మంచిది నీవు నన్నును నేను నిన్నును విడచి యుండలేము.

క॥ పతియైనను సతియైనను । నతి సాహసపరులుగాక యాంతర్యమునఁ । రతివేళ లజ్జపడ, సం । తతి గలుగదు చూడుమట్లు ॥ తగదుఁ లజ్జింప । గురుశిష్యులకట్ల తగదులజ్జింప ॥ మతిని నీవిట్ల స, మ్మతిచేసి, యేయేసం । గతి నన్నడుగుము బోధ, స్థితి నీకు దృఢపఱతు ॥ తగదు లజ్జింప ॥ 257

తా॥ శిష్యా! భార్యాభర్తలు సాహస పరులుగాక రతి సమయమందు సిగ్గుపడినచో, వారికి సంతానము గలుగునా? కలుగదు, అటులే, గురు శిష్యులు చెప్ప వలసినది జెప్పక, నడుగవలసినది యడుగక యూరకుండినచో, ఫలము

Dr DayanandaSwamy ebooks



గలుగదు. కావున నీవు లజ్జను విడచి నీకు కావలసిన సంగతులన్నియు నడిగి తెలిసికొనుము. నీమదికి దృఢమగునటుల బోధ జేయువాడను.

**క॥ రతికొఱకుఁగాదె సతిపతి । కతి హితమతి సేవజేయు నటువలె, బోధ । స్థితి నీకుఁ గుదురుటకు, స । మ్మతితో గురు సేవ సేయు ॥ మా నీతిమంతా । అభిమానము, పోనీతిమంతా ॥ అతనికి దయరాగ, యరనిమిషమునబోధ । స్థితినీకుఁ గుదిరించు, సిగ్గువిడిచి కొలువు ॥ మానీతిమంతా ॥ 258**

తా॥ శిష్యా ! ఎటులైతే, భార్య రతిసుఖమున కాసించి తన భర్తకు అనేక విధముల సేవ జేయుచుండునో, అటులే, ఈబోధ కుదురుటకై నీవు గురువర్యుని సేవించుచుండుము. దేహాభిమానము నిన్ను విడిచి పోవును, గురుమూర్తికి దయగల్గిన యెడల క్షణములో నీబోధయొక్క మర్మమును నీవు దెలియునటుల జేయును. కావున నీవు లజ్జనువదలి గురుని సేవింపుము.

**క॥ నీమానసమున సంశయ । మేమాత్రము నిల్పబోకు మిఁకనాతోడే । నామాట నిశ్చయము, నే । నేమాత్రము దాఁచ లేదు ॥ నీతోడుసుమ్మీ । యింతకుమిక్కిలింక లేదులెమ్మీ ॥ నామీద తలపుంచి, సనుమరువకిఁక నేను । నీమీఁద దయయుంతు నిజమిందు కేయొట్టు ॥ నీతోడుసుమ్మీ ॥ 259**

తా॥ శిష్యా ! నీమదిలో నేమాత్రము సంశయము నుంచబోకుము. అట్లుంచితివేని నాయాన, నేనేమాత్రము సంశయింపక నేను నాగురునివద్ద నేర్చినబోధ నీకెరిగించితిని. నీయాన సుమా ? నామాట నమ్ముము. నేనేమాత్రము దాచుకొనలేదు. నే జెప్పిన దానికిక మిక్కిలిలేదు. నీవునన్ను మరువకుము. నీమీద నేను దయయుంచుదును. ఇదియే మన యిరువురకు వాగ్దత్తము.

Dr DayanandaSwamy ebooks



క॥ నాగురుబోధను నీచే। బాగుగ విని, నిందసేయు భ్రష్టుల మాట। ల్లోగొని విడిచెద విది నీ। కేగురుడీలాటి బోధ ॥ నెరిగించడోయి। యెరుకలోని, దెరిగించునోయి ॥ ఆగురుబోధల, నన్నిటి నెరిగుండి। నాగురుబోధనే, నయముగ నీకిచ్చి ॥ తెరిగించఁడోయి ॥ 260

తా॥ శిష్యా! నా గురువు నాకు బోధించిన బోధను నీకు సొంతముగా నెరిగించితిని, నీవు దీనిని పరులకు బోధించువేళ, విని నిందించు భ్రష్టులగు మానవులమాటలు విని నీవీ బోధను వదలేవు సుమా? జాగ్రత్త, వదలినచో, నింతకంటె మంచిబోధ నీకు యేగురువు వల్లను లభింపదు. ఆబోధలన్నియు నేనెరిగి యుండియే, నా గురుమూర్తి వరప్రసాదమైన యీబోధను నీకు దయ జేసితిని.

క॥ నిక్కముగ బీరపీచుల। చిక్కునుమీ విచ్చరాదు ధీయీ యెఱుకఁ। మక్కువ నేబోధించిన। చక్కని బోధాగ్ని చేత ॥ సాధించుపోరా, విచ్చేనుచింత, జాలించుకోరా॥చొక్కమౌ నీబోధ, కెక్కడీకీడౌను, దక్కనబోధల దిక్కుచూడకు దీని ॥ సాధించుపోరా ॥ 261

తా॥ శిష్యా! నిజముగా యెరుక బీరకాయ పీచు చిక్కువంటిని. యీ చిక్కు విడదీయుట కెవ్వరికి వశముగాదు. నీయందలి ప్రేమచే నే బోధించిన యీ చక్కని బోధానలంబున యెరుకను సాధించుము. చిక్కులన్నిటిని వదలి చింతను చాలించుకొనుము. యిదితప్ప నితరబోధల జోలికింపోకుము యీ బోధతో నేబోధలు సాటిరావు.

క॥ అడవి యుసిరికయు జలనిధి। బొడమిన లవణంబ టంచు బొగడిన రీతిఁ। బుడమిని నీస్థలమందున। గడువేడుక నీవునేను ॥ గలియుట వినరా। నీనాప్రేమ, గలిసెగన్గొనరా।

Dr DayanandaSwamy ebooks



విడవు నీవునన్ను, విడలేను నేనినున్ను । గడువేడ్క నీవునెక్కడ
బోక నిలచిట్లు ॥ గలియుట వినరా ॥ 262

తా॥ శిష్యా ! అడవిలో బండిన యుసిరికాయకును, సముద్రములో బండిన యుప్పుకును ఎట్లు సంబంధము కలిగెనో, అట్లే నీకును నాకును యిచ్చట సంబంధము కలిగినది. మన యిద్దరి ప్రేమ నొకటిగా గలసినవి. నన్ను నీవును నేను నిన్నును విడజాలము. సంతోషము నీవిక్కడ జేరుటవల్ల నిట్లు అయినది.

క॥ పెద్దల నింద యొనర్పకు । పెద్దల సేవించు కొఱకు
బిఱుదివియకు మే । పెద్దలతో వాదించకుఁ । బెద్దలు బోధించు
మాట ॥ పెడచెవులవినకు । పెద్దలునడచు, నడతనేమనకు ॥
బెద్దలకన్ననేఁ, బెద్దనంచనుకోకు । పెద్దలఁగనుఁగొన్న బ్రియ
ముతో మ్రొక్కుము ॥ పెడచెవులవినకు ॥ 263

తా॥ శిష్యా ! నీవు పెద్దలను నిందజేయకుము. పెద్దలను పూజించుటకై వెనుదీయకుము, పెద్దలతో వాదులాడకుము. పెద్దలు బోధించుదానిని జాగ్రత్తగా వినుము. పెద్దలనడకను జూచి హేళనము సేయకుము. పెద్దలకంటె నేనే పెద్దవాడనని యనుకొనకుము. పెద్దలను గాంచినపుడు భక్తితో మ్రొక్కుడుము.

క॥ పెత్తనమున నేనుంగిలఁ । జెత్తనుదినవలసె జీమ
చిన్నతనమునే । హత్తుకొని దినునుజక్కెర । నిత్తరి నిరెంటనీకు॥
నిష్టమేదైతే । చేకొనుమదె, స్పష్టమేదైతే । పెత్తనమున జెడె,
పెంపొందుచుండును । జిత్తములోదెలియు చిన్నతనమే మేలు ॥
నిష్టమేదైతే ॥ 264

తా॥ శిష్యా ! పెత్తనము వహించిన యేనుగుచెత్తను దినవలసి వచ్చెను. చిన్నతనము పొందిన చీమ చక్కెరను దినును. కాబట్టి నీవు బెత్తనమును కావ

Dr DayanandaSwamy ebooks



లెనో, లేక జిన్నతనమే కావలెనో, ఈరెంటిని బాగుగా పరిశీలించి, నీ కిష్ట మొచ్చిన దానినే గ్రహించుము.

క॥ తనను శరణన్న వారల । మనసెట్టిదొ తఱచిచూచి
మఱిదెల్పదగుఁ । వినువారికి దగినట్టిది । యని రిట్లు మహాను
భావు ॥ లతిచాతుర్యమున । వికాసముగ, నతి చాతుర్యమున ॥
ఘనమైన యీబోధ, కరుణనిచ్చితిని జ, చ్చినదనుక నిదుర
వ, చ్చినదాఁక మఱువకు ॥ మతి చాతుర్యమున ॥ 265

తా॥ శిష్యా! తనను శరణని మఱుగుజొచ్చిన మానవుల మనస్సును చక్కగా పరిశీలించి వారి భావమునకు దగునట్లు బోధించవలయునని పెద్ద లగువారు వచించి యుండిరి. నేనును అటులే నీ హృదయము నెరింగి మిక్కిలి నేర్పుతో యీ గొప్పదైన పరిపూర్ణ బోధను దయతో వచించితిని. కావున దీనిని ప్రతిదినము నీకు నిదుర వచ్చేడు దాకను మరణ పర్యంతమును మరువకుము.

క॥ చెప్పదగు గురుఁడు బోధను । జెప్పినపనిజేసెనేని
శిష్యాగ్రణికిఁ । జెప్పదగదు జెప్పిన పని । తప్పని వాదించెనేని॥
దయదలఁచి బోధ । యిద్దరికుంటఁ, దగదట్టివేధ । జెప్పిముం
దుగ బోధ, జెప్పెడి పనులన్ని । చెప్పఁగూడదు వాని, తిప్పలు
పెట్టక ॥ దయదలఁచి బోధ ॥ 266

తా॥ శిష్యా! గురుడు తాను జెప్పిన పని జేయునట్టి శిష్యునకే ఈబోధ జెప్పఁదగును తాను జెప్పినది విని తప్పని వాదించెడు వానికి బోధ జెప్ప వలదు. యెందుకనగా గురు శిష్యులకు వాదభేదము లుండకూడదు. గురుడు బోధించిన తర్వాత శిష్యునకు చెప్పరాని పనులు జెప్పి తిప్పలు బెట్టకూడదు.

క॥ ఇవి వినుమనినను సుజనులు । చెవియొగ్గెద రివియు
సృష్టిఁ జేసి కృతికి బలే । చవిఁ బుట్టింతు రదెట్లన । శివుఁడు

Dr DayanandaSwamy ebooks



కళానిధినిఁజక్కఁ ॥ జేసెనలేదా । నీమదిశంక, బాసెనలేదా ॥ అవనిలో శ్రీరాము, లవగుణినాహల్య । నెవరేమియనకుండ । సవ
రించి సుగుణిగఁ ॥ జేసెన లేదా ॥ 267

తా॥ శిష్యా! గురుభార్యను బొంది పంచమహాపాతక మొడిగట్టుకున్న చంద్రుని శంకరుడు పవిత్రునిగా జేయలేదా? శ్రీరామచంద్రుడు ఇంద్రునితో సంభోగించిన అహల్యను పరిశుద్ధురాలిగా జేయలేదా? అట్లే మంచివారీ గ్రంథ మును చదివి (విని) ఇతరులకు రుచి గల్గేటటుగా బోధించగలరు. ఇందుకు నేమాత్రము సంశయములేదు నీవనుమానింపకుము.

క॥ గురుసూచనైన నరులను । మఱిమఱి వినుమన్న జదువు మాపద్యములఁ । గురుసూచన యెరుఁగని యా । నరు లను వినుమన్న జదువ ॥ నగుబాటౌ గదరా । అదియెట్లన్న, నిఁకనేదెల్పెదరా ॥ పురుషసంగతిలేని పాలఁతికొక్కోకశాస్త్ర । మరసి మెచ్చునెదాని, నతిప్రౌఢ సతివలె ॥నగుబాటౌగదరా॥268

తా॥ శిష్యా! యవ్వనవతియగు స్త్రీకి కొక్కోక శాస్త్రమిచ్చిన మెచ్చు కొనును. పురుష సాంగత్యమన్ననెట్టిదో యెఱుగని బాలిక కొసంగినచో మెచ్చు కొనునా? మెచ్చుకొనదు, అట్లే గురూపదేశ మొందిన వారికిది వినుండని బ్రతిమాలిన యానందింతురు. గురూపదేశ మొందని పామరులను జదువుమని నను వినుమనినను వారు పరిహసించెదరు.

క॥ ఎవరున్న నేమిభయమని । సవరింతురు దప్పులున్న సాధులువినినఁ । సవరింతురు సుమ్మివి విని । యవినీతులు నిందఁజేయ ॥ నయ్యేదేమోయి । అందులో మనది, పొయ్యేదే మోయి ॥ భవనాశస్థితిలేని, పద్ధతి యీబోధ । సవురుగవినిపించు, చాటేల మాటేల ॥ నయ్యేదేమోయి ॥ 269

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! ఈగ సుగంధ వస్తువులను విడనాడి దుర్గంధ వస్తువులపై వ్రాలును, అట్లే దుష్టబుద్ధిగల వాడు లక్షణవేత్తల కొప్పిదమైన సద్గ్రంథము లందు లక్ష్యముంచక వాడు అందలి మంచి విషయములను విడనాడి పట్టుద లతో దప్పులను వెదకుచుండును.

క॥ రమ్మని పిలువనిదే, ప । ద్యమ్ములు చదువంగవచ్చి
యవి నిందించుఁ । సమ్మతిగాక కుమతివిని । యిమ్మహినది
యెట్లటన్న ॥ నిట్టులె వినుమీ । వానికి బుద్ధి, నట్టులెకనుమీ ।
బొమ్మలాటాడించు, బొమ్మతానొకటి । ఛీ, పొమ్మనిహాస్య, మొన
రించిన బోకను ॥ యట్టులె వినుమీ ॥ 275

తా॥ శిష్యా! ఎటులైతే బొమ్మలాటలందలి యొక బొమ్మ హాస్యము జేయుచుండగా రెండవబొమ్మ ఛీపొమ్మని తిరస్కరించినను ఆ బొమ్మ యెటులైతె తొలగిపోదో, అటులే ఈ పద్యములు జదువునపుడు పిలువనిదేవచ్చి (పిలువని పేరంటమునకు వచ్చి పెత్తనము మీద వేసుకొనునట్లు) పద్యములను నిందించుచుండును. వాని నెవరేని ఛీ పొమ్మన్నను పోక తుదవరకు నుండి తప్పులనే వెదకుచుండును.

క॥ వటియించిన చన్నులుగల । కుటిలాలక నిందజేయు
గుత్తపు రవికఁ । ఎటువలె తనతప్పెఱుఁగక । యటువలె గ్రంథ
మును మెచ్చఁ ॥ డతిదుర్జనుండు । లేనిదెతప్పు, వెదకుచు
నుండు । ఇటువంటి బోధనే, నెఱుఁగుటెట్లనుకోక । కటువాక్య
ములు పలికి, ఘనులగాసిలజేయు ॥ నతిదుర్జనుండు ॥ 276

తా॥ శిష్యా! ఠవిక్కించిన చన్నులుగల స్త్రీ తన తప్పెరుంగక, గుత్తపు రవికను నిందించినట్లు, అల్పజ్ఞుడు ఈ గ్రంథము నందలి బోధను గ్రహింప లేక నిందించును. లేనితప్పులను వెదకుచుండును. "నేనెట్లు యీగొప

Dr DayanandaSwamy ebooks



బోధమ గ్రహించి జన్మరాహిత్యమును జెందుదునో" అని యోచింపక కఠిన వాక్యములాడి పెద్దలగువారి మనస్సును నొప్పించెవరు.

( శిష్య ఉవాచ )

క॥ గురువర మీనాసందున । నెఱుకను తెరగలిగియుండె
నిన్నాళ్ళును మీ ! కరుణారసేక్షణమ్ముల । దెరతీసితి రెరుకమాట॥
దీరెనిక్కడికి । చాలును బోధ, దూరదెక్కడికి । పరిపూర్ణమున
లేని యెఱుకను జూపించి । యెఱుకలేదనియంటి, రెఱుక లేదా
యెను ॥ దీరెనిక్కడికి ॥ 277

తా॥ ఓ గురువర్యా ! ఇన్ని దినముల నుండి మీకును నాకును మధ్య. నొక యెరుక అనెడు తెఱ యుండెను. మీ కరుణవల్ల ఆ తెఱను తీసి వేసితిరి ఇక్కడికి యెరుక నశించిపోయెను. ఈ పూర్ణ బోధను నా కెరిగించి యెరుక లేకుండ జేసితిరి.

క॥ ధారుణి గొంత జరించి, వి । చారించితిగాని యీ విచా
రము, నేనె । వ్వారలు సెప్పగ వినలే । దారయ మీనోటవిన్నా ॥
నయ్యా గురుమూర్తీ । నాతరమా నుతిజెయ్య మీకీర్తి । సారస
నేత్ర, పురారి, నీరజభవ బ్రం । దారక ముఖులైన నేరరు
మిముదెలియ ॥ నయ్య గురుమూర్తి ॥ 278

తా॥ ఓ గురుమూర్తీ ! నే నక్కడక్కడ కొన్ని దేశంబులు దిరిగి పెద్దలగు వారితో తత్త్వవిచారణ గావించితిని, కాని, ఈ విచారము నాకెవ్వరు నెఱిగింపలేదు. మీ నోటనె వినియున్నాడను. మీ కీర్తిని నేనేమని గొనియాడుదును. హరిహర బ్రహ్మాదులైన మిమ్ము స్తుతింప జాలరు. నేనెంతటి వాడను.

క॥ ఘటమెదుట బెట్టిచూపిన । యటువలె బయలుండ
జూపి । యతిమాయలచే । నటియించుచున్న యెఱుకను ।
తృటిలో విడిపిస్తిరిపుడు ॥ తీరెనాశంక । మదిబుట్టదు । నేరీతి

Dr DayanandaSwamy ebooks



నింక ॥ ఎటుదోచ కిలువెడలి యిటుమిమ్ము జూచి, నప్పటినుండి దయచేనిప్పటిదాక బోధింప ॥ దీరెనాశంక ॥ 279

తా॥ ఓ గురురాయా! కుండను యెదుట బెట్టి జూపినటుల, నాకు పరిపూర్ణ ముండుట జూపి, పెక్కు మాయలతో మెలంగుచున్న యెరుకను క్షణములో విడిపించితిరి. నాయనుమానము నేటితో దీరిపోయెను, నా మనస్సునందింక శంక యుండుటకు జోటులేదు. ఈ దుష్పార మగు సంసార సాగరము నుండి దరిజేరుటకు త్రోవ దోపక నిలువెతలి వచ్చుటచే, యిచ్చట మిమ్ములను దర్శించిన నాటనుండి నేటివరకు మీరు దయతో బోధించిన బోధవల్ల నా యనుమానము బాసి పోయెను. (అనిన గురువర్యుండేమను చున్నాడన.)

క॥ ఒరులేననకయు నుండిన। దెఱిఁగింపు మదేమొబయలు నేనొరులంచుఁ। ఎఱుకెవ్వరు లేదనవలె। నెఱుకను నున్నదని యంటె ॥ యిదిలేదంచనుకో। నేను నీవు నీ, మదిని లేదనుకో॥ యెఱిగి యీ లేనెఱుక, యిట్లులేకుండిన। పరిపూర్ణమను దాన్నే, పగిది గుర్తెరిగేము ॥ ఇది లేదంచనుకో ॥ 280

తా॥ శిష్యా! ఒరులు నేనని చెప్పనిదే పరిపూర్ణము. ఒరులు నేనని చెప్పనదే యెఱుక, అట్లనుటచేత యెరుకలేదని తెలిసికొమ్ము. యెరుక యున్నదనిన యెడల పరిపూర్ణము లేనిదగును. నేను నీవు అనునది లేదని నీమనస్సునందు గ్రహించి, లేనెరుకను లేకుండ జేసికొనుము, అట్లు యెరుకనే లేకుండిన పరిపూర్ణమును గుర్తించువారెవరు ? లేరు అని తెలియుము.

క॥ నాబుద్ధికి సరిపడ్డది। నీబుద్ధేగాని యెన్ని నేర్పుల గనినఁ। ఛీ బద్ధులు యీబుద్ధులు। నాబుద్ధికి మెప్పుగావు ॥ నాతండ్రి వినరా। సెభాసు నిన్నేతండ్రి గనెరా ॥ ఈ బుద్ధి నిక మాన, కేబుద్ధి బూనకు। యేబుద్ధి బూనిన నీబుద్ధి చెడిపోవు ॥ నాతండ్రి వినరా ॥ 281

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! నా బుద్ధికి సరిపడ్డది నీ బుద్ధి యొక్కటే కాని. ఛీ, ఛీ, బద్ధులగువారి బుద్ధులు నాబుద్ధికి పరిపడవు. నాయనా! వినుము. నిన్నేతండ్రి గన్నడోకాని ఈ బుద్ధిని నీవు విడువకుము. ఇతర బుద్ధులను బూనకుము. అటులైనచో నీమంచిబుద్ధి చెడిపోవును.

క॥ కొట్టితిఁ దిట్టితి శ్రమలం । బెట్టితి నీమనవి చెవుఁ బెట్టక పెడగా । బెట్టితి మొట్టితి వెతలం । గొట్టితినీమనసుఁ ॥ దెలియఁ గోపములేక । సరితెలిసితి, వోపిక పోక ॥ పట్టుమిచ్చెద నింక, పట్టేమి లేదాయె । బట్టుమిచ్చెదబోధ, గట్టివాఁడవురోరి ॥ కోపములేకా ॥ 282

తా॥ శిష్యా! నిన్ను కొట్టి, తిట్టి అనేక విధముల బాధ పెట్టితిని. నీమాటలు వినక పెడచెవుల బెట్టితిని మొట్టితిని, వెళ్ళిపొమ్మని నెట్టితిని, యివన్నియు నీ మనస్సును దెలియుటకై జేసితినేకాని వేరుగాదు. ఆహా! నీశాంత గుణమున కేను మెచ్చితిని. నీవు గట్టితనముగల వాడవు నీకు పరిపూర్ణబోధ ననుగ్రహించెద గ్రహింపుము.

క॥ " నీవెంత కొట్టి తిట్టిన । నే విడిచెదువాడగాను నీచర ణంబుల్ । చావయిన బెండ్లియైనను । నేవిడువ " నటంటి ॥ వట్టి నిజభక్తుఁడౌరా ॥ నేఁ గనుగొంటి, నీనిష్ఠలౌరా ॥ కావున నీకిట్టి, ఘనమైనబోధను । వేవేగ దయచేస్తినీవిదివిడువకు ॥ నిజభక్తుఁ డౌరా ॥ 283

తా॥ శిష్యా! " నీవెంతకొట్టినను, తిట్టినను, నీచరణములను నే విడువను. చావైనను, పెండ్లియైనను నీవే గతియని నమ్మితిని " అని నీవు పట్టుదలతో యనియుంటివి. నీవు నిజమైన భక్తుడవుసుమా! నీ నిష్ఠను గనుగొంటిని గావున గొప్పదయిన గురుబోధను నీకిచ్చితిని దీనిని నీవు విడువకుము.

Dr DayanandaSwamy ebooks



క॥ నానోటిమాట వెంబడి । దానెప్పుడు సంచరించెదగ నీచిత్తం । బేనదిగని యీబోధని । దాననునీకిస్తి దీని ॥ దాచుకోసుమ్మీ ॥ నిత్యమునీవు । చూచుకోసుమ్మీ ॥ యేనరుఁ డయిన, నిన్నీబోధ నడిగిన । వాని మనసరయక వానికి దెల్పేవు ॥ దాచుకోసుమ్మీ ॥ 284

తా॥ శిష్యా ! నా యాజ్ఞానుసారము నీచిత్త మెల్లప్పుడు సంచరించుటచే నేనదిగాంచి, యీ యచలబోధయను ధనంబు నీకిచ్చితిని. దీనిని నీవు దాచుకొమ్ము ప్రతినిత్యమును చూచుకొమ్ము నిన్నెవరైన నీబోధ నడిగినయెడల, వారి మనస్సును పరిశీలించక నుపదేశించ వలదు.

క॥ కన్నది విన్నది లేకయు । నున్నదిపరిపూర్ణ మనుచు । నూహ నెఱిగినఁ । గన్నది గన్నట్టేచను । నన్నరయగ నెవ్వరున్నా॥ రామీఁదనడుగ । విన్నావయున్నా, వారెవ్వరనఁగ ॥ నిన్ను పోలిక గాను, కన్నులపండు గై । తిన్నగ గలిగుంటు, నిన్నును తెఱదీయ॥ నామీదనడుగ ॥ 285

తా॥ శిష్యా ! చూచునది, వినునది. లేవనియు, నున్నదే పరిపూర్ణ మనియు దెలసిన యెడల, చూచినది చూచినట్టే పోవును అటుపిమ్మట నన్నడుగుటకై యెవ్వరున్నారు ? వినుము. ఉన్నవారెవ్వని యందువేని నీవు నేను అని పలుకుచుండినచో, యెఱుక కన్నుల పండువుగా కనుపడు చుండును. నీవు నేను అను తెరను దీసి వేసినచో, అన్నియు నున్నవై పరిపూర్ణ మొక్కటియే యుండును.

క॥ లేని జగమెరుక లేవని । మానుగ నిది తెలిసినపుడు మర్మము లేకఁ । గానబడు బట్టబయలై । మానుగ గలిగుండు నెందు ॥ జూచిన నందు । అందముగాను జూచినముంతు ॥

Dr DayanandaSwamy ebooks



అందు నిండనరాక, యెందుఁజూచిన బయలు । సందు సందుల నిండి । పొందశక్యముగాక ॥ చూచిననందు ॥ 286

తా॥ శిష్యా ! లేని యెఱుక లేని ప్రపంచము లేదని నీ మనస్సు కెప్పుడు దృఢ విశ్వాస మగునో, అప్పుడే పరిపూర్ణము యదార్థమని నీవెందుజూచిన నందందే యగుపడును, దానిని పొందుటకు నెవ్వరికిని వశముగాదు.

క॥ నమ్ము నిజమ్ముగ మనమున । ముమ్మాటికి యెఱుక జోలి మూర్కొనక మదిఁ । నమ్ము మచలమ్ము లెస్సగ । నిమ్మళముగ నిల్చిచూడ ॥ నీవు నిల్వలేవు । నమ్మకు మెరుక, యది నమ్మలేవు ॥ తమ్ములలోపల, నిమ్ముగ వెలిగెడు । తుమ్మెదయని నేను నమ్మబల్కితి సుమ్మి ॥ నీవు నిల్వలేవు ॥ 287

తా॥ శిష్యా ! నేనింతవరకు జెప్పిన మాటలను నీ మదిలో నమ్ముము, యెఱుకజోలి బూనకుము, పరిపూర్ణమును మరువకుము. చక్కగా నాలోచించిన యెడల, నీవు అను యెఱుక నిలువదు, నిలువని యెఱుకను నిలుచునని నమ్మకుము. తామర కమలములోని తేనెను గ్రోలి వెడలిపోవునట్టి తుమ్మెద వంటిదీ యెరుకయని తెలియుము, దానిని నీవు విడిచి పెట్టుము.

క॥ తెలవారెను యిఁకజన్మము। కలయయ్యె జగంబులెల్ల గనుఁగొనుచుండఁ । కలమేలుకొన్న పిమ్మట । నిలువగలేదయ్యె యెఱుక ॥ నిక్కము సుమ్ము । నమ్మిదాని నీవికనమ్ము ॥ యెక్కడజూచిన, పిక్కటిల్లుచు బయలు । మక్కువఁ గలిగుండు, దిక్కులనంతట । నిక్కముసుమ్మి ॥ 288

తా॥ శిష్యా ! పరిపూర్ణమను ప్రభాతకాలమయ్యెను. యెఱుకయను జగంబులెల్ల కలవత్తుగా దోచిపోయెను. ఇదియే నిజము. నీవు పరిపూర్ణమునే నమ్మియుండుము, దిక్కులంతటను పిక్కటిల్లి పరిపూర్ణమే ప్రకాశించు చుండెను.

Dr DayanandaSwamy ebooks



క॥ ఖండా ఖండము లొందక । నిండిన పరిపూర్ణమెఱిగి
నెరియెఱుకను; దా । ఖండించి చిజ్జడంబుల । దండిగఁ బరిపూర్ణ
మెఱుఁగ ॥ నుండేవారెవరూ । మండితముగను, నిండువారెవరూ॥
ఎండలోపలనున్న, దండిచీఁకటిచాటు । మొండి దేహములేక,
నుండునట్లనెచూడు ॥ ముండెవారెవరూ ॥ 289

తా॥ శిష్యా! ఖండాఖండములుగాక నంతట నిండుకొని యున్న పరిపూర్ణమును దెలిసికొని, చిద్రూపముగాను, జడ స్వరూపముగా నుండెడి యెఱుకను విడిచి పెట్టుము, ఎఱుక వెడలి పోయిన పిమ్మట పరిపూర్ణము నెరుగు వారెవరు? ఎండయందు చీకటి నిలువకుండు నట్లు, పరిపూర్ణమందు యెఱుక నిలువకుండ బారిపోవును.

క॥ ఇదిమర్మమనుచు నెఱుఁగక । విదితజ్ఞులమను మ
ననెడు వేత్తలమాటల్ । మదిలోనిల్పకు, మంత్రము । మదిలో
మఱచుండబోకు ॥ మాబోధరీతి । నిశ్చలముగ, నిలుపువిఖ్యాతి॥
ఇదియదియనియెఱుక, యెప్పుడుగలిగితె । దప్పకుమీబోధ దైవ
మనెడుజ్ఞప్తి ॥ మాబోధరీతి ॥ 290

తా॥ శిష్యా! ఈ నే వచించిన దంతయు మర్మమని యెన్నక "మేమే వేదాంత వేత్తలము" అని పల్కుచుండెడి శాస్త్ర వేత్తల వాక్కులు విని వారి బోధలను నీ మనస్సున జొరనీయకుము నేను జెప్పిన మంత్రము నెప్పటికి మరువకుము. యీ బోధవల్ల నీ ప్రఖ్యాతిని నిల్పుకొనుము. ఇది యదియని నీ కెప్పుడు దోచునో, అప్పుడీబోధను నీ జ్ఞప్తికి దెచ్చుకొనుము. యీ బోధ నీకు దైవము వంటిదని తెలియుము.

క॥ కలవంటిది యెరుకను, తన । కలలోపలనయిన గాని
గానఁగఁ బోకఁ । గల మేలుకొనిన పిమ్మటఁ । గలయని జూడ

Dr DayanandaSwamy ebooks



కుమునీవు ॥ కాంక్షలులేక । యెన్నఁడు నీవా, కాంక్షల బోక । కాంక్షా కాంక్షల రెంటి, కలనైనదలఁక । కాంక్షలు గలయెరుక, కాలిపోయినవెనుక ॥ కాంక్షలులేక ॥ 291

తా॥ శిష్యా ! కలవంటిదైన యీయెరుకను నీకలలోనైన దలపోయకుము. ఎఱుక యను కలనుండి మెలకువజెందిన పిమ్మట నీవు యేలాటి కోరికలు లేక యెఱుకను స్వప్నమువంటిదని కూడ దలపకుము, యెన్నడు నీవా కోరికలను పొందకుము. యెఱుక నశించిన పిమ్మట, నీవు కలలో నైతము కోరికలుగాని, కోరికలు లేకుండి యుండుట గాని కోరకుము.

క॥ లేనివియై జగమెరుకలు । మానసమున సత్యమట్ల మసలకతోచుఁ । లేనివి లేవని చూచినఁ । దానన్నది లేక బయలు ॥ తానేయైయుండు । తెలివిలోఁ దెలివి తెలివిలేకుండు॥ అలసిన, దెలసిన, కలసిన, మెలసిన । వలసిన యదివెల్ల, విరిసిన రీతినిఁ ॥ దానెయైయుండు ॥ 292

తా॥ శిష్యా ! ఈ ప్రపంచము యెఱుక. స్వతః లేకుండిగూడ యున్నటుల సంచరించుచు కనబడును. లేనివియైన యీరెంటిని లేవని యెంచినచో, తానను అహంకారము నశించి, అంతా పరిపూర్ణమేయై యుండును. అన్నిటిని యెఱుక జేయునదగు తెలివి యనెడు యెఱుక లేక పోవును. అలసినను, తెలిసినను, కలసినను, వలసినను, మెలసినను ప్రకాశమానమై పరిపూర్ణ మెల్లెడల నిండియుండెను.

క॥ మాటల కుదురును లక్ష్యము । మాటలచేఁజెడును గురియు మర్మమెరిగినఁ । మాటలులేకయె బయలీ । మాటకునే చాటులేక ॥ మఱియుండునన్నా । చూపులచేత చూడరాధన్నా । రేపుమాపును లేదు, ప్రాపుదాపునులేదు । ఆపదసంపద, యంశము లేనిది ॥ మఱియుండునన్నా ॥ 293

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! మాటలచేతనే లక్ష్యము కుదురును. ఆ కుదిరినది మాటల చేతనే జెడును. యీరహస్య మెఱింగినచో, యేలాటి మాటలు లేకుండనే పరిపూర్ణము మాటల చాటున నుండక ప్రకాశించును. పరిపూర్ణమును చూపులతో జూచుటకు వీలుకాదు. దానికెప్పుడు పగలు రాత్రియులేదు. దూరము దగ్గర బాంధవ్యములు లేవు. ఆపదలు, సంపదలు లేవు.

క॥ తరమా పరిపూర్ణము గన । గురుకృప లేనట్టి నరులు
గురుతు లిడుటకై । పరమార్థ మెరుఁగ శక్యమె । గురుకృపచే
దెలిసెనేని ॥ గురుతుండదయ్యా । మరుగెరిఁగిన మరినిల్వదయ్యా॥
మరుగు దెలిసిమీఁద, మరియెరుక తాబోవు । మరుగుచేతనె
బహు, మాయల బెట్టును ॥ గురుతుండదయ్యా ॥ 294

తా॥ శిష్యా! గురుకటాక్షము లేనివారికి పరిపూర్ణమును గనుగొన తరముగాదు. గురుతులు పెట్టువారికి గూడ తరముగాదు. గురుకృపతో దెలిసికొన్నవానికి గురుతుండదు. యీరహస్యమును గనుగొన్నయెడల యెఱుక జారిపోవును. యెఱుక మరుగు చేతనే మానవులను మాయలో జొనిపించును.

క॥ ద్వయదోషరహితమగుచును । ద్వయదోషము బొంద
బోక దయశూన్యుడవై । ద్వయ మద్వయములుగాకను । ద్వయ
మద్వయ మనెడి యెఱుక ॥ దగులకతాను । మిగులుటలేక,
పగపునుమాను । పగలు రాత్రులుగాక పరిపూర్ణమైబయలు ।
వెలుగక మలుగక, తొలుగక గలుగక ॥ దగులుకతాను ॥ 295

తా॥ శిష్యా! ద్వయదోష రహితమై, ద్వయదోషములను పొందక, దేహాత్మలు లేక, ద్వైతాద్వైతములగు యెఱుకతో సాంగత్యము లేక, తాననున దేమియు లేక యుండుటచే దుఃఖములు గల్గకుండును. పరిపూర్ణము వెలుగక, మలుగక, తొలుగక, నలుగక నుండును.

Dr DayanandaSwamy ebooks



క॥ కూడి గురుశిష్యులిద్దరు । వేడుకతో బలునున్న విధ
మెఱిగెఱుకఁ । వీడిరిది లేనిదనుమా । చూడుమయిక యేమిఁ
దోఁచ ॥ దదియేమోకానీ । వింటిరెమీరలిది యందులోని ।
చూడుమీ యెఱుకను, వేడితి విడుమంచు । ఈడుజోడునులేని,
యేకమైవిలసిల్లు ॥ నదియేమోకాని ॥ 296

తా॥ శిష్యా! గురుశిష్యులిద్దరుగూడి సంతోషముతో నున్నబయలును దెలసి, లేని యెఱుకను విడచి పెట్టిరి. కావున యెరుక లేనిదనుము. అది యేమోకాని, అటుపిమ్మట యేమియు దోఁచదు. యిదిబాగఁగా విచారించుకొని యెఱుకను విడువుమని వేడుకోనుచుంటిని, ఈడు జోడు లేక యేకమై విరాజిల్లుచున్న పరిపూర్ణమును దెలిసికొనుము.

క॥ ఎరుక నెరుంగని బయలున । గురుఁడును శిష్యుండు
వారిగొడవలు యికఁమీ । రెరుగరు యెరుకనెరుంగరు । ఎఱిఁగిన
వన్నియును మీరె ॥ యేను నుళ్ళకిక్క । యుళ్ళకిక్కదా నెప్పుడు
ళ్ళకిక్క ॥ మరియింక మాటాడ, మాటలేదాయెను । సరిలేని
బయలైతె, సరిపోయె నటుమీద ॥ నేను నుళ్ళకిక్క ॥ 297

తా॥ శిష్యా! ఎరుకను యెరుగని పరిపూర్ణమందు గురుశిష్యుల సంవాదములు అగుపడవు, యెఱుకను జూడజాలరు. యెఱుక యిట్టిదని తెలిసికొన్నంతటనే "నీవు నేను" అను భేద భావము లేకపోవును. లేనిది యెప్పటికిని లేనే లేదు. పరిపూర్ణమును దెలిసికొనినచో అంతయు నబద్ధమేసుమీ; అటు పిమ్మట మాటలాడుటకు దోవయుండదు.

క॥ అల భద్రాచల మనినఁ బ । యలుగను గుర్తెరుగ
వలయు నెరుకయె, విఘ్నం । డిలదోచి గురుని కృపచే । నిలువక
విఘ్నేగిపోవ ॥ నిశ్చయమదెరా । కృష్ణదాసు, నిశ్చయమిదెరా ॥

Dr DayanandaSwamy ebooks



ఇలలోన నెవరైన, యీకందార్థములలో । వలిగూఢార్థము
తెలియ, భ్రమను జెందరువారు ॥ నిశ్చయ మిదెరా ॥ 298

తా॥ శిష్యా! భద్రాచలమును పరిపూర్ణముగా నెంచుము. ఎటులనగ విష్ణు రూపుడగు శ్రీరామ మూర్తిగా నెంచుము. గురుని కరుణవలన విష్ణురూపుడగు శ్రీరాముడు వెడలి పోయినచో, అవే నిశ్చయమగు పరిపూర్ణమని దెలియుము. ఇదియే గ్రంథకర్తయగు శ్రీ భాగవతుల కృష్ణదాసు నిశ్చయము. ఈ ప్రపంచ మందెవ్వరేనియు, ఈ కందార్థములయొక్క గూఢార్థమును దెలిసి కొనినచో, యేలాటి భ్రమలను జెందరు. యిది యదార్థము.

క॥ భాగవతుల నారాయణ యోగికి జానకియను నేటి యువతీ
మణికిఁ । బాగుగ పుత్రుఁడనై, భూ । భాగమునం గృష్ణుఁడ
నుచు ॥ ప్రభవించినాను । అనంతికి ప్రభుఁడనైనాను ॥ నాగురు
కృపచేత, నయమైన, యీబోధ । నేగంటి కన్నంత, నీకు దెల్పుట
కట్లు ॥ ప్రభవించినాను ॥ 299

తా॥ శిష్యా! భాగవతుల నారాయణ యోగికిని, జానకమ్మకును పుత్రుం డనై జన్మించి కృష్ణుండను పేర బరగితిని. అనంతమ్మయను నారీమణికి పెని మిటినైతిని. నాగురు మూర్తివల్ల గ్రహించిన యీ బోధను నేను గనిన పరి పూర్ణమును నీకు దెలుపుటకై యీ భూమిలో నవతరించితిని, మరియు,

క॥ దేశాటనంబుఁ జేసితి । వ్రాసితి గ్రంధములు కొన్ని
పరగురుశిష్యుల్ । చేసెడు చర్చలు వింటిని । రోసితి మోక్షాపే
పేక్ష ॥ రూఢిగ వినుమీ । నీవిట్టి యూ, రూఢతగనుమీ ॥ దేశికుఁద
యుబుట్టఁ జేసితి, శుశ్రూషాప । దేశముగని యుప దేశమిచ్చితి
మెచ్చి ॥ రూఢిగ వినుమీ ॥ 300

Dr DayanandaSwamy ebooks



తా॥ శిష్యా! నేను దేశములన్నియు దిరిగితిని, అచ్చటచ్చట గురు శిష్యులు జేసెడు చర్యలను వింటిని కొన్ని గ్రంథములనుకూడ వ్రాసితిని, మోక్షము మొదలగువాటిపై కోరికలను విడవి పెట్టితిని. నీవును నావలెగమ్మ, నీవు జేసినట్టి శుశ్రూషను గమనించి మెచ్చి గురుకృప నీపై గల్గునటుల యొనర్చి నీకుపదేశ మిచ్చియుంటిని.

క॥ ఏపురుషుఁడు గురువర్యుని । శ్రీపాదముబట్టలేడొ చెలువుగ నాతం । డీపుస్తకమును జూచిన । నేపట్టుననిలువ కేగు ॥ నిదినిజమయ్యా । నరులార మీమదిదెలెయరయ్యా ॥ ముదమున నిలువెడలి, మోక్షసతీశుఁడై । సదయుఁడౌ సద్గురుని సముఖమున నేగు ॥ నిదినిజమయ్యా ॥ 301

తా॥ శిష్యా! ఏమానవుడు సద్గురు పాద పద్మములను బట్టలేడో, అతడీ పుస్తకమును జూచినతోడనే అచ్చట నిలువఁ౦౦డ పారిపోవును. ఇది నిజము సుమా! ఇది మదియందిడుకొని యిల్లు వెడలివచ్చి, మోక్షశ్రీకి ప్రభుడైన సదయ హృదయుండగు సద్గురు మూర్తికి శరణుబొంది వారి ముఖమున యిందలి గూఢార్థమును దెలిసిన ధన్యుండగును.

క॥ ఘనులీ కందార్థంబులు । విని యీసారాంశమును గ్రహించినవారె । ల్లను దుద మోక్షమునొందుదు । రనవరతము నిహసుఖంబు ॥ లందుదు రిలనూ । అష్టైశ్వర్యానందులై తగను॥ పొందుగ ధనకనక, పుత్రపౌత్రులుగల్గి । సందేహముడిగి ని, శ్చలచిత్తముల సౌఖ్య ॥ మందుదురిలనూ ॥ 302

తా॥ శిష్యా! ఈ కందార్థములను విని, వీనిలోని సారాంశమును గ్రహించిన పుణ్యాత్ములు తుదకు బంధముక్తులగుదురు. యెల్లప్పుడిహ సుఖంబుల

Dr DayanandaSwamy ebooks



నొందెదరు. అష్టైశ్వర్యము లనుభవింతురు, సత్సంతానము వడసి నిర్మల చిత్తులై యుండెదరుగాక.

## గద్య

ఇది శ్రీమదచల గురువర్యుఁడు శివరామదీక్షితుని శిష్యుఁడైన అప్పయమంత్రికి శిష్యుఁడును పరశురామ వంశోద్భవ సీతారామ స్వాముల కత్యంత ప్రియ శిష్యుఁడును, సుజన విధేయుండును పరిపూర్ణుండును భాగవతుల నారాయణయోగి జానకమ్మకు పుత్రుండునునైన భాగవతుల కృష్ణ దాసాఖ్యునిచే రచియింపఁడిన ఎఱుక అబద్ధ మనియు, పరిపూర్ణమే నిజమనియు దెల్పెడు శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థములు సర్వము తాత్పర్య విశేషార్థ సహితము సంపూర్ణము

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.